శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పదిహేనవ సంపుటము

రచయిత :
విమర్శకాగ్రేసర :
శ్రీ చాగంటి శేషయ్యగారు

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పదిహేనవ సంపుటము

రచయిత :
విమర్శకాగ్రేసర :
శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము
A 103 - ఎం. ఎం. అపార్టుమెంట్సు
అడికిమెట్, హైదరాబాద్ - 44.

# విషయసూచిక



కీ. శే. చాగంటి గోపాలకృష్ణమూర్తిగారు M A
[ 1926-1995 ]

శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తి (1926-'94) ఆంధ్రకవితరంగిణి 'శేషయ్య' గారి కుమారుడు. ఉన్నత పాఠశాల చదువు రామచంద్రపురంలో నడిచింది. అప్పుడే గోదావరి పుష్కరాలపై హృద్యంగా వ్రాసిన కవిత సాహిత్య పత్రిక 'భారతి' తొలిపుటల్లో అచ్చయింది. అదిచూచి ఆనాటి అధ్యాపక పండితులు ఇంద్రకంటి, వెంపరాల, దేవగుప్తాపు విశ్వేశ్వరశర్మ, పులుగుర్త రామారావులు అబ్బురపడ్డారు భుజం తట్టారు. అంతకుముందు పన్నెండేండ్ల వయస్సులో ఒక దండకం వ్రాసినాడు. కాకినాడలోని పిఠాపురం రాజావారి కళాశాలలో ఇంటర్ చదివినప్పుడు (1944-46) బోడపాటి కుటుంబరాయశర్మ, కోపల్లె శివకామేశ్వరరావు ప్రభృతులు అతనిలోని సాహిత్యపిపాసను ప్రోదిచేశారు.

తండ్రిగారు 'లా' చదివిద్దామనుకొన్నారు. అయితే అతని అభిరుచి తెలుగులో ఉండటంవల్ల ఆంధ్ర విశ్వకళాపరిషత్ లో తెలుగు ఆనర్సులో (46-49) చేరి చదివినాడు. విద్యార్థి దశలోనే వివాహమయింది. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారికి ప్రియతమ శిష్యుల్లో ఒకడైనాడు. వారి ఆచార్యకత్వంలో ఆఖరి 'బ్యాచి' విద్యార్థి. అక్కడున్నప్పుడే కవితా సిద్ధాంత రహస్యాలను పింగళివారినుండి ఆకళించుకొన్నాడు. ఆనర్సులో సర్వప్రథముగా ఉత్తీర్ణుడై సువర్ణ పతకాన్ని చూరగొన్నాడు.

జన్మతః ప్రతిభావంతుడు. నిరంతరాధ్యయనం వ్యుత్పన్నతను పెంచింది. సంస్కృత కావ్యాలను, వ్యాకరణాన్ని వాళ్ళ ఊళ్ళో కపిలేశ్వరపురంలో చిలుకూరి వీరభద్రశాస్త్రిగారికడ శ్రద్ధగా అధ్యయనం చేశాడు. అలంకార గ్రంథాలపై అతడొక 'అథారిటీ'. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పండితుడుగా (1950) ప్రవేశించి, అచిరకాలంలోనే ప్రభుత్వ కళాశాలల్లో ఆంధ్రశాఖాధ్యక్షుడై ఇంచుమించు మూడు దశలపాటు పనిచేసి 1982 లో రిటైరైనాడు. పలు భాషా నిర్ణాయక సంఘాలలో సభ్యుడు. కొంతకాలం రాష్ట్ర విద్యాశాఖ డైరక్టరేటులో 'లాంగ్వేజి ఎక్స్పర్టు'. అతను బదిలీ అయిన తర్వాత ఆపదవి రద్దయి పోయింది.

ఈశతాబ్ది ఉత్తరార్ధంలో ఉత్తమకావ్యంగా పింగళి, కాటూరి రాళ్ళపల్లివంటి ఉద్దండులచే ప్రశస్తిగొన్న 'హేమమాలి' కావ్యాన్ని (1962) ప్రచురించినాడు. అందులో ఆయన భావుకత పరవళ్ళు తొక్కింది. ప్రౌఢత నిండారింది. పూర్వకవి సుధాచర్వణ ప్రౌఢత సర్వత్ర గోచరిస్తుంది ఆ శారదా విధేయునిలో. తత్వ ప్రధానక మయిన 'విక్రమోర్వశీయ' మహాకావ్యం నాలుగో ఆశ్వాసం వ్రాస్తుండగా 1-9-94 న హైదరాబాదులో పరమపదించినాడు. రసవత్ ఖండకృతులు మరెన్నో ఉన్నాయి. వ్రాసిన ప్రతిపద్యం సానలుదీరిన జాతిరత్నంలా మెరుస్తుంది. ఏనాటికీ నిల్చే కవిత వ్రాసి అజరామరుడైన మనస్వి., యశస్వి శ్రీ గోపాలకృష్ణమూర్తి.



ఓం.

డా॥ పోచిరాజు శేషగిరిరావు, 16-4-94
హైదరాబాదు.

# తరంగవీచికలు

మాన్యులు శ్రీ చాగంటి శేషయ్యగారు (1881-1956) సమగ్ర ప్రణాళికతో రెండు దశలపాటు భగీరథకృషిచేసి, ఏకాంగవీరులైజి ఇరవైయైదు సంపుటాల వ్యాప్తి కలిగిన ఆంధ్రకవితరంగిణి ఐదువేల పుటల గ్రంథంగా రచించి ఆంధ్ర సరస్వతీ పాదాలకు పాద్యంగా ఒసగి ధన్యులైన మహనీయులు. ఆంధ్ర కవితరంగిణి తొలిసంపుటం 1947లో వెలువడింది. ఆ గ్రంథమును సమాలోకించి, లబ్ధప్రతిష్ఠులైన చేయితిరిగిన వేత్తలు చెళ్ళపిళ్ళ, కట్టమంచి, రాయప్రోలు, పింగళి, పి. వి. రాజమన్నార్ ప్రభృతులానాడే వారి కృషికి నీరాజనం పట్టినారు గుణ వివేచనం చేస్తూ. ప్రామాణిక రచనగా డా॥ నేలటూరి, ఆచార్య కోరాడ ప్రభృతులు పేర్కొన్నారు. శ్రీ శేషయ్యగారుండగా 12 సంపుటాలు వరుస వరుసగా వెలుగు చూచినాయి. ఆంధ్ర ప్రజానీకం ఆదరించింది. వారు 1956లో కీర్తిశేషులు కావటంతో ఆంధ్రకవితరంగిణి ప్రచురణ మందగించింది. పన్నెండో సంపుటానికి సుప్రసిద్ధ చరిత్రవేత్తలు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు (1891-1963) పటువైన పీఠికను సంతరించి పెట్టినారు.

మరో పదిహేను సంవత్సరాలు గడచిన తర్వాత కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి ఆర్థిక సహాయంతో 13వ సంపుటమూ (1969) 14వ సంపుటమూ (1971) వెలువడ్డాయి. అవి వెలువడికూడా

ఈనాటికి 23 సంవత్సరాలు దాటింది. ప్రచురణలో కాలవిలంబం ఎక్కువ కావటంవల్ల, ఆంధ్రకవితరంగిణి సంపుటాలు సాహిత్యలోకంలో క్రమానుగతంగా పొందవలసిన ప్రచార, ప్రశస్తులు పొందలేదోమో అనిపిస్తుంది నామటుకు. ఈలోగా సాహిత్యచరిత్ర లెన్నో పుట్టినాయి అయినా తొలి సంపుటాల మీద ఆంధ్ర ప్రజాహృదయంపై చెరగకుండానే ఉందని సాహిత్యగోష్ఠుల్లో వెల్లడవుతూనే ఉంది.

ఆంధ్రకవితరంగిణి రచన కుపక్రమించకముందే 1911-25 నడుమ నవలారచయితగా వారిపేరు చదువరులందరికీ ప్రఖ్యాతంగా తెలిసిందే. 1911 సంవత్సరం నిడదవోలులో ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల స్థాపకులు ముగ్గురు. వీరు శ్రీ కొవ్వూరి చంద్రారెడ్డిగారు, శ్రీ అయ్యగారి నారాయణమూర్తిగారు, శ్రీ చాగంటి శేషయ్యగారు. శ్రీ చాగంటి శేషయ్యగారు బెంగాలీభాషనుంచి అనువదించిన "దుర్గేశనందిని" ఆంధ్రప్రచారిణి గ్రంథమాల మొట్టమొదటి ప్రచురణ. తరువాత వీరు "రాధారాణి" ఆంగ్లమునుంచి; కన్నడంనుంచి "నవాబు నందిని" (1915) అనువదించినవి, "శ్రీ" "విశ్వప్రయత్నం" వీరి నవలలు వరుసగా ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలో ప్రచురించినారు. 'విశ్వప్రయత్నము' (1925) అనే నవల వారి స్వకపోలకల్పన అది కపిలేశ్వరపురం జమీందారులు శ్రీ శ్రీ బలుసు బుచ్చి సర్వారాయ బహద్దరువారి కంకిత మిచ్చినారు. ఆ దానప్రధాన కార్యక్రమంలో తెలుగువారు ముఖ్యంగా వంగసాహిత్యాన్ని మధించి ఒంటపట్టించుకొని, ఆభాషలో ప్రసిద్ధులైన బంకించంద్ర, టాగూరు, శరత్ వంటి వారి నవలలు, కవితలు తెలుగులోకి తెచ్చారు. భావకవుల్లోనూ కొందరా ప్రభావానికి లోనైనవారే. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ద్వారమున ప్రచురింపబడ్డ శేషయ్యగారి రచనలుఆంధ్రుల మనస్సుల్లో నిత్యనివాసం ఏర్పరుచుకొన్నాయి.

శ్రీ శేషయ్యగారు తెలుగులో న్యాయశాస్త్ర గ్రంథాలు - చట్టాలు ఆంగ్లంనుంచి అనువదించి న్యాయవేత్తలు సర్ అల్లాడి

కృష్ణస్వామి అయ్యంగారివంటివారి ప్రశంసలు చూఱగొన్నారు. అదంతా ఒక మజిలీ.

తొలినుంచి శేషయ్యగారిలో వాఙ్మయాభిలాష బీజప్రాయంగా ఉంటూనే ఉంది. దానికితోడు గొప్పచదువరి. సూక్ష్మగ్రాహి. ఆకళింపు విశిష్టమైనది. స్వయంప్రజ్ఞాచాలనం వల్లనూ ప్రతిభా పాటవంచేతా, అలుపెరుగని శ్రమవల్లనూ ఆంధ్రకవితరంగిణి రచన వారికివారై తలకెత్తుకొన్నారు. కవిచరిత్రలు నిర్మిస్తేనేగాని తెలుగువారి సాహిత్యనిధులు పరిపూర్ణంగా బయల్పడవని ఆయనగారి విశ్వాసం.

ఇరవైదేండ్లపాటు ఏకధాటిగా కన్నుపొడుచుకొని స్వయంగా తాళపత్రగ్రంథాలు పరిశీలించుట - శిలాలోహ శాసనాల అనుశీలన- మద్రాసుప్రాచ్య లిఖిత పుస్తకశాలలో నిర్విరామంగా ప్రాతవడ్డ కవిలెలు పట్టిపట్టి చూచి వివరాలు సేకరించుట - వాటి వింగడింపు - వందలకొద్దీ పత్రికా సంపుటాల సమీక్షణ - విద్వాంసులతో గోష్ఠులు - తత్సంబంధీకులతో వివరాల సేకరణకై ఉత్తరప్రత్యుత్తరాలు - పురావస్తుశాఖలు ప్రచురించిన శాసన సంపుటాల శోధన - సాహిత్య చరిత్రపై వస్తున్న గ్రంథాలనుంచి అవసరమైన క్రోడీకరణలు, ఏ పొరపాటూ దొరలకుండా స్వయముగా ఎత్తివ్రాసికొనుట - సహజంగా తీర్పరి అవడంవల్ల వాదప్రతివాదా లుట్టంకించి హేతుబద్ధంగా శాస్త్రీయ పద్ధతిలో నిగ్గుతేల్చి నిర్ణయాలు తీసుకొనటమూ ఇట్లా సాగింది ఆయన వాఙ్మయాధ్వరము. ఆయనే హోత, ఆయనే ఉద్గాత, ఆయనే యజ్ఞకర్త. ఫలభోక్తలు ఆంధ్రప్రజానీకమూ, సాహిత్యలోకమున్నూ. ఇంతపనీ తనకు తానై భుజాలపై వేసుకొని కడచన్నవారి అడుగుజాడలు చూచుకుంటూ, త్రోవలో కంటకాలు ఛేదించుకొంటూ కొత్తదారులు వేసుకొంటూ ముందుకుసాగి గమ్యం చేరుకొన్నారు. ఆయనది భల్లాతకపు పట్టు.

ఫలితం సాధించేదాకా సడలని ప్రవృత్తి. ఎన్ని ఆటంకాలు, క్లేశాలు కలిగినా, తీరని వేదనలు కలచివేస్తున్నా చిత్తసమాధి చెడనీక తలపెట్టిన కార్యం సాంతం నిర్వహించిన పరిశోధక ధూర్వహుడు. ఆ తరం మనుషులే అంత అనిపిస్తుంది. ఒక వేటూరి, ఒక మానవల్లి, ఒక మల్లంపల్లి, ఒక నిడదవోలు ఇట్లా ఎందరని చెప్పటం! అవిరళ కృషికే వారు జన్మించారు. లౌకిక సుఖాలు వారికి పట్టవు. వాటికై చింత లేదు. సంపాదనధ్యాస లేదు. వ్యయ, ప్రయాసల గణింపు లేదు. అవి ఆనాటి సాహిత్య వరివస్య గావించిన వారి సంగతులు. ఏ సన్మానాల పొంతకూ పోలేదు, వారికా విచారమూ లేదు. సిసలైన కృషి, గుర్తింపుల కోసం ఆరాట పడరు. తామెన్నుకొన్న మార్గంలో పనులు చేసుకొంటూ పోవటమే.

ఒక్క మనిషి - అదీ మారుమూల పల్లెటూరు కపిలేశ్వర పురంలో (తూ॥ గో॥ జిల్లా) ఉండి, జమీందారులు శ్రీ శ్రీ బలుసు బుచ్చి సర్వారాయుడుగారి కొలువులో సాచివ్యం నెరపుతూ, రాచకార్యాలు చక్కబెట్టుకొని, జమీలో రైతుల తగాదాలు తీరుస్తూ క్షణం తీరిక లేక పగలంతా వ్యవహారాల్లో తలమునకలై ఉండే శేషయ్యగారు ఎప్పుడీ సాహిత్య కార్యకలాపమంతా దిద్ది తీర్చినట్లు! అంతుపట్టదు. 19వ శతాబ్దానికి పదుమూడు వందలమంది కవులు న్నట్లు నిగ్గు తేల్చి చెప్పినారు. అంతకుముందేక విచరిత్రకారులకూ ఇంతమంది కవులున్నట్లు గమనమే లేదు.

మళ్ళీ ఇన్నేళ్ళకయినా ఆంధ్ర కవి తరంగిణి పదునైదవ సంపుటం తెలుగువారి చేతుల్లోకి రావటం అదృష్టం. అయినా మూలగ్రంథం మిగిలేఉంది కొంత. ఆంధ్రులందించే సహాయ సహకారాలపై ఆధారపడి ఉంటుంది వాటి ప్రకటనావకాశం.

వారు సంకల్పించిన నాటికీ నేటికీ కాలగతిలో - ప్రజల అభిరుచుల్లో - తీరుతెన్నుల్లో - జీవన విధానాలలో - అనూహ్యమైన మార్పులు వచ్చినాయి. విలువలు తల్లక్రిందులవుతున్నాయి కొత్త చివుళ్ళు వచ్చినా రాకున్నా, పాతవి మోడువారుతున్నాయి. ప్రస్తుత సమాజం సందిగ్ధస్థితిలో ఉన్నదేమో అనిపిస్తుంది.

సాహిత్య చరిత్రకారులు ఒక కాలపరిధిని క్షీణయుగమని ఎందుకు పేర్కొన్నట్లు? అంతుపట్టదు. ఈయుగ కవుల్లోనూ ప్రతిభా సముద్రులు లేకపోలేదు ఏ యుగంలోనూ ప్రతిభా రహితులూ ఉంటారు, అనుకరణ జీవులూ ఉంటారు. ఎటొచ్చీ సంఖ్య భేదింపవచ్చు. ఏ యుగమూ పూర్తిగా కాంతి చక్రమూ కాదు. రెంటి సమ్మిశ్రణం ప్రతిసాహిత్య యుగంలోనూ ఉంటుందనుకొంటే సరిపోతుంది. అభివ్యక్తిలో తరతమాలుండవచ్చు. మేలైన కవితలు ఒక యుగంలోనే పుడతాయనుకోవటం అంత ఒప్పిదంగా కనిపించదు.

ప్రస్తుతసంపుటి, పైన పేర్కొన్న యుగంలోకే వస్తుంది స్థూలంగా. కుందుర్తి వేంకటాచలకవినుంచి మొదలుపెట్టి ద్వ్యర్థి కావ్యకర్త పిండిప్రోలు లక్ష్మణకవి వరకూ 144 మంది కవులీ సంపుటిలో నెక్కొన్నారు. భక్తకవయిత్రి తరిగొండ వెంగమాంబ వేంకటాచలమహాత్మ్యము సుప్రసిద్ధము. ఈమె రచించిన నాటకాలు మొన్న మొన్నటివరకూ తెలుగునాట పల్లెసీమల్లో ప్రదర్శింపబడుతూ జనాదరాన్ని చూరగొన్నాయి. ఇప్పుడామె తిరుమలపై వసియించిన యింటిని పునరుద్ధరించి - ఆ స్మారక భవనంలో భాగవత కార్యకలాపములు నెఱపుటకు తిరుమల తిరుపతి దేవస్థానమువారు యత్నపడుచున్నట్లు విన్నాను. ఈ సంపుటిలో మరొక ప్రసిద్ధకవి ములుగు పాపయారాధ్యులవారు. దేవీ భాగవతాంధ్రీకర్తలలో ప్రథములు. ఈయన కళ్యాణచంపువు, ఆర్యాశతీ శివస్తోత్రము

వంటి సంస్కృత గ్రంథములే కాక వేమనారాధ్య చరిత్రము, సరస హృదయానురంజనము, ఘూర్జర చరిత్రము, శంతను చరిత్రము, సర్వ మధురము మున్నగు కృతులెన్నింటినో రచించి ప్రసిద్ధిపడసినవాడు. దేవీభాగవతమును ఆతర్వాత దాసు శ్రీరామకవిగారు, తిరుపతి వేంకట కవులు తెనిగించుట జరిగింది. ప్రతిభాసంపన్నుడైన కవి. అల్లె వక్కలంక వీరభద్రకవి వాసవదత్తాపరిణయము పిఠాపురసంస్థానాధిపతి శ్రీ రావు మాధవరావు మహీపతి కంకితమొసంగబడిన ఉత్తమ ప్రబంధము. 'శేమధర్మములు' రచించిన వెణుతురుమిల్లి విశ్వనాథకవి కీయన మనుమడు. పిండిప్రోలువారి రావణదమ్మీయమువంటిదే పన్నాల బ్రహ్మకవి 'ఖలకర్ణవిషాయనము' సంగతి. ఇదీ తిట్టుకవిత కోవలోనిదే. కూచిమంచి జగ్గకవి, అడిదం సూరకవి, కవిరాజ మనోరంజనము, అనిరుద్ధ చరిత్రలు రచించిన కనుపర్తి అబ్బయామాత్యుడు ఈసంపుటిలో చేరినవారే. నిరోష్ఠ్య నలరాజ చరిత్రకర్త కుద్రిరాజు తిరుమలరాజు, సాహిత్యలోక మింతవరకెరుగని నెల్లూరి శివరామకవి ఈసంపుటిలో దర్శనమిస్తారు. గొల్లవేషకథ (యెడిద భాగవతము) రచించిన ఆత్రేయపురపు తమ్మయ్య, రాధామాధవ సంవాదమనే రసవత్ పద్యకృతి వెలయించిన వెలిదిండ్ల వేంకటపతి, పలువురు యక్షగానకవుల చరిత్రలు ఈ కొత్త సంపుటిలో ఉన్నాయి ఎన్నో విశేషాలతో వెలువడ్డ కవిజీవితాల సంపుటమిది.

ఈ గ్రంథము నేటికి అర్ధశతాబ్దికి పూర్వదట రచింపబడినది. ఈలోగా సాహిత్య చరిత్రలు, కవుల చరిత్ర సంపుటాలు ఎందరో రచించారు. చెప్పినా చెప్పకపోయినా వారికి ప్రధానమైన ఆకరము ఆంధ్రకవితరంగిణి అనేమాట సత్యం. శ్రీ శేషయ్యగారు ప్రతిపాదించిన అన్నిసిద్ధాంతాలూ అందరికీ ఆమోదయోగ్యం కాకపోవచ్చును. కొత్తకొత్త ఆధారాలు, ప్రమాణాలు అనంతరకాలంలో లభించుటతో పూర్వనిర్ణయాలు మారటం సహజము. ఆయన తనకాలంనాటికి లభించిన సర్వసామగ్రి విశేషాన్ని కూలంకషంగా శోధించి నిర్ణయాలు

గైకొనటం జరిగింది. ఎవరుచేపట్టినా అదేపద్ధతి, సత్యనిరూపణమే అందరి లక్ష్యమూ కొత్తకోణంనుంచి సాహిత్యచరిత్రలు నిర్మిస్తున్న వారున్నారు. వాటి పునాదులు వేరు. తీర్పుపద్ధతివేరు. అవీలోకం సమాదరింపదగ్గవే. పరిణామశీలత కాలానికున్నట్లే వాఙ్మయానికీ ఉంది. ప్రామాణికమైన శాస్త్రీయ పద్ధతులలోనే ఆంధ్రకవితరంగిణి రచన నడిచిందనిమాత్రం ఒప్పుకోవాలి.

శ్రీ శేషయ్యగారు గురుకులక్లిష్టులూ కారు, పట్టభద్రులూ కారు. సర్వమూ స్వయంకృషి. వారిమనీష అనిదంపూర్వమైనది. అవగాహన దొడ్డది. ఆంధ్ర గీర్వాణాంగ్ల భాషలతోపాటు కన్నడ వంగభాష లనూ వశముచేసుకొన్నారు. స్వయంభువమైన ప్రజ్ఞకు ప్రతిభతోడై నిర్విరామకృషితో బృహద్గ్రంథాలెన్నో రచించారు. హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము స్థాపించి కొన్నిప్రచురణలు చేసినారు.

ఎప్పుడో 1943-44 ల్లో నేను తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చరణసన్నిధిలో విద్వాన్ చదువుకొంటున్నాళ్ళల్లో - మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారం తిరుపతిలో తాత్కాలికంగా ఉంటూ వచ్చింది కొన్నిగ్రంథాల లిఖితప్రతులనుండి, ఎడనెడ శ్రీ శేషయ్య గారు ( మాపెదనాన్నగారు ) నిర్దేశించిన సమాచారాన్ని, ఆయా ప్రతులనుంచి ఎత్తివ్రాసిపంపే అదృష్టం కలిగింది. అది ఉడతాభక్తి, ఏబదియేండ్లు కాలచక్రం దొర్లాక (1994) ఈపదునైదవ సంపుటానికి పీఠిక వ్రాయటం ఒక చిత్రమైన సంఘటన !! శ్రీ శేషయ్యగారి కుమారులు - సాహితీపరంగా చాగంటి గోపాలకృష్ణమూర్తి శ్రమించి, వ్యయప్రయాసలకోర్చి ఈసంపుటం వెలువరించటం అభినందనీయం.

ఆంధ్రుల సంస్కృతికి సంగీత - చిత్ర, శిల్పకళ లేంతదోహదం చేశాయో సాహిత్యమూ ఇంకోపాలెక్కువేచేసింది. సంస్కృతీ

పరిపోషణలో కవులదే తొలినుంచీ ఎక్కువపాలు. అట్టి కవుల చరిత్రలు - తత్కాలీన సమాజస్థితిగతులు తెలిసికొనటం జాతికి ఎక్కువ అవసరం. వాటికి కవుల సమగ్రచరిత్రలు మిక్కిలి ఉపకరిస్తాయనటంలో సందేహంలేదు. ఆపనికి పూనుకొని ఆంధ్ర భాషాసరస్వతీసమర్చనంచేసి ధన్యులైన శ్రీ శేషయ్యగారికి తెలుగువారెంతో ఋణపడి ఉన్నారు విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, విద్యాశాఖాధికారులు ఈ సంపుటానికి తగు ప్రోత్సాహమీయగలరని ఆశిస్తున్నాను.



శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

—※—

## 391. కుందుర్తి వేంకటాచలకవి

ఇతఁడారువేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; శాండిల్య గోత్రుఁడు; రామయామాత్య ప్రసన్నాంబలకుఁ బుత్త్రుఁడు; గోవిందకవికిఁ బౌత్త్రుఁడు. ఈ గోవిందకవి 'భారతీ పరిణయము'ను రచించి వీరవెంకటపతిరాయల కంకితము చేసియుండెను; ఆతని చారిత్రమును వేఱుగ నీగ్రంథమున వ్రాసియున్నాఁడను. * ఈ వేంకటాచలకవి మిత్రవిందా పరిణయ మను నాలాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి శ్రీరంగేశునకుఁ గృతి యొసంగెను. ఈతఁ డనేక నాటకములను రచించినట్లును భారత భాగవత రామాయణములను వచన కావ్యములుగాఁ జేసినట్లును బాండ్య దేశాధీశుఁడైన విజయరంగ చొక్కభూపాలునిచే ననేక బహుమతు లందినట్లును మిత్రవిందా పరిణయమునందలి యీక్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. చదివినా వేమేమిచదువ యోగ్యంబులో
యవి యెల్ల నిస్సంశయంబుగాఁగ
వచనకావ్యములుగా రచించినావు భా
రతభాగవతములు రామకథయు
ఘటించినావు ద్రాక్షపాకముగ బహు
నాటకములు సమున్నతిఁ దెలంగఁ
జాటించినావు దిక్కోటరాంబుల బుధ
కోటి మెచ్చనపార చాటుకృతుల

* ఆంధ్ర. క. త. 11 సం॥ పుట 130 — 132.

నర్థగుంభసముజ్జృంభితాశు మధుర
చిత్రవిస్తరకవితాప్రసిద్ధి నీకు
సహజమే కద ! పాండ్యభూజానిసభఁ గ
ఛాశుకవియనఁ గీర్తిఁ జెన్నలరినావు

చ. కవిజనకల్పకం బఖలకావ్యరసజ్ఞుఁ డఖండ పాండ్యభూ
ధవుఁడు మహానుభావుఁ డతిధార్మికుఁ డర్యగవజ్రధారయై
న విజయరంగచొక్కనవనాధుఁడు నీకవితాసమగ్రవై
భవములు మెచ్చి నీ కొసఁగె భర్మమణీశిబికాదిసంపదల్.

ఈకవి జనకుఁ డయిన రామయమంత్రి పాండ్యరాజుకడ మంత్రియై యున్నట్లీక్రిందిపద్యములో నుడివియున్నాఁడు.

మ. అనవధ్యాయతకీర్తి పాండ్యవసుధాధ్యక్షుండు దక్షుఁడు స
జ్జన పర్యాయసురద్రుమం బహితరాజన్యచ్ఛిదా కేళిసం
జనితోల్లాసుఁడు మంత్రిహేళి యని తన్నర్వోన్నతశ్రీవిలా
సునిఁ గావింపఁ దదున్నమద్భుజమనా సొంపొందు నెల్లప్పుడున్.

వెంకటాచలకవికి మాతామహుఁడైన చెన్నమరాజు వెంకటపతయ్య వేదాధ్యయనసంపన్నుఁడై యజ్ఞములు చేయుటయేగాక శూరాగ్రేసరుఁడై యొక్కదినమున నేడుకోటలను జయించిన ట్లీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు

సీ. అఖిలశ్రుతులు నేర్చె ననుమాత్రమే గాదు
స్థిరశతక్రతువులు చేసె నెవఁడు
రాయమంత్రీంద్రుఁడన్ బ్రాఛిమాత్రంబె కా
దొకనాఁటఁగోట లేడోడిచె నెవఁడు
దానకర్ణుఁ డదువార్తామాత్రమె కా ద
భీష్టార్థ మర్థుల కిచ్చె నెవ్వఁ
డైశ్వర్యవంతుఁడౌ నను మాత్రమే గాదు
కరిఘట లొగ్గసాలఁ గట్టె నెవ్వఁ

డట్టి చెన్నమరాజ శతాధ్వరికుల
కలశవారాశిచంద్రుఁ డాగంద్రకోట
వేంకటపతయ్య తనకూఁతుఁ బెండ్లి సేయ
నతఁడు నేకోన నల ప్రసన్నాంబ నెలమి.

చారుచంద్రాయ మనుకావ్యమును రచించిన చెన్నమరాజు
చెన్నమరాజు వంశములో వెంకటపతయ్యయను నాతఁడొకఁడున్నాడు.
వారు నందవరీకనియోగులు. ఈ వెంకటాచలకవి యారువేలనియోగి.
ఈరెండు శాఖలును సంబంధబాంధవ్యములను నెఱపుకొనినట్లు కాన్పిం
పదు అందుచే నా చెన్నమరాజు వెంకటపతయ్య యీతఁడే యైనచో
నీరెండు శాఖలకును బాంధవ్యమును గలుపుకొనుచుండిరని నిశ్చయింప
వచ్చును. వెంకటపతయ్యను గూర్చి చారుచంద్రోదయకర్త వ్రాసిన
పద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. ఎలమి బ్రాహ్మణపల్లె నేమంత్రి శిల్పో గో
పాలదేవునకు దేవాలయంబు
నేడకిపురమున నేమంత్రి తిలకుండు
వనము వేయించె పావనముగాఁగ
నిష్టారము లొసంగి యేమంత్రి చెప్పించె
వేదశాస్త్రంబులు విప్రతతికి
భువన ప్రసిద్ధమై పొలుపొంద నేమంత్రి
చెఱువు గట్టించె నచ్చెరువుగాఁగ

ఈ వెంకటాచలకవి తనకు రేపూరి కాళహస్తి పండితుఁడు గురు
వైన ట్లీక్రిందిపద్యములలో వ్రాసికొనియున్నాఁడు.

సీ. అష్టభాషామహితాశుప్రబంధ ని
ర్మితచాతురీధుర్య శతసహస్ర
లేఖినీ లేఖ్యకవిత కవిత్వాపాద
నాహృతవ్యస్తాక్షరాదిచతుష్కఁ

జలజిహ్వాకాచలాచల జిహ్వాకాచల
జిహ్వాకారచనావిశేషనిపుణు
నోష్ఠ్యనిరోష్ఠ్యవర్ణోదీర్ణకల్ప నః
గతినత్రిపాదసంఘటనకుశలు

నఖిలలక్షణలక్ష్యసిద్ధాంతపాణి
నీయకాణాదకాపిలానేకతంత్ర
కోవిదుని రేపురికులాబ్ధికుముదబంధుఁ
జెలఁగి మదిఁ గాళహస్తి దేశికుభజింతు.

ఈ కాళహస్తిపండితుఁడు గాధేయోపాఖ్యానమును రచించిన రేపూరి అనంతయజ్వకగ్రజుఁడు.

శ్రీరంగేశుఁ డీకవికిఁ స్వప్నమునఁ ప్రత్యక్షమై —

ఉ॥ నీవొనరింపఁ బూనిన యనిందితకావ్యమణీసురాగబా
గ్భావుకపుష్ప గుచ్ఛరసవై ఖరికిం గడఁః జిక్కి సొక్కి మ
ద్భావమిళింద మట్లగుట భక్తి సమర్పణ మాచరింపు మెం
తే విభవంబు లబ్బునని నిత్యదయాపరిపూర్ణదృష్టితోన్.

అని యానతిచ్చెనఁట!

మిత్రవిందకును శ్రీకృష్ణునకును జరిగిన పరిణయగాథ యిందు వర్ణితమైనది. ఇది యింకను ముద్రితము కాలేదు శిథిలావస్థలోనున్న తాళపత్రప్రతియొకటియు, కాగితపుప్రతియొకటియు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందున్నవి. ఈతని గ్రంథములు తక్కినవి నామావశేషము లైనవి.

ఈకవిపూర్వులు బళ్లారి మండలమునందలి కుందుర్తి నివాసులైనట్లును, నితని తండ్రికాలమును బాండ్యదేశమునకేఁగి మంత్రిపదవి వహించినట్లును గన్పట్టుచున్నది. ఈకవి విజయరంగచొక్కనాథునిచే బహూకరింపబడినట్లు పై పద్యములో జెప్పుకొనియున్నాడు. చొక్క

నాథభూపాలుఁడు క్రీ. శ. 1706 మొదలు 1732 వఱకు రాజ్యమేలిన వాడు. కావున నీకవి యీకాలమున గ్రంథరచనము గావించి యుండును. కవికాలము 1680 — 1750 అయియుండు ననినిశ్చయింప వచ్చును.

విజయరంగచొక్కభూపాలుఁడు కవి. శ్రీరంగమహాత్మ్యము మాఘమహాత్మ్యము అను రెండువచనకావ్యములను రచించినవాఁడు. కావున నాతనిచారిత్రమును వేఱుగా నిందు వ్రాసియున్నాఁడను వచనకావ్యరచనమునందా భూపాలునకుఁ బ్రీతియధికము. అందుచే దాను రెడువచనకావ్యములను రచియించుటయేగాక తన యాస్థాన పండితునిచే భారతభాగవత రామాయణములను వచనమున రచియింపఁ జేసెను.

ఈతఁడు రచించిన మిత్రవిందా పరిణయమునందలి యవతారిక లోని పద్యము నీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

సీ॥ ఘనుఁడు మీముత్తాత కవ్యహోబలమంత్రి
గజపతిసభ నుతుల్ గాంచి మించె
మీతాత గోవిందమేదినీసురుఁడు రా
ములచేతఁ గాంచె స్వర్ణాభిషేక
మనఘుఁడు మీతండ్రియును బాండ్యచొక్కనా
థావనీశ్వరున కత్యాప్తుఁడయ్యె
నీపూర్వవంశజుల్ నెలకొని రాయసం
స్థానంబుననె కీర్తి నవధరించి

గీ॥ రనుచులోకప్రసిద్ధులై తనరిరి గద!
నీవు వారలవలెనె యనేక కావ్య
నాటకసమగ్రరచనల మేటివైతి

... ... ... ... ...

పై పద్యములను బట్టి నీతనివంశమును నీక్రిందఁ జేర్చు చున్నాఁడను.

అహోబలమంత్రి
|
గోవిందమంత్రి (భారతీపరిణయకర్త)
|
రామయమంత్రి (భార్య ప్రసన్నాంబ)
|
వేంకటాచలకవి (మిత్రవిందాపరిణయాది కృతికర్త)

ఈతఁడు రాశ్వాసములు గల కార్తికమాహాత్మ్యమను నొక పద్యప్రబంధమును తీర్థపుర (తుర్రెయూరు) పాలకుఁడగు బంగోలు లింగారెడ్డి (పేరమ్మ) పుత్రుడగు వేంకటాచలమహేంద్రుని యానతిచే రచియించి గోపాలస్వామికి నాతని ప్రేరణచే యంకిత మొసంగినట్లు కార్తికమాహాత్మ్యకృతియందు నీక్రింది పద్యములలోఁ జేర్చి యుండెను.

సీ॥ ఆంధ్రభాషనె ప్రోఢ యనుమాత్రమే కాదు
సంస్కృతంబున నీవు సరసమతివి
లక్షణగ్రంథసారము తెలుంగుదు వైన
లక్ష్యముల్ నీకు లాలాజలములు
తతచతుర్విధ కవిత్వప్రౌఢి నీసొమ్ము
నవరసప్రతులు నీనవ్యకృతులు
నీదీవనలు సమున్నిద్ర సంపద లిచ్చుఁ
బూజలందితివి భూభుజులచేత

గీ॥ జాటుకృతులును బహువిధనాటకములు
బంధురతరార్థ పూర్ణ ప్రబంధములును
రచన గావించి దేవతార్పణము చేసి
పాండ్యవిభుచేఁ బ్రభుత్వసంపదలు గనితి.

పై పద్యమునందు విజయరంగచొక్కనాథుని చే బహుమతులఁ బడసినట్లు చెప్పుకొనియున్నాఁడు.

గీ॥ అనఘ! కార్తికమహాత్మ్య మాంధ్రభాషఁ
గబ్బ మొనరించి మదభీష్టకలన చెలఁగ
బంధురకృపాలహరికి గోపాలహరికి
నంకిత మొనర్చు మిదియ మాయభిమతంబు.

సీ॥ ఏ రాజధానికి నిరుచక్క గోపాల
వేంకటాచలపతుల్ వెలయుచుండు
రేపురిమధ్య సందీపితుం డగుచు నం
దీశ్వరుండు వసించు గృపను మనుప
నేపట్టణం బయోధ్యాపురంబునకు జో
డై పరాభేద్యమై యలరుచుండు
నేపుటభేదనం బాపూర్ణ రుచి రాష్ట్ర
లక్ష్మీనివాసమై లలిఁ జెలంగు

గీ॥ నట్టి తీర్థపురీ పాలనాతివేల
ధర్మపథవర్తి చంద్రికాధవళకీర్తి
తార్క్ష్యవాతాత్మజ ధ్వజాద్యఖిలబిరుద
విజితచక్రియుధార్జున విభవుఁడతడు.

పాండ్యగజకేసరి బిరుదాంకుండు... రాయవేశ్యాభుజంగుఁడు... పఁటకుల కలశపాథోనిధాన రాకాతమీన బలగోలులింగనృపపుఁగవ కులపాలికా పేర్యంబికా నిర్భరగర్భశుక్తిముక్తాయమానుండునగు... వేంకటాచలమహీమహేంద్రుండు... నన్నుఁబిలిపించి యిట్లనుచుఁపలికె.

ఈతఁడు వచనకావ్యములను మిగులప్రోత్సహించిన విజయరంగ చొక్కనాథుని కాలముననుండుటచే భారతరామాయణములను వచన కావ్యములుగ రూపొందించెను. కాని యాగ్రంథములిప్పుడు నామ మాత్రావశేషములైనవి. ఈతడు రచించిన మిత్రవిందాపరిణయము, కార్తికమాహాత్మ్యమునను రెండుప్రబంధములుమాత్రమే యిప్పుడు లభ్యమగుచున్నవి. మిత్రవిందాపరిణయము క్రీ. శ. 1888న

సంవత్సరమున "అముద్రితగ్రంథ చింతామణి" పత్రికాధిపతులచే నెల్లూరిలో ముద్రితమై ప్రకటితమైనది.

గ్రంథమునందక్కడక్కడ లక్షణవిరుద్ధములైన ప్రయోగములు మిక్కుటముగానుండుటచే నీతఁడు లాక్షణికకవి కాకపోయినను, నీతని కవిత్వము రసవంతముగను, ప్రౌఢముగను నున్నది. శైలి తెలియుటకై రెండు గ్రంథములనుండియు నీక్రింద పద్యముల నొసంగుచున్నాఁడను.

మిత్రవిందాపరిణయము :-

చ॥ చిందిల తేనియల్ చినుఁగి చీలికలా చిగురాకు లెంతయున్
గందిన పూవుగుత్తులుం వకావకలా ఫలమంజరుల్ పెకల్
చెందిన లేఁతతీపులు చలించిన పుల్గులు వ్రేలు కొమ్మలై
డిందియుఁ బొల్చె నవ్వని కడింది మిటారుల కేళివై ఖరిన్.

ఉ॥ సారసమా మొగంబు జితసారసమాగమనంబునాభి కా
సారసమాచ్ఛ మూకచ మసారసమాజము మేఘు మాసుధా
సారసమావృతంబునుడి సారసమానము తన్నితంబ మా
సారసమానసీయసువిసారసమా యతమాద్భృగజ్జముల్. ఆ.4

చ॥ అని వనితోక్తి యుక్తిగతి నవ్వని జవ్వనిగుంపు సొంపుఁజే
కొని తనివార సౌరభము గ్రోలుచు సోలుచు మిన్నగన్న కొ
న్నన లనవద్యహృద్యకలన న్గని కన్గొని లేవి మావివెం
పొనరిన మేరఁగీరరుతు లూకొని తూకొని నంతవింతగన్. ఆ.2

చ॥ కనియెను దారుఁజారుతరకౌస్తుభహారు సుమేరుధీరు జీ
వనదశరీరు దుగ్ధమయవార్ధిగభీరు దురాపసారు లో
చన సుఖదావతీరు ఖలశైలశతారు నఘౌఘదూరు స
ద్వినుత యశోవిహారు వసుదేవకుమారు నతాబ్జసూరునిన్.ఆ 6

కార్తికమాహాత్మ్యము :-

ఉ॥ ఎందుకుఁ గోపఁ మోసగవి జేతుణ! యెక్కడ డాఁగినా వయో
యిందుము ఖీవతంసము! యొకించుక ముందరవచ్చి నిల్వవే!
బృందసుధారసం బొసఁగవే పికవాణి చలించుచున్న నా
డెందము చల్లసేయవె కడిందితనంబులు మాని మానినీ!

# 392. బేతపూఁడి కృష్ణయ్య

—※—

ఈకవి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; పరమాంబా కాళప్రధానుల తనయుఁడు; వీరరాజునకుఁ బౌత్రుఁడు; సూరంపూడి యెల్లమంత్రికి దౌహిత్రుఁడు.

ఈకవి, అలివేలుమంగావివాహము, పండితమనోభిరామము, జానకీరాఘవము అనుకావ్యములను రచించెను. ఇందు మొదటిరెండు గ్రంథములు నిప్పుడు కానవచ్చుటలేదు. మూఁడవదైన జానకీరాఘవమయిదాశ్వాసములుగలది. ముద్రితము కాలేదు. చెన్నపురియందున్న ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున రెండుప్రతులున్నవి. ఈకావ్యమడపా నారప్పయను కమ్మప్రభువున కంకితముచేయఁబడినది. శ్రీలక్ష్మీనరసింహమూర్తి కృతిపతికి స్వప్నమునఁ బ్రత్యక్షమై యాకృతి నందుమని చెప్పినట్లు రచింపఁబడిన యీక్రిందిపద్యములలోఁ గవి తనవృత్తాంతమును దెలిపియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రప్రసిద్ధుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్రుఁ డఖిల
బుధపోషణుఁడు బేతపూఁడి గాదయభద్ర
మంత్రి వీరనృపాలమౌళిసుతుఁడు
కాళప్రధాని శంకరుఁడు గౌరివరించి
నట్లు సూరమపూడి యెల్లమంత్రి
యాత్మజ యాపరమాంబ నుద్వాహమై
కడలి సురతరువుఁ గ్గౌరవాప్తుఁ
గాంచుగతి సిద్ధసచివశేఖరుని ముత్త
మంత్రివర్యుని వీరయామాత్యవరునిఁ
గృష్ణసుకవిని భీమధరిత్రిపతిని
సిద్ధరాజును గవియెఁ బ్రసిద్ధయశుల.

శా. శ్రీసిద్ధేశవరప్రసాదకవితాసృష్టిక్రియాశాలి గౌ
రీసక్తాంఘ్రిసరోజయుగ్మభజనక్రీడాప్రబోధాత్మ
...సర్వజ్ఞుఁడు చేతపూఁడి కులజుండౌ మంత్రీశ్వరుం
డాసీ (?) ర్వాదము సేయ శోభనము లా
నాచంద్రతారార్కమున్.

సీ ...శ్రీమదలమేలుమంగావివాహంబు
శ్రీజగన్నాయకార్పితము సేసె
రహిఁబఁడితమనోభిరామ శృంగారకా
వ్యము ధవళాదిరాయనికి నొసఁగె
బహుకల్పనానల్పబంధురసూక్తుల
రచియించె జానకీరాఘవంబు
ప్రాకటప్రాసాదపంచాక్షరీమంత్ర
జపపరాధీన రసజ్ఞుఁ డతఁడు

గీ. హరికథలె కావ్యములు చేసె నాంధ్రభాష
యందు మధ్యకర్తుఁ డతనిచే నందుకావ్య
రత్నమైనట్టి జానకీరాఘవంబు
శ్రీకరంబుగ నారథాత్రీతలేంద్ర!

కృతిపతి కవితోననినమాటలను గవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. నానారత్నసువర్ణభూష వసుసంతానేభకంఖాణ ధా
త్రీనారీనిచయంబు నిచ్చి పలికెన్ గృష్ణపరిధానేంద్ర! భా
షానాగేంద్ర! భవత్కృతోజ్జ్వలకృతిన్ శాస్త్రప్రకారంబునన్
శ్రీనాథాజ్ఞ నొసంగు మాకులములక్ష్మీకీర్తుల న్మీఱఁగన్.

కవి తనగురువైన బసవానారాధ్యుని ఈక్రిందిపద్యములోఁ గీర్తించియున్నాఁడను.

క. అభవపదాంబుజసేవా
విభవధురంధరుని నేతివిద్యాగురునిన్
శుభగుణబంధురు సద్గురు
నభినుతిగావింతు బసవనారాధ్యవరునిన్.

ఈబసవానారాధ్యుఁ డెవ్వరో తెలియదు. ఇంటిపేరు చెప్పి యున్నచో నీతఁ డెవ్వరో తెలిసికొనుట కవకాశ ముండియుండును. బ్రహ్మోత్తరఖండమును రచించిన ములుఘటి లింగనారాధ్యుని తాత బసవనారాధ్యుఁడు. ఇతఁడు పండితుఁడని లింగనారాధ్యుఁడు నుడివి యున్నాఁడు. ఆతఁడే యీబసవనయని యనుకొనుచున్నాఁడను.

కృతిపతి యైనఅడపానారప్ప కమ్మప్రభువు. ఇతనికిముత్తాతకుఁ దాతయైనకూనయ్య గజపతులకాలములో కొండవీడు కొండపల్లి దుర్గముల కధికారిగానున్నట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు

శా. శ్రీలక్ష్మీరమణేశ పాదయుగ రాజీవంబునం బుట్టిగం
గాలీలాఘతితోడఁబుట్టువయి లోకాలోకపర్యంతమున్
బాలించున్ ధరణీతలం బడపకూనయ్యాఖ్యమానాధుఁడు
ద్వేలశ్రీకర కమ్మసత్కులమునన్ దీపించిసత్కీర్తులన్.

తే. కనకమణిమయభూషణగజతురంగ
మాక్షికచ్ఛత్రచామరమకరటెక్క
ములను విద్యాధరునిచేత నెలమినందె
నతఁడు గజపతికుడిభుజమనఁగ మిగుల.

తే. కొండపలి కొండవీడు లఖండవైభ
వమున నాఖండలుని రీతి నమర నేలెఁ
దనదుకీర్తిప్రతాపసుధాంశుపద్మ
హితఘనప్రభబ్రహ్మాండ మెల్లనిండ.

కూనయవంశమును పెక్కుపద్యములలో గవి వర్ణించి యున్నాఁడు. కాని యందు చారిత్రాంశకములు లేవు, కృతిపతిని

కృతిపతికుమారుఁడైన తిరుమలరాయని వర్ణించిన రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ గీ. దనరెవలయాద్రిమానసోత్తరపరీత
మెదినీచక్రపాలనామేయచరితుఁ
డడపనరసింహవిభు సుతుం డమితయశుఁడు
భవ్యగుణపాళి నారభూపాలమౌళి

చ. వనజహితప్రతాపుఁడయి వారలలోనఁ బ్రసిద్ధికెక్కెఁ గాం
చననగకార్ముకస్థిరయశంబున నారనృపాలమౌళి పా
వనవయశాలి సద్గుణనివాసిని గండ్రలరామినేని నం
దనను వరించెఁ గోవమను ధాత సరస్వతిఁ బొందుకైవడిన్.

తే. దుగ్ధవారాశిలోపలఁ దోయజారి
పొడమిన ట్లుదయమ్మయ్యె నడపనార
జనపతికిఁ గోనమాంబకు సకలవిబుధ
రక్షణుండైన తిరుమలరాయవిభుఁడు.

నారపను చక్రవర్తియని కవి వర్ణించినను, నాతఁడు పరిపాలించిన ప్రదేశ మేదియో తెలుపకపోవుటచే నీతఁడు ప్రభువు కాఁడనియు గొప్ప భూవసతికలిగియున్న ధనాధికుఁడనియుఁ దలంపవలసియున్నది. కృతిపతినివాసముగాని కృతికర్తనివాసముగాని తెలియలేదు. గుంటూరుమండలమునందలి సత్తెనపల్లి తాలూకాలో బేఁతపూఁడి యను గ్రామముకలదు. ఈకవిగృహనామ మాగ్రామమునుబట్టి వచ్చియుండును.

ఈకవి నూఱుసంవత్సరముల క్రిందటివాఁడై యుండునని, ఆంధ్రకవులచరిత్రమున నున్నది. కృతిపతియొక్క మూలపురుషుఁడైన కూనయ్య గజపతులకాలమువాఁడని చెప్పఁబడినది. కొండపల్లి కొండవీడుదుర్గములు క్రీ. శ. ౧౫౧౫ వఱకును గజపతులస్వాధీనమం దున్నవి. శ్రీకృష్ణదేవరాయలు గజపతులను జయించి వానినిస్వాధీ

నము చేసికొనియెను. తరువాత నవియెప్పుడును మగల గజపతులకు రాలేదు. కావున కూనయను ౧౫౦౦ ప్రాంతము వాఁడనినిశ్చయింప వచ్చును కూనయకును నారపకును నడుమ నైదుతరము లున్నవి తరమునకుముప్పది సంవత్సరములవంతున లెక్కచూచినచోఁ గృతిపతి క్రీ శ. ౧౭౦౦ ప్రాంతమున గ్రంథమును కృతినందుకొనఁదగినవయసు లోనుండునని తెలియుచున్నది. దానినిబట్టి కవియు నాప్రాంతమువాఁడని నిశ్చయింపవచ్చును.



## 393 వెలిదిండ్ల వెంకటపతి

ఇతఁ డాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు; కౌశిక గోత్రుఁడు. తిరువెంగళార్యుని పుత్రుఁడు. ఇతనితల్లి కోనమాంబ; పెదరాఘవయ్య చినరాఘవయ్య, నరసయ్య లక్ష్మపతియనువా రీతనిసో దరులు.

ఈకవి రాధామాధవసంవాద మనుమూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమురచించి మగదలరామదాసామాత్యునకుఁ గృతియిచ్చెను. ఈగ్రంథమునకుఁ గృత్యాది లభించలేదు. అందువలనఁ గృతికర్తను గూర్చియుఁ గృతిపతినిగూర్చియు విశేషములను తెలిసికొనుట కవ కాశము లేకున్నది. గ్రంథాంతమందలిగద్య యిట్లున్నది.

గద్య :- ఇది శ్రీమద్వేణుగోపాలవరప్రసాదలబ్ధ శృంగారకవిత్వ వైభవ వెలిదిండ్లతిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకటపతినామధేయప్రణీతం బైనరాధామాధవ సంవాదం బను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

ఈతఁడు రచించిన గ్రంథమునుబట్టి కవినిగూర్చి తెలిసికొనుట కింతకంటె నధికమేమియు లేదు. కాని యీగ్రంథమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీ నిడదవోలు వెంకటరావు, యం. ఏ. గారు మరికొన్ని సంగతులు వ్రాసియున్నారు. అందలిముఖ్యాంశముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. ఈ వెంకటపతికవికిఁ దమ్ముఁనికుమారుఁడైన యశోఘురి కవి సుపంతాకళ్యాణ మనుగ్రంథమును రచియించియున్నాడు. అందు వెంకటపతిని అతనితండ్రియైన తిరువెంగళార్యుని వర్ణించిన పద్యముల నీక్రింద నిచ్చుచున్నాడను.

చ. అల తిరువేంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁడై
యలరి ప్రసూనమార్దవశుభాంగిని గోనమయ న్వధూమణిన్
లలితగతిన్ వరించి కమలాసతి చేకొనినట్టి చుట్టువా
ల్బలియునికై వడిన్ బరగె బంధువులందఱు సంతసింపగన్.

సీ. ఆమేరు రామేశ్వరావని విఖ్యాత
మేనేత శుద్ధాంధ్రకృతిసహస్ర
మారాజతారార్కమై రాజితస్ఫూర్తి
నలరారు నేధీరు ననఘుకీర్తి
యాసముద్రా సమానాఖిలార్యాభీష్ట
లక్ష్మీకరం బేవిలాసి పాణి
యామేరుశామితాశావహ శ్రీధారి
యేసూరి వైభవోల్లాసకలన

మతఁడు చెలువొందుఁ దిరువెంగలార్యగర్భ
జలధికమలారి దుష్కవిజనవిదారి
యనవరతతోషి కావ్యవిద్యాభిలాషి
బంధుపరిపోషి వేంకటపతిమనీషి

ఈపద్యమునుబట్టి యీవెంకటపతికవి శుద్ధాంధ్రకృతిసహస్ర కర్తయైనట్లు తెలియుచున్నది. కాని రాధామాధవసంవాద మొకటి

తక్క యీతని గ్రంథము లేవియు మనకు లభింపలేదు. పై పద్యములో రాధామాధవ సంవాదనామము పేర్కొనబడలేదు. కాని యంత మాత్రముచేత నీవెంకటపతినన్యునిగా భావింపరాదు సుదంతా కళ్యాణకృతికర్త యలఘురికవి వెంకటపతిసోదరుని......కుమారుడు ఈవిషయమాతనిచరిత్రమున చెప్పబడును.

సుదంతాకళ్యాణమున నీవెంకటపతికవికి తిరువెంగళార్యుడను కుమారుడున్నట్లీక్రిందిపద్యములో జెప్పియున్నాడు.

మ. అనఘుం డాతడు రాఘవమ్మను వివాహంబై తదంభోజలో
చనయందున్ దిరువెంగళార్యసుకృతిన్ సంగీతసాహిత్య ధు
ర్యుని నద్వైతకళాప్రవీణసుచరిత్రున్ బండితస్తోత్ర పా
త్రుని సౌజన్యసమేతు విశ్రుతు ని నీతున్ గాంచి యొప్పెన్ మహిన్.

అయ్యన్న శాస్త్రి యనుపండితుడు వ్యాసతాత్పర్యనిర్ణయ మను నొక సంస్కృతగ్రంథమును రచియించియుండెను. ఈక్రింద నుదాహ రించిన గద్యమునుబట్టియు శ్లోకముననుసరించియు నాయయ్యన్న శాస్త్రి రాధామాధవసంవాదాది ప్రబంధకర్త యగు వెంకటపతికి కుమారుడనియు సునందాకళ్యాణాది ప్రబంధకర్త యగునలఘురికవి కనుజుడనియు స్పష్టమగుచున్నది.

శ్లో॥ శ్రీవెంకటపతే స్సూను రఘు రేరనుజః కవేః
అయ్యన్నో వైణికః కుర్వే వ్యాసతాత్పర్యనిర్ణయమ్.

గద్యమ్ :— ఇతి శ్రీమద్రాధామాధవసంవాదాద్యనేక ప్రబంధ నిర్మాణధురీణస్య, శ్రీవేంకటపతి కవిసార్వభౌమస్య, తనూభవేన సుదన్తాకల్యాణాద్యనేకప్రబంధరచనాచాతురీధౌరేయస్య అళఘురికవిజే రనుజేన వీణావాదనప్రవణేన, వేదాంతసిద్ధాంతరహస్యార్థప్రకాశన ధురంధరేణ శ్రీమదయ్యన్న విద్వన్మణినా విరచితే వ్యాసతాత్పర్య నిర్ణయే...

ఈఅయ్యన్నశాస్త్రికే, తిరువెంగళార్యుఁడని నామాంతరమున్నదని యూహింపవలసియున్నది. వెంకటపతికవి తనకుమారునకు తన తండ్రియైన తిరువెంగళార్యనామముంచియుండును. కాని పిలుచుటలో పితృశబ్దసూచకముగా అయ్యన్నయని పిలుచుచుండవచ్చును. లోకములో అయ్యన్నయనునామమే విశేషప్రచారములో నుండుటచే వ్యాసతాత్పర్యనిర్ణయకర్త తననిజనామమునుగాని యందఱకుఁ దెలిసియున్న "అయ్యన్నశాస్త్రి" యనునామమునే తనగ్రంథమున వేసికొని యుండవచ్చును. తిరువెంగళార్యుఁడు సంగీత సాహిత్యధుర్యుఁడనియు పండితస్తోత్రపాత్రుఁడనియు అళఘురిచెప్పిన పై పద్యములో నున్నది. అయ్యన్నశాస్త్రి వీణావాదనప్రవీణుఁడై నట్లు గద్యలో నున్నది. ఇవి యన్నియు సమన్వయించిచూడఁగా నయ్యన్నశాస్త్రియే తిరువెంగళార్యుఁడని యనుకొనుట సమంజసము. అలఘురికవి, అయ్యన్నశాస్త్రికి కేవలానుజుఁడు గాకపోయినను, పితృవ్యపుత్త్రుఁడగుటచే స్నేహబాంధవ్యములనుబట్టి యాతని ననుజుఁడనని చెప్పుకొనియున్నట్లూహింపఁదగియున్నది.

రాధామాధవసంవాదముద్రితప్రతికిఁ బీఠిక వ్రాసిన గంటి సూర్యనారాయణశాస్త్రిగారు, అయ్యన్నశాస్త్రికిగురువైన శ్రీధరవేంకటేశార్యునిగూర్చి వ్రాసినవాక్యములు పాఠకులకు హృదయంగమముగా నుండునని యెంచి యిటనుదాహరించుచున్నాఁడను.

శ్రీధరవేంకటేశార్యుఁడు తనగురువని యాతఁడిట్లు చెప్పుచున్నాఁడు

శ్లో॥ యద్వ్యాఖ్యాఖిలలోకకిల్బిషతమఃకాండస్య చండద్యుతిః
సూక్తిర్యస్యవిరక్తిభక్తిభగవద్బోధప్రరోహావనీ;
బ్రహ్మానందసుధాబ్ధిమందరగిరిర్యస్యోపదేశక్రమః
తస్మై శ్రీధరవేంకటేశగురవే కుర్వే ప్రణామాయుతమ్.

ఈ శ్రీధర వేంకటేశార్యుఁడు దక్షిణదేశమువారికి నాఁటికి నేఁటికిఁగూడ నిత్యపూజ్యుఁడై స్మృతిపథమునను మహనీయుఁడు, మహావిద్వాంసుఁడు, బహుగ్రంథకర్త, పుణ్యపురుష కథాకీర్తనలోభమునఁ బ్రసక్తాను ప్రసక్తమయినను దచ్చరిత్రము నిక్కడనించుక ప్రస్తుతించుచున్నాను.

"శ్రీధర వేంకటేశార్యుఁడు ఆంధ్రవైదిక బ్రాహ్మణుఁడు తంజావూరిజిల్లా తిరువశీనెల్లూరు గ్రామవాస్తవ్యుఁడు. సంపన్నగృహస్థుఁడు. ఒకప్పుడాయనతండ్రిదో తల్లిదో శ్రాద్ధదినమయ్యెను. బ్రాహ్మణ నిమంత్రణమాయెను గృహమున వంటకము జరుగుచుండెను. తాలింపుపరిమళము ఘ్రాణతర్పణముగా నిరుగుపొరుగులకు వ్యాపించుచుండెను. అట్టితరి నీవెంకటేశార్యులకో యన్యులకో కమ్మతగాఁడగు నొకమాలవాఁడు గోగ్రాసమునుగొనివచ్చి యీతాలింపుఁ గమ్మవలపు నాఘ్రాణించి క్షుధార్తుఁడై వేంకటేశార్యులను బిలిచి "బాబూ! కమ్మనివాసనలు నన్నూరించుచున్నవి. మీయింట నేదో విందువంటకము లగుచున్నట్లున్నవి. నాకటుంబమున కింత ప్రసాదము పెట్టింపుఁడు మాకొంపలో నందఱును నిన్న దిన్నగాఁ దిండిలేదు" అని యాచించెను. ఆతఁడు యదివిని చండాలాఘ్రాణదోషముచే నుచ్ఛిష్టమయినదని యూహించెనో, లేక అన్నాతురుని ముందుగా నాదరించుట మంచిదనియే ఎంచెనో కాని యాశాకపాకాదు లన్నింటిని వాని కిచ్చివేసెను, శ్రాద్ధమునకుఁ బునఃపాకప్రయత్నము సేయఁ జూచెను. ఊరిలోని దాక్షిణాత్యనైష్ఠికు లీవిషయము వినిరి, అంత్యుఁడు చెడెనని తెగడిరి. బ్రాహ్మణార్థము రామనిరి. ఊరెల్ల నట్టుడికినట్లుడుకుచుండెను. వేంకటేశార్యులయింట వంటకుఁ దోడు వచ్చువారును వెడలిపోయిరి శ్రాద్ధకర్మలోపము కలుగుచున్నట్లుండెను. వేంకటేశార్యులూరివారినెల్లరఁ బిలిచి "శ్రాద్ధము గతియేమి? నేను దోషము చేసితినిగాక! ఎట్టిదోసమునకేని ప్రాయశ్చిత్తముండును

గదా! నాతప్పిదమున కేదో నిష్కృతి విధింపుఁడు.'' అనికోరెను. గంగాస్నానము చేసినఁ గాని మీకుఁ బవిత్రత కల్గ'' దని యూరిధర్మసభ వారు తీరుపు చెప్పిరి. ''ఇంతేకదా! అట్లే గంగాస్నానము చేయుదును; చిత్తగింపుఁడు'' అని యాయన లోనికరిగి కొంతదడవుపాస్తి నెఱపెను. దొడ్డిలో నున్ననూయి పొంగి యానీటితో నిల్లెల్లఁ దడిసెను. ఊరివారెల్లఁ జూడవచ్చిరి. అప్పుడు నూతినుండి సౌవర్ణ కంకణాంకిత మయిన స్త్రీహస్త మొకటి స్వర్ణకలశముతో వేంకటేశార్యుల చేతికి జలము నొసఁగెను. దానితో నామహనీయుఁడు సుస్నాతుఁడై కలశము మరల నామెహస్తమున నొసఁగగా నది యావేఁగాన రాదయ్యెను. ఊరివా రామాహాత్మ్యమున కబ్బురపడి తమ యపచారమును క్షమింపుఁడని వేంకటేశార్యులను వేఁడికొనిరి. శ్రాద్ధము సక్రమముగఁ జరిగెను. నాఁటనుండి నేఁటికిఁగూడ నాశ్రాద్ధము జరిగినతిథికి (కార్తీకామావాస్య) వేలకొలఁదిగఁ బ్రజలరుగుదెంచి యాతిరువశినెల్లూరఁగల వేంకటేశార్యుల నూతినీట స్నానము చేయుదురు. ఉత్సవము సలుపుదురు. ఆయన వసించిన గృహ మిటీవల చక్కపరుపఁబడి దక్షిణదేశమున భగవద్భజనగృహముగాఁ జేయఁబడినది. ''అయ్యావాళ్'' అని వేంకటేశార్యులకథను దాక్షిణాత్యులెల్లరు నెఱుంగుదురు. వేంకటేశార్యులు రచించిన స్తుతిగ్రంథములు ఆఖ్యాషష్టి, దయాశతకము మొదలగునవి పదునాల్గు ముద్రితములయియున్నవి.'' *

ఈ వెంకటపతికవి శుద్ధాంధ్రకావ్యములను రచియించియుండుటచే నీతని కచ్చతెనుఁగు వేంగనయని పేరువచ్చినట్లు సునందాపరిణయములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

---

* వెంకటేశార్యు లప్పుడు రచించినశ్లోకములతో నీకథను దెలుపుగ్రంథము నూయి చిత్రముతోఁగూడఁ బ్రకటింపఁబడినది.

కం. అందగ్రజుఁ డర్చితగో
విందపదుం డచ్చు తెనుఁగు వేంగన వెలసెన్
చందనభాస్కందనభు
స్కందనభస్సింధుబంధుగురుతరకీర్తిన్.

ఈతఁడు రచించిన అచ్చాంధ్రకృతులు లభింపపోవుట, ఆంధ్రుల దురదృష్ట మని చెప్పకతప్పదు.

ఈకవి, తనగ్రంథమును మగదలరామదాసమంత్రికిఁ గృతియిచ్చి నట్లీక్రిందియాశ్వాసాద్యంతపద్యములవలనఁ దెలియుచున్నది. కృత్యాది లభింపకపోవుటచేఁ గృతిపతివివరములు పూర్తిగాఁ దెలియుటలేదు.

మాలిని - మగదలకులధీరా మానినీచిత్తచోరా
అగణితగుణహారా! యర్థిరాధాకుమారా!
నిగమవిధివిహారా! నిత్యసౌఖ్యానుసారా
నగరభవగభీరా! చారుశృంగారవీరా!

ఉ. కృష్ణయమంత్రిపుత్ర! సుకవీంద్రముఖాంబుజకంజమిత్ర! శ్రీ
కృష్ణపదాబ్జసంతతవశీకృతచిత్త! నవీనచిత్తజా!
జిష్ణుసమానభోగ! గుణచిత్ర విశేషగభీరసాగరా!
వైష్ణవ సమ్మతప్రకటవస్తువిచారణ! మంత్రివారణా!

క శ్రీకర వరవైభవ ని
త్యా! కమలానాథ మృదుపదాంబుజభృత్యా!
ఆకారవిజిత నాస
త్యా, కృష్ణాపత్య! రామదాసామాత్యా!

క. శ్రీమత్సమస్తసద్గుణ
ధామా! రామాభిరామ! తాండవకృష్ణ
స్వామి పదాంబుజదాసా
శ్రీమగదలరామదాస చిత్రవిలాసా!

ధరణిదేవుల రామమంత్రికృతమయిన దశావతారచరిత్రమును గృతినందిన మగదల కృష్ణమంత్రియే, రాధామాధవసంవాదకృతిపతి యగురామదాసామాత్యునకుఁదండ్రి. ఈవిషయము దశావతారచరిత్ర మందలి యీక్రిందిపద్యమువలనఁగూడఁ దెలియుచున్నది.

మ. తనయా! శ్రీసర రామదాసవిలసత్సాహిత్యహృష్యన్మనో
వనజా! శంకరదాసగానకలనావైయాత్యవీణానువా
దనసమ్మోదన! పద్మనాభపరితోదారార్ధ శృంగారఖే
లన! పద్యాదరరంగశాయి! మధురాలాపప్రియంభావుకా!

కృతిపతులైన మగదలవారివంశవర్ణనము దశావతారచారిత్రమున విపులముగాఁ జేయఁబడినది. ఆవిషయమును గొంతవఱకు ధరణిదేవుల రామమంత్రిచారిత్రమున వ్రాసియున్నాఁడను. కృతిపతినివాసము ప్రళయకావేరీపట్టణమయినట్లు రాధామాధవసంవాదమునందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

శా. వీతోమాత్రిఫలప్రదప్రళయకావేరీమహాపట్టణా
ధ్యాతా! శంకరపద్మనాభరఘునాథామాత్యగోపాలకా
దిత్షేమంకరసోదరాగ్రజ పదాత్మీయాఢ్యవాఙ్మంజరీ
సాతోన్నందకుమారపాదయుగపూజాలబ్ధభాగ్యోదయా!

రాధామాధవసంవాదముద్రితప్రతికిఁ బీఠికలు వ్రాసిన గంటి సూర్యనారాయణశాస్త్రిలుగారుకృతిపతినివాసము తంజావూరుమండలమందలి గారీమాయవరమునకుఁ జెంతనున్న కావేరీపట్టణమని వ్రాసియున్నారుకాని యదిసత్యముకాదు. కావేరీపట్టణము సముద్రతీరమున లేదు. మగదలవారు సముద్రతీరప్రాంతవాసులయినట్లు దశావతారచరిత్రమునందున్నది. కావున ప్రళయకావేరీపట్టణమే కృతిపతి నివాసమనుట నిశ్చయము. అదియిపుడు Pulicat అని పిలువబడుచున్నది.

ధరణిదేవుల రామమంత్రికవియు నీవెంకటపతికవియు నించుమించుగా సమకాలికులని చెప్పవలసియున్నది. ఈకవి పదునేడవశతాబ్దయం దంత్యభాగమున నున్నాఁడనుట నిశ్చయము. ఈకవి యింటిపేరు వెలిదండ్లయని కొన్నిప్రతులలోను వెలిగండ్లయని కొన్నిప్రతులలోను నున్నది.

ఈకవి మొట్టమొదట నెల్లూరుమండలవాసియే యయినను, పిదప చెంగల్పట్టుమండలమునకును ఈతని కుమారుని కాలమునాటికి తంజావూరుమండలమునకును వలసపోయియుందురు.

రాధామాధవులపరస్పరసంభాషణను దెలుపుపద్యము లిందు విశేషముగా నుండుటచేఁ గవి యీగ్రంథమునకు రాధామాధవసంవాదమని పేరిడియున్నాఁడు. ఈతని కవిత్వము గంగాలహరివలె పరుగిడుచుండును. శైలి ద్రాక్షాపాకము. ఇందు రాధామాధవుల ప్రథమానురాగము, రాధవిరహము, మొదలగునంశములు మనోహరముగా వర్ణింపఁబడినవి. ఇందలి రాధ పరకీయ. అయినను నామె భర్త నెఱుఁగదు. చిన్నతనమునుండియు శ్రీకృష్ణునియందు బద్ధానురాగయై యాతనిని మక్కువతోఁ బెంచి పెద్దవాఁడైనపిమ్మట తనమనోరథము నీడేర్చుకొనినది.

ఈతనికవిత్వశైలి తెలియుటకై రాధామాధవసంవాదమునుండి కొన్నిపద్యము లిందుదాహరింపఁ బడుచున్నవి.

ఉ. భావిఫలాభిలాషమున బాలునికేమఱ కగ్గుపెట్టుఁ బె
య్యావులపాలతో జలకమార్చును దాఁదొడనుంచి యేమిచూ
చేవని నవ్వుచున్ బయఁటచేఁదడియొత్తి సిరామరతుతోఁ
గావునఁ జుక్కబొట్టిడు మొగంబున నంత ఘటించు నుయ్యెలన్

చ. ప్రకటమనోజరూప! పసిబాలుఁడవంచును నమ్మి ప్రక్కనుం
చుక నిదురించఁగాఁ బుణుకుచున్ గుచముల్ బిగఁబట్టి మేనుమే

నికి గదియించి పల్పెదవి నిల్పితి వేమిర మేనమామ పో
లికలకు వచ్చినాఁడవో భళీ యనుచున్ దలయూఁచి నవ్వుచున్.

చ. పలచిన వారు లేరొ; సరివారలలో నగుబాటుగాను నా
పలెఁ జరియించిరే; యొకరివంటున కేటికిఁ బోవ; ధాత నా
తల నిటు వ్రాయఁగా వలెనె దైవము దూఱఁగ నాయమానె నేన్
నోలి ఘుయి నేమినోము లెటు నోఁచితినో యిడిగంటి నిమ్మెయిన్.

ఉ. ఒక్కతె భ్రాంతిచేఁ బౌరల నొక్కఁడు మాన్పఁగఁ బూఁటకాఁపె నే
నెక్కడిదాన; నీవు మఱి పెక్కడివాఁడవు నాకు నీకు నే.
మక్కఱ యున్న దైనఁ నొకఁ డాడెడిపల్కులు సేనె పల్కెదం
గ్రుక్కక; ఆయెఁ బోయె నవి కొన్ని దినాల ఋణానుబంధముల్.

ఈతని కవిత్వమునం దచ్చటచ్చట వ్యాకరణవిరుద్ధము లైన ప్రయోగములు కన్పట్టుచున్నవి.

— * —

## 394 ప్రాఁతకోట పుల్లయ్యకవి

ఇతడు ప్రథమశాఖానియోగి బ్రాహ్మణుడు; కాత్యాయనసూత్రుడు; కాశ్యపగోత్రుఁడు; రేకయామాత్య యక్కమాంబల పుత్రుడు; పెదవీరమరాజపౌత్రుఁడు; శైవమతాభిమాని.

ఈకవి బ్రహ్మోత్తరఖండమునాంధ్రీకరించి తొమ్మిదాశ్వాసములు గల పద్యకావ్యముగా రచించి శ్రీశైలమల్లికార్జునున కంకితము చేసెను. ఇతనికి ‘పురహరకవి’ యను నామాంతరము కలదు. తనను గూర్చి కవి యిట్లు చెప్పుకొనియున్నాడు.

సీ. శ్రీవిష్ణునాభిరాజీవమధ్యంబున
బ్రహ్మ జనించెఁ దద్బ్రహ్మ సంత
తిని బుట్టెఁ గశ్యపముని యమ్మహాత్ముని
వరగోత్రమున యాజ్ఞవల్క్యవంశ
మందుద్భవించెఁ గన్నామాత్యుఁ డుత్తముం
డతని పుత్రుండు లక్కనాఖ్యుఁ డట్టి
పుణ్యున కుదయించెఁ బోతరాజాజగ
ద్విఖ్యాతునకుఁ బెదవీరమంత్రి

గీ. తనయుఁ డాతని సుతుఁడు రేకనవదాన్యుఁ
డాయనకు నక్కమాంబకు నాత్మజుఁడను
ఘనత కెక్కిన రామలింగయ కనుజుఁడ
మహిత శివాచార హితుఁడ! పురహరకవిని

గీ॥ ముఖ్య శివలింగ బహుతీర్థములను గలిగి
సకలవిద్యావిశాలసజ్జనుల నమరి
ప్రబల విఖ్యాతి గన్నట్టి ప్రాతకోట
పురహరాంకుండ! బుధలోకపూజితుండ!

వ. అట్టి నన్నుఁ గరుణాకటాక్షవీక్షణంబుల వీక్షించుచుఁ బరమాదరంబున మహానుభావులైన సకలవిద్వత్కవిబంధుజనంబులు బ్రహ్మోత్తరఖండంబను పురాణం బంధ్రభాషావిశేషంబున రచియించి సాహిత్యకల్యాణంబగు శ్రీశైలపురంబునకధీశ్వరుండైన మల్లీశ్వరునికంకితంబు సేయుమని శివప్రీతులై యానతిచ్చిన మహాప్రసాదంబని దృఢంబుగ నానందకందళితహృదయుండనై తత్ప్రారంభంబు నంగీకరించి.

ఈగ్రంథమునందువిషయములను గవియే యీక్రిందివచనమున క్లుప్తముగా వివరించియున్నాడు.

వ. మహాత్మా! మత్ప్రార్థితార్థులం జేయుకొఱకు శైవపంచాక్షరీ లక్షణంబును, మాఘకృష్ణచతుర్దశీ ముఖ్యప్రతిచతుర్దశీ విశేషంబును, త్రయోదశీపూజాప్రదోషపరిహారంబును, సోమవారవ్రతచరిత్రంబును శివభక్తిసేవాప్రభావంబును, విభూతి మాహాత్మ్యంబును, ఉమామహేశ్వరారాధనక్రమంబును, గదాద్రికటదాద్రిధ్యాయ సామర్థ్యంబును, పురాణశ్రవణ విధంబాదిగా శివమాహాత్మ్యంబు సర్వంబు.

ఈతొమ్మిది విషయములును తొమ్మిదాశ్వాసములలోను జెప్పఁబడినవి. గ్రంథాంతమందలి ఈ క్రిందిగద్యమువలన కవినామగోత్రాదులు దెలియుచున్నవి.

గద్య. ఇది శ్రీవీరభద్రకృపాలబ్ధసరసకవితాచమత్కార ప్రచండ సుమకోదండ ప్రథమశాఖాగణ్య పుణ్యచారిత్ర కాశ్యపగోత్రకాత్యాయనసూత్ర పవిత్ర వీరనారాయణ పురాఖ్యాత విఖ్యాత ప్రాంతకోట పెదవీరమరాజపౌత్ర, రేకయామాత్య పుత్ర పరమేశ్వరారాధనవిధేయ పుల్లయనామధేయప్రణీతంబైన శివప్రభవాభిరామంబగు బ్రహ్మోత్తర ఖండంబను మహాపురాణంబు.

కర్నూలు మండలమునందలి నందికొట్కూరు తాలూకాలో 'ప్రాంతకోట' యను గ్రామమున్నది. అదియే యీకవి నివాసమై యుండును. కవికాలమును నిర్ణయించుటకుఁదగిన యాధారములు లభ్యముకాలేదు. బహుశః పదునేడవశతాబ్దివాఁడై యుండును.

ఈగ్రంథము ముద్రింపబడలేదు. మదరాసుప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున మొదటియాఱాశ్వాసములుగల ప్రతియొకటియు నెనిమిది తొమ్మిదాశ్వాసములుగల ప్రతియొకటియునున్నవి.

బ్రహ్మోత్తరఖండమునుబట్టి మట్టి సోమనాథ సోమనాథ సోమయాజియు నాంధ్రీకరించియున్నాడు.



## 395 వెంకటరామార్యుఁడు

ఈకవి "బాలచక్రపురధామా! వేదనారాయణా" అను మకుటముతో ౧౦౮ పద్యములుగల యొక శార్దూలమత్తేభవృత్తశతకమును రచించెను. ఈశతకముయొక్క తాళపత్రప్రతియొకటి మ. ప్రా. పు. భాండాగారమునందున్నది. ఆగ్రంధారంభమున నీక్రింది పద్యములు వ్రాయఁబడియున్నవి.

క. కంకంటిపాపరాజని
కొంకకయనవలయుమిమ్ము గొబ్బున గోవిం
దాంకితశతకము వినినన్
వేంకటరామార్యవర్య విహితౌదార్య!

క వేంకటరమణునికృపచే
జంకక సత్కవిత చెప్పి సరసులుమెచ్చన్
బొంకమగు సిరుల వెలయుము
వేంకటరామార్యవర్య విహితౌదార్యా!

ఈపద్యములనుబట్టి కవి కంకంటి పాపరాజుతో సమకాలికుఁడో ఆతనికిఁ దరువాతివాఁడో యైనట్లూహింపవచ్చును. ఇతఁడు కందాళ దొడ్డయాచార్యుల శిష్యుఁడైనట్లీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

శా. హార్యత్వాకృతి దుర్మతప్రకట వేదండాళిఁ జెండాడి సా
కర్యంబందిన చోళసింహనగరీకందాళ శ్రీస్వామిదొ
డ్డార్యున్ మద్గురువర్యు నెంచితమకేనర్పింతు మత్సాహితీ
మర్యాద స్పృహ బాలచక్రపురధామా! వేదనారాయణా!

నెల్లూరునకు సింహపురియని నామాంతరముకలదు. అదికొంత కాలము తెలుగుచోళరాజుల పరిపాలనలోనున్నది. కావున నీదొడ్డయాచార్యుని నివాసము నెల్లూరు అయియుండునేమోయని యూహ నొదవుచున్నది. కందాళ దొడ్డయాచార్యులకు చక్రపురిరాఘ

చార్యులతాతశిష్యుఁడై నట్లు నలచరిత్ర ద్విపదకావ్యములోఁ జెప్పుకొని యున్నాఁడు.

మకుటములోని బాలచక్రపుర మెచ్చటుండో తెలియరాలేదు. ఈకవి కవిత్వము మనోహరముగానున్నది. శైలికై మూఁడుపద్యములనీక్రింద నుదాహరించుచున్నాఁడను.

శా. శ్రీలక్ష్మీనరసింహ పాదకమల క్షేమంకరప్రస్ఫుర
ద్గోలాఖేల విశాలమానమధువిట్పుంజంబుగాభక్తియో
గాలంకారములై తనర్చ శతకంబర్పింతు నధ్యాత్మవి
ద్యాలోభార్ధము...... బాల...

మ క్షితిలోనన్ శతకాదిసత్కృతుల సంఖ్యేయంబులై యుండనే
శతకంబిట్లతికించుచేపటిమ యుష్మద్దివ్యనామాంకితో
ద్ధితమై యద్భుతమై జగద్విదితమై దీపించుమత్కావ్యస
మ్మతులన్ గావ్యులుసమ్మతించరే సునామా ౧౦౮

మ. భవదీయాంకితమైన సత్కృతిని శబ్దశేషయ్యా సమా
స విశేషంబులు నర్ధకల్పనలు పూజ్యంబంచుఁబూజ్యంబుగాఁ
జెవికిన్పూబన్పనిహారి ప్రౌఢిమ మెదోసింహాసనాసీనుదిన్
బవిరేన్దాల్వని యొగ్గుబలుకుటుచితంబా వేదనారాయణా!



## 396 యతిరాజు వెంకటాచార్యుఁడు

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; పెరుమాళ్ళార్యపుత్రుఁడు. కందాళ వరదాచార్యుని శిష్యుఁడు.

ఈకవి ముక్తిచింతామణియును నాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచించి, శ్రీజగన్నాథస్వామి కంకితము చేసెను. ఇరెదు

జగన్నాథక్షేత్రమహాత్మ్యము వర్ణింపఁబడినది. జగన్నాథక్షేత్రము ఓఢ్రదేశములోని ఉత్కలమండలమునందున్నది. దీనిని నీలాచలక్షేత్రమనియు పురుషోత్తమక్షేత్రమనియు పూరిజగన్నాథమనియు నెదరు రాజమహేంద్రవరపురాధ్యక్షుఁడైన గానతిమ్మరాయఁడను పద్మనాయకకులజుఁడు కవిని యీగ్రంథరచనమునకై ప్రోత్సహించిన ట్లీక్రింది వచనములోఁ జెప్పఁబడియున్నది.

వ. ఇట్లు గురుపరంపరానుసంధానపూర్వకంబుగా శ్రీజగన్నాయకునకంకితంబుగా ముక్తిచింతామణిప్రబంధంబు తెనుంగు సేయుమని రాజమహేంద్రవరాధ్యక్ష పద్మనాయకాగ్రేసర గానతిమ్మరాయకృత కనకాంబరాభరణానులేపనపూర్వక సమర్చకప్రేరితుండనై తెనుంగు సేయంబూనినఁ దన్ముక్తిచింతామణి ప్రబంధంబునకుఁ గృతినాయకుండైన శ్రీజగన్నాయకుని వంశావతారంబభివర్ణించెద.

ఈతిమ్మరాయని గృహనామము "కోన" అని యాంధ్రకవుల చరిత్రమునందుదాహరింపఁబడినది. ఈతిమ్మరాయ తెవ్వరో తెలియదు. "పురవరాధ్యక్ష" అనుశబ్దమునకు రాజమహేంద్రవరము పరిపాలించిన ప్రభువుఁ గాడనియు, నిప్పుడు "మునసబు" అని పిలువబడుచుండెని "గ్రామాధికారి" యుద్యోగమువంటిదై యుండుననియుఁ దలఁచుచున్నాఁడను

గ్రంథాంతగద్యలో కవి తన గృహనామాదికమిట్లుగాఁ జెప్పుకొనియున్నాఁడు.

"ఇది సకలవిద్యాప్రదానాదికారణ హయగ్రీవ కరుణాకటాక్ష ప్రసాదితకవితావిశేష యతిపతిచరణారవింద సేవా మరందమదవదిందిందిరవరకందాడ వరదాచార్యకృపావిశేషదత్తమను రత్నార్థనిష్ఠాగరిష్ఠ యతిరాజకులపవిత్ర పెరుమాళ్ళార్యసుపుత్ర వేంకటాచార్యనామధేయ ప్రణీతంబైన ముక్తిచింతామణిప్రబంధంబు"...

కవి గోదావరిమండలమువాడనుట నిశ్చయము కాని నివాస గ్రామము తెలియరాలేదు. గోదావరిమండలములో "యతిరాజ్య" మనుగృహనామముగల శ్రీవైష్ణవులున్నారు. మా గ్రామములో "యతిరాజ్యం" వారికి 'యీనాము' భూములుండెడివి. ఈకవి కాలము దెలిసికొనుటకాధారములు లభించలేదు. బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవులచారిత్రమున "ఈగ్రంథమిన్నూరు సంవత్సరములకుఁబూర్వమే చేయబడినదేమో! జగన్నాథమాహాత్మ్యకవిత్వము రసవంతముగా నేయున్నది" అని వ్రాసియున్నారు ఈకాల నిర్ణయము సరియైనదైనయెడల నీతఁడు పదునేడవశతాబ్దివాఁడై యుండును.

—) ✕ (—

## 397 కాళ్ళకూరి లక్ష్మీపతి

ఈకవి యార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. భరద్వాజగోత్రుఁడు. కృష్ణార్జునసంవాదమను బద్యకావ్యమును రచించిన నాగమనీషికిని నాగమాంబకును పుత్త్రుఁడు. దెందులూరి శివదేవుని శిష్యుఁడు.

ఈతఁడు భద్రాకళ్యాణమను నాల్గాశ్వాసముల యుత్తమప్రబంధమును రచియించి కాశీవిశ్వేశ్వరున కంకితమొనర్చెను. అందుఁ దననుగూర్చి కవి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. పాత్రభారద్వాజగోత్రుండ సంచితా
 పస్తంబసూత్రుండఁ బ్రౌఢకావ్య
సరణిఁ గృష్ణార్జునసంవాదకథ పద్య
 కావ్యంబు చేసిన కాళ్ళకూరి

నాగమనీషికి నాగమాంబకుఁ గూర్మి
తనయుండ సోమప్రధానమౌళి
యనుజుండ వాగ్దేవతానుగ్రహప్రాప్త
సారస్వతైక విశారదుండ

గీ॥ నాంధ్రగీర్వాణభాషా మహాప్రబంధ
కల్పనానల్పనైపుణ్యాగణ్యబుద్ధి
నిందుశేఖరచరణారవిందభక్తి
రతుఁడ లక్ష్మీపతిసమాఖ్యుఁ బ్రబలువాఁడ.

గ్రంథాదిపద్యములలోఁ త్రిమూర్తుల కన్వయించులాగున మూఁడర్థములు వచ్చురీతిగ నభివర్ణించియున్నాఁడు.

చ॥ నరవరదానచాతురియు నారదగౌరవచారుమూర్తియున్
సరసగవానురంజనము, శంభుసమాఖ్యయు నాగభూతి వి
స్ఫురితమహాశయోన్నతినిఁ బొల్పమరందగు నచ్యుతుండు శం
కరుఁడజుఁ డీప్సితార్థపరికల్పన మున్మలరించుఁ గావుతన్.

ఇతఁడు తనగురువైన శివదేవునిక్రింది పద్యములలోఁ గీర్తించియున్నాఁడు.

గీ॥ వెలయు శైవరహస్య ప్రవీణసాధు
బృందనందితగుణహారి దెందులూరి
తెలగనారాధ్యసుతుని సత్కీర్తియుతుని
మద్గురుస్వామి శివదేవు మతిఁదలఁతు

ఈతఁడు రచించిన భద్రాకల్యాణము ముద్రితముకాలేదు, మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునం దొకప్రతియున్నది. ఈప్రతి విశాఖపట్టమండలమందలి చెల్లూరుగ్రామవాస్తవ్యులగు చావలి అప్పలనరసింహంగారినుండి సేకరింపబడినది.

దీనినిబట్టి కవి విశాఖపట్టణమండలములోనివాఁడుగాఁ గన్పట్టు చున్నాఁడు. ఈకవికిఁదరువాత నీతనివంశమునఁ గాళ్ళకూరి గౌరీ కాంతకవి జన్మించి ధర్మనందనవిలాసమను గ్రంథమును రచియించి యందీలక్ష్మీపతికవిని దనకు వంశకర్తగాఁ జెప్పియున్నాఁడు. ఆ గౌరీ కాంతకవినివాసము. విశాఖపట్టణమండలి చీపురుపల్లి తాలూకాలోని గొప్పేటయనుగ్రామము లక్ష్మీపతికవి నివాసముకూడ నాగ్రామమే యైయుండునని తలంపవచ్చును. ఈ కవికాలము నిర్ణయింపఁదగిన యాధారములు దొరకలేదు. పదునేడవశతాబ్దివాఁడై యుండునని తోఁచుచున్నది. ఇతనికవిత్వము రసవంతముగా నున్నది ఈతని కవితాధోరణి తెలియుటకై భద్రాకళ్యాణమునుండి కొన్నిపద్యము లిం దుదాహరించుచున్నాఁడను.

శ్రీకృష్ణుఁడు భద్రయను కన్యకామణిని వరించినకథ యిందు వర్ణితమైనది. ఈకథనే అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయ మను పేరున పద్యకావ్యముగా రచియించియున్నాఁడు

ఉ॥ నీ విహరించు చొప్పెఱుఁగ నేర్తుఁజుమీ యని పల్కు రాధికన్
నీవి హరించు చొప్పెఱుఁగ నేర్తుఁజుమీయని నవ్వి కమ్మ నె
త్తావులఁబూవుఁబాన్పునకుఁ దార్చి కవుంగిట గారవించు స
ద్భావుఁడు బిందుమాధవుఁడు భవ్యకృపామతి మమ్ము బ్రోవుతన్.



# 398 కొళ్ళకూరి నాగయామాత్యుఁడు

ఇతఁడార్వేల నియోగి బ్రాహ్మణుడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు.

ఈకవి కృష్ణార్జున సంవాదమను పద్యకావ్యమును రచియించినట్లీతనికి మారుడైన లక్ష్మీపతికవి భద్రాకల్యాణమను గ్రంథములోఁ జెప్పియున్నాడు. ఈతని వంశీయులలో సీతనికిఁబిమ్మట, పేరయకవి, సూరయకవి, గౌరీకాంతకవులు గ్రంథములను రచించినట్లు కన్పట్టుచున్నది. గౌరీకాంతకవి నివాసము విశాఖపట్టణమండలమునందలి చీపురుపల్లి తాలూకాలోని 'గొప్పేట' గ్రామమయినట్లు దెలియుచున్నది. నాగయామాత్యుఁడుకూడ నాగ్రామవాసుఁడై యుండును. ఈతనికాలమేదియో తెలియలేదు. పదునేడవశతాబ్దివాఁడై యుండును ఈతఁడు రచించిన కృష్ణార్జునసంవాదమిప్పుడెచ్చటను గానవచ్చుటలేదు. ఇందుగయోపాఖ్యానకథ వర్ణితమైయుండునని యూహింపఁదగియున్నది. గయోపాఖ్యానకథను కృష్ణార్జునసంవాదమను పేరున రచియించినకవులు నలుగురైదుగురుకలరు. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు.

— ※ —

## 399 వెంకటాద్రికవి

ఇతఁడు వాసంతికాపరిణయమను యక్షగానమును రచించి శ్రీవెంకటేశ్వరున కంకితముచేసెను. ఈగ్రంథముయొక్క యముద్రిత ప్రతియొకటి శిథిలావస్థలో తంజావూరు లిఖితపుస్తకభాండాగారమున నున్నది. కృత్యాదికూడ శిథిలమగుటచే కవితనునుగూర్చి చెప్పుకొనిన గద్యపద్యాదుల నుదాహరింపవీలుకలిగినది కాదు. అందలి భాగములనుబట్టి యీక్రిందివిషయములు గ్రహింపనైనది. తోరగంటినరసరాజదత్తమైన గుళదూర్తియను నగ్రహారమొకటి కర్ణాటరాజ్యములో నహోబలప్రాంతమునగలదనియు, నందు 'క్రాంజ' వంశమున తిరుమలార్యుఁడు జన్మించెననియు, నతనికిఁ గొండుభట్లును నతనికి సింగరిభట్లును, నతనికిఁ గొండుభట్లును బుట్టిరనియు, నాతనికిని లింగాంబికకును, గవిజన్మించెననియుఁ దెలియవచ్చినది. ఇతఁడు "సుకవిజనవందనవిలోలుఁడు" కుకవిజనదుర్మదవిఫలుండు సకలలక్షణలక్ష్యసుగ్రంథిసారదుండు సాహితీవిద్యాప్రచండుఁడు సరసగానకళాప్రవీణుఁడు శ్రీహరిపదాంభోజయుగసంసేవకుఁడునఁట.

ఇతనికి స్వప్నములో శ్రీవెంకటేశ్వరుఁడుగన్పడి "మదంకితంబుగా నొక్కయక్షగానంబు రచియింపు" మని యానతిచ్చెనఁట. ఈతఁడు కుకవినిందనీక్రిందిపద్యములోఁ గావించినాఁడు.

క. కాకవితారచనాపర
కాకవితానములనొరయ కాకవితతికే
కాకవితాసర్వజ్ఞుల
కాకవితారచననొరయనర్హాంబగునే.

ఈతనికవిత్వము ప్రౌఢమై సరసముగానున్నట్లు కన్పట్టుచున్నది. ఉత్తమయక్షగానములలోనిదియొకటి - ఈకవిపదునేడవశతాబ్దివాఁడని తోఁచుచున్నది.

## 400 కాళ్లకూరి సూరయామాత్యకవి

ఇతఁడారేల నియోగి బ్రాహ్మణుడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుడు.

ఈకవి సీతారామచారిత్రము మొదలగు కావ్యములను రచియించినట్లీతనికుమారుడైన గౌరీకాంతకవి తన "ధర్మనందనవిలాసము" నందుఁజెప్పియున్నాఁడు; ఈతని గ్రంథములేవియు నిప్పుడుగానవచ్చుట లేదు. గౌరీకాంతుని నివాసము విశాఖపట్టణమండలమందలి గొప్పిట యను గ్రామమగుటచే నీతని నివాసమూగామనియే చెప్పనొప్పును. ఈకవి కాలము క్రీ. శ. ౧౭౫౦ ప్రాంతమయియుండును. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు.

—※—※—

## 401 కోటీశ్వరుఁడు

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుడు; శ్రీవత్స గోత్రుఁడు; చక్రిపామాత్య మంగమాంబలకుఁబుత్రుడు; గణపయామాత్య చెన్నమాంబికలకుఁ బౌత్రుడు; వేంకటమంత్రి పోలమాంబలకుఁ బ్రపౌత్రుడు. ఈతని వంశమును వర్ణించిన పద్యము లిరువదివఱకుఁ గలవు. కాని యందు చరిత్రమునకుపయోగించు నంశములు లేనందున వానినివిడిచి, శ్రీవత్సస గోత్రామాత్యులను వర్ణించిన యొక్క పద్యము నిందు క్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

చ. కలిగిరి కొందఱిందు కరకందళ చంద్రసితారవింద ని
ర్మల తరహార హీరశర రాజితభూధర శారదాభ్రమం
జల తరకీర్తి పాత్రులు విశుద్ధచరిత్రులు లోకమిత్రు ల
త్యలఘుకళాసమార్జిత దయారసనిత్యు లమాత్యు లిప్పుహిన్.

ఈకవి భోజసుతాపరిణయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీగోపాలకృష్ణునకంకితమొసంగెను. కవి సామర్థ్యాదులను తండ్రి సమక్షమునను న్న విద్వజ్జనులు నుడివినట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాడు.

శా. వ్రాయున్ గమ్మల వక్కణల్ వయస నేపద్దెంబు లౌనట్లుగాఁ
జేయున్ సత్కృపబాంధవాప్తసుజనశ్రేణుల్ ప్రహర్షింపఁగా
డాయున్ బెద్దలఁ గన్నయంత మది వేడ్కల్మీఱఁగా మేలు దీ
ర్ఘాయుశ్శ్రీనిధి కోటయామాత్యుఁడను విఖ్యాతిం బ్రకాశింపవే.

సీ. తల్లిదండ్రులకన్న దైవంబు మఱివేఱె
కలదెయంచుఁ దలంచు ఘనమనీష
విద్వజ్జనామోదవిస్మయావహముగాఁ
గృతులొనర్పఁగఁ జాలు నతిశయంబు
స్వామికార్యైకనిర్వాహసామర్థ్యఁబు
వెలయింపఁ జాలు వివేకపటిమ
సజ్జనుల్ తనుమెచ్చ సంతతాచారప్ర
వీణత వర్తించు విమలబుద్ధి
కలిగి విలసితసత్కీర్తికల్పవల్లి
ఘనసమఫలాయమాననక్షత్రనివహ
కుముదజాహితమండలి నమరి యెపుడు
శాశ్వతగుణైకధన్య కోటీశ్వరార్య.

మ. తనరున్ గోటయమంత్రి నీదగు సముద్యల్లేఖినీశ్లాఘనీ
యనినాదంబు కుతూహలాతిశయనృత్యద్ధాత్రిసీమంతినీ
కనదంఘ్రిద్వయరత్ననూపురఝణత్కారానుకారానురం
జనవత్సారసునిస్వనంబయి నృపస్థానంబులం దెంతయున్.

ఈపద్యములలోఁగాని, పుస్తకమునందు మఱెచ్చటను గాని కవి నివాసమును కాలమును దెలియఁదగిన యాధారము లేమియుఁ గాన్పింప లేదు. కవిత్రయమును మాత్రము పూర్వకవులుగా స్తుతించి పిదప-

క. మేధావిలాస సంభృతి
మాధవపర్యంక భోగిమండనసమరూ
పాధునిక కవివరేణ్యుల
సాధువచోనియుతిఁ దలఁచి సన్నుతి చేతున్.

అని యాధునికకవులను స్మరించుటచే నీతఁడు మధ్యకవులలోఁ జేర్పఁదగిన వాఁడుగాఁ గనఁబడుచున్నను వీరేశలింగము పంతులు గారు "ఇతఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందటనుండి యుండవచ్చును" అని కవుల చారిత్రమున క్రీ. శ. 1899వ సంవత్సరమున వ్రాసియున్నారు. అదియే సత్యమైనచో నీతఁడు పదునేడవశతాబ్దియందున్నవాఁడుగాఁ బరిగణింప వలసియున్నది.

ఈతఁడు రచించిన ప్రబంధమున, రుక్మిణి శ్రీకృష్ణునిఁబరిణయ మాడినకథ వర్ణితమయినది. ఈతని కవిత్వము ప్రౌఢమై, సలక్షణమై, కదళీపాకమున రమణీయముగానున్నది. శైలి దెలియుటకై కొన్ని పద్యములిట నుదాహరింపబడుచున్నవి.

చ. మనుజుఁడు కార్యసిద్ధికయి మానుషయత్న మొనర్చువేళ నె
మ్మనమున నిశ్చయించి మతిమంతుల కెల్లను సమ్మతంబుగా
నొనరిచెనేని దాన జయమొందును దైవవశంబుగాక త
క్కిన నతఁడేమి సేయు నని క్రించుగ నెంచరు పెద్దలాతనిన్ ౧౮

మ. అలరుంబోఁడి ముఖారవిందమహనీయామోద వాంఛాప్తిచే
నవిసంఘుంబులు వ్రాలి గంధఫలిబాయన్ మించు నాసారుచిం
గలఁగంబాటియు దూరమేఁగకయె తద్గంధాతిలుబ్ధంబులై
నిలిచెన్ బైనన నొప్పు ఫాలవిచలన్నీలాలకల్ చూనకున్. ౨౮

ఈపద్యము రామరాజభూషణవిరచిత వసుచరిత్రమందలి "నానాసూనవితానవాసనల" అను పద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

చ. వసితలు గ్రుమ్మరించు హిమవారితరంగిణు లొక్కటె మొత్తమై
కనకనిభాంగియంగమున కాఁకల నింకఁగఁ బాటి క్రమ్మఱన్
గనఁబడ వయ్యె నట్లయగుఁగాదె మహాపిహింబురాశియు
త్యనుపమలీల పొంగుఁటయందుఁ జొరఁబడి మగ్ననేర్చునే ౩౭

# 402 దివి రమణకవి

— ※ —

ఇతనినిగూర్చి బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు, ఆంధ్ర కవులచారిత్రమునందిట్లు వ్రాసియున్నారు.

ఇతఁడు వాసిరెడ్డి రామలింగప్రభుని ప్రేరణముచేత శృంగారధామమను రెండాశ్వాసముల ప్రబంధమును జేసి శ్రీ మంగళగిరి నృసింహస్వామికంకితము చేసెను. కవి తన్నుఁగృతిచేయఁ బ్రేరేపించిన రామలింగప్రభునిఁ దనప్రబంధమునం దిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. ఏధన్యువంశేశుఁ డెలమి నుమానాథు
వరమున నభివృద్ధివంతుఁ డయ్యె
నేమేటి కూటస్థుఁ డెసఁగ వేమనృపాలు
ప్రీతిచే భువి వాసిరెడ్డి యయ్యె
నేమహాత్ముని తండ్రియొంటెగుతుబుశానృ
పాలునిచే గజాందోళికంబు
వేయయ్య యగ్రజుఁ డెలమి శాత్రవవీర
గజరాజసింహతఁ గలన నమరె
నతని వంశజుఁ డతనికూటస్థజాతుఁ
డతని సత్పుత్రుఁ డాతని తమ్ముఁ డగుచు
నమరె బహుగుణ రత్నరత్నాకరుండు
కదనవిజయుండు రామలింగప్రభుండు.

ఈపయిపద్యమునుబట్టియే యీకవి నిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పలేనివాఁడనుట స్పష్టమగుచున్నది. అభివృద్ధిమంతుఁడనుట కభివృద్ధివంతుఁడనియు, అంటెననుట కెంటెననియుఁ బ్రయోగించినను మొత్తముమీఁద గవిత్వము రసహీనమైనది కాదు. కృష్ణామండలము

లోని యమరావతీసంస్థాన ప్రభువుల ప్రేరణమునుబట్టి పుస్తకమును రచించుటయు మంగళగిరినృసింహునకంకితము చేయుటయు విచారింపగా నీకవి కృష్ణామండలములోనివాడనుట తెలుచున్నది. కుటుంబశాను బేర్కొనియుండుటచేతఁ గవి పదునేడవశతాబ్దమధ్యమునందుండినట్లూహింపదగియున్నది. శృంగారధామమునుండి రెండుపద్యములిందుదాహరింపఁబడుచున్నవి.

చ. అలికులవేణికిం బ్రియుఁడనంగ నృపాలుఁడు దాడిచేసి యీ
వలనికి నేఁట రేపటనె వాసిగ రాఁగలఁడంచు బాల్యమున్
గళవళమంది చింతిలఁగఁ గన్పడెఁ దన్ముఖరాజచిహ్నముల్
కలికి వయః ప్రకాశగుణకాంతియు బాల్యవయస్సుసంధిగన్　౭౧

మ. సరిసీవారెదిరింటికేఁగఁగనియేఁ జాలించియున్నంతలో
నరయందత్ఫలమేమి? మున్నటిమదీయార్థంబుమాకిచ్చు యే
సరణింబోయినఁ బొమ్మటంచుపడిఁ జంచచ్చిత్తయై వేశ్యత
త్తరయుగ్మాంచితకంకణంబులొగిఁదాఁ గాంక్షించి తీసె న్వెసన్　౭౨

ఈగ్రంథము నాకులభింపలేదు. కవులచరిత్రకారులు గ్రంథమును జూచియుందురు. కాని యెందువలనఁ నో కవికులగోత్రాదులనుగూర్చి కృత్యాదియందును, గద్యయందునేమి చెప్పకొనియెనో తెలుపలేదు. కృతిప్రేరకుని తండ్రినామమునుగాని యగ్రజునినామమునుగాని కవి పైపద్యములో తెలుపలేదు. చరిత్రకారులు నానామములను నిర్ధారణ మొనర్పలేదు. వాసిరెడ్డివారిలో రామలింగనామధారులు పలువురున్నారు.



# 403 పాపనామాత్యుఁడు

— ※ —

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; వెంకట కృష్ణునకును లక్ష్మమ్మకును బుత్రుఁడు; రామచంద్రునకును దమ్మాయమ్మకును బౌత్రుఁడు; లక్కమాంబకును శాయిమంత్రికిని బ్రపౌత్రుడు. ఈతని గృహనామ మేదియో తెలియ లేదు.

ఈకవి స్కాందపురాణాంతర్గతమైన సేతుఖండము నాంధ్రీకరించి శాకనగరమందలి గోపాలస్వామి కంకితము చేసెను.

కవికిఁ బ్రపితామహుఁడైన శాయిమంత్రి వర్తులోపలనగరమునకుఁ గరణమయినట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. హరితసగోత్రజాతుఁడయి యంచిత దానవినోదశీలియై
గరిమను వర్తులోపలనగర్యధినాథుఁడనంగ, శాయిమం
త్రి రసికుఁ డంచనం జెలఁగె దీపితరాజసభం బ్రసిద్ధుఁడై
చిరతరకీర్తిశాలియయి చింతితయాచకకామితార్థియై.

“వర్తులోపలనగర” మనగా “గుండ్రాయి” యని తోఁచుచున్నది. “గుండ్రాయి” యను గ్రామము కృష్ణామండలమునందు నందిగాం తాలూకాలోనున్నది.

కవి తల్లియైన లచ్చమాంబ వసుపేటయందలి గౌరీప్రసాదమును బడసినట్లీక్రింది పద్యమున నుడివియున్నాఁడు.

శా. ఆసాధ్వీమణి లచ్చమాంబ వసుపేట్యావాస గౌరీప్రసా
దాసంపాదిత భోగభాగ్య యగుచున్ దానంబు లుర్వీసుర
స్త్రీసంఘంబుల కిచ్చు నెచ్చుపడ నాశ్రీలక్ష్మి నా విశ్రుతిన్
వాసః కాంచనధేనుధాన్యసమితిన్ వంచింప కెల్లప్పుడున్.

వసుపేటయనఁగా బంగారుపేటయేమో ? అది యెచ్చట నున్నదో !

ఈకవి శాకనగరమునకుఁ గరణమైయచ్చటనున్న గోపాలస్వామి యాలయము శిథిలముకాఁగాఁ బునర్నిర్మాణము గావించినట్లీక్రింది వచనమువలనఁ దెలియుచున్నది.

వ. నేను మజ్జననీజనకలాలన ప్రవర్ధమానుండనై కాంతావాగిందిరా నామకన్య (లక్ష్మీకాంతము కాఁబోలును) ను బాణిగ్రహణంబు చేసి సంతతివడసి వ్యవహారదశను శాకనగరంబునకు నధికారంబు సేయుచుండితి. ... ... ...

ఇట్టి ప్రతీతిగల శాకనగరంబున నధికారంబు సేయుచుండితన్నగరంబున గోపాలస్థలంబుండి శిథిలంబై యున్నఁబునరాలయంబుఁగల్పించి సాధారణ నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ పూర్ణిమా పర్వంబున (శ్రీ) గోపాలస్వామి సంప్రోక్షణంబు గావించి యుత్సవంబు చేసినఁ దద్రాత్రి సుఖసుప్తుండనగు నాస్వప్నంబున (శ్రీ) గోపాలస్వామి సాక్షాత్కారంబుగా దర్శనంబుఁ బ్రసాదించె.

గ్రామనామములను సంస్కృతీకరించుటచే నీతని నివాసగ్రామ మేదియో స్పష్టముగాఁ దెలియుటలేదు. శాకానగరమనలా కూరపాడు లేక కూరాడయై యుండును. కృష్ణామండలమున కూరాడ యున్నది.

ఈకవి పూర్వకవులను నుతించుటలో బింగళి సూరన్న నీక్రింది పద్యములో నుతించియుండుటచే, నీకవి పదునేడవశతాబ్దివాఁడై యుండునని తోఁచుచున్నది.

సీ. మూర్తియై చెలువందె ముఖ్యపేశలశబ్ద
శాసనుండగునన్న సత్కవీంద్రుఁ
డసువుగా విలసిల్లె నలసోమయాజియుఁ
బటుతరావయవాళి భాస్కరుండు

పొసఁగఁ గట్టినయట్టి పుట్టఁబు పోతన
పింగళి సూరప రంగుపూఁత
అలసాని పెద్దన విలసదాత్మస్థితి
శృంగారముల ప్రోవు వెంగళప్ప.

గీ. జగతిఁ గవితామతల్లికి... ...
కనుచుఁ గొనియాడునట్టి యాయాంధ్రకవుల
నభినుతించెదఁ దత్ప్రసాదాతిశయము
తోడుగావుత మత్కవితోక్తికనుచు.

ఇందలి వెంగళప్ప బహుళాశ్వచరిత్రను రచియించిన దామెర వెంగళప్పయై యుండును. లేదా అష్టమహిషీకల్యాణాదులు రచించిన తాళ్లపాక తిరువెంగళనాథుఁడుగా వలయును.



## 404 కూచిమంచి జగ్గకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్య గోత్రుఁడు; గంగనామాత్యునకును లచ్చమాంబకును బుత్రుఁడు. ఆంధ్ర భాషయందు రసికజనమనోభిరామాద్యనేక గ్రంథములను రచించిన సుప్రసిద్ధకవిశేఖరుఁడగు కూచిమంచి తిమ్మకవికితఁడు తమ్ముఁడు; ఈతని నివాసము గోదావరీమండలములోని పిఠాపుర సంస్థానమునకుఁ జెందిన కందరాడ. ఈతని నిజనామము జగన్నాథకవి.

ఈకవి చంద్రరేఖావిలాపము, సోమదేవరాజీయము, సుభద్రా పరిణయము, జానకీపరిణయము అను ప్రబంధములను, రాధాకృష్ణచరిత్ర మను ద్విపదకావ్యమును, భక్తమందారశతకమును రచియించెను.

సుభద్రాపరిణయమునఁ దన యన్నయగు తిమ్మనకవి యిట్లు నుతించి యున్నాఁడు.

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుఁ గూచిమం
చ్యన్వయాంబోధినీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనా
మణియగు లచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభునిఁ
గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌ
రేయుని బుధజనప్రియచరితుని

దెందులూరి లింగనారాధ్యదేశికేంద్ర
దత్తమాహేశ్వరాచారవృత్తిరతుని
గందరాడ ఘనగ్రామమందిరుని మ
దగ్రజుని దిమ్మకవిరాజునభినుతింతు

ఈఁతడు రచించిన సుభద్రాపరిణయ మాఱాశ్వాసములుకలది. దీనిని గవి శ్రీ జగన్నాథస్వామికంకితము చేసెను. జగన్నాథస్వామి కవీష్టదైవమైనట్లు గద్యలో "శ్రీ మజ్జగన్నాయక దేవ దివ్యకృపా నిరీక్షణసంలబ్ధసారకవితావిచిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయ" అని వ్రాసికొనియుండుటంబట్టి తెలియుచున్నది. సుభద్రాపరిణయమని పేరుపెట్టినను గ్రంథమందు, అర్జునుఁడు తీర్థయాత్రకుఁ జనుటయు, ఉలూచియను నాగాంగనను, మలయధ్వజునితనయయగు చిత్రాంగదను శ్రీకృష్ణ బలరాములసోదరియగు సుభద్రను, బరిణయమాడినకథను నిందుఁజెప్పియున్నాఁడు. చేమకూర వెంకటకవికృత విజయవిలాసము నందున్నట్లే యీకథలును చెప్పఁబడినవి. ఇతివృత్తమునం దొక్కించుక భేదము కలదు. అచ్చటచ్చట విజయవిలాసమునందలి పద్యముల

కనుకరణమువలెఁ గన్పట్టుపద్యము లున్నను మొత్తముమీఁద కవి స్వతంత్రముగనే యీగ్రంథమును రచించినాడు. అర్జునుఁడు జగన్నాథ మును దర్శించినాడని చెప్పుటలో,

క. అంతట నింద్యద్యుమ్న స
రోంతమ్మునఁ దీర్థమాడి యరిగి సుభద్రా
కాంతుని జనసన్నుతగుణ
వంతు జగన్నాథు సాధువత్సలుఁ గాంచెన్

అని వ్రాసియుండెననియు, నిందుఁగవి పౌర్వాపర్యములారయ లేదనియుఁ గొందఱాక్షేపించెదరు కాని యదియొక గొప్పలోపముకానేరదు.

కవిత్వశైలి తెలియుటకై సుభద్రాపరిణయమునుండి పద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

మ. హల మేప్రొద్దు భుజాగ్రపీఠమున గాయల్ గాయఁగా మోఁచి యు
త్కలికం ద్రిమ్మరుఁగాని కానిపొలముం దా దున్ని పండించె నే
మొలకుం దెల్లనిబట్టగానమయిసీ ముప్పొద్దుఁగల్ దాఁవునా?
హాలియంచు న్నరసింతు రఁదు నయభాగ్యాకర్షకుల్ కర్షకుల్ ౧౭

ఉ. ఎక్కడదానవునీవు హరిణేక్షణ యీజగ మెద్ది నీవు న
న్నిక్కడి కేల తెచ్చితి విదేమిటి! యోజ దృఢవ్రతస్థుడై
దిక్కుల వెంబడిం జను విదేశుల నట్లొనరింపఁ బాడియే?
యక్కట బేలనై యురక యారడిఁ జెందుట మేలె చెప్పుమా! ౨౭

గీ. అలరువిల్కాడు పాంథుల గెలువఁ బూని
స్వారి వెంచేయఁగలఁడని సమయభటుఁడు
రమణ గట్టిన మణితోరణము లనంగ
మ్రాఁకులం దెల్లఁ జిగురుజొంపములు విరిసె ౩౭

ఉ. ఓయతిచంద్ర! మీరు గనకుండు నదీనగరీప్రసిద్ధదే
వాయతనంబులుం గలవె యారయ నివ్వసుధాతలంబునం

దేయెడనైన భారతకులేంద్రుని నర్జునుఁ జూచినారె! మీ
రాయతసత్కృపాగరిమ నంతయు నాకెఱుఁగంగఁ దెల్పరే! ౨౮

చ. రవియను కెంపుబంతి ప్రజరంజిల మున్ సమయైంద్రజాలికుం
డవిఃశలీల నాడి యది యంతట మాయము చేసి చంద్రుఁడన్
ప్రవిమలవజ్రకందుకము గ్రమ్మఁగఁ జూపఁగ నీలిదుప్పటిన్
గవిసిన వేసెనో యనఁగ గాఢతమిస్రము పర్వె రోదసిన్ ౫౮

ఉ. ముప్పిరిగొన్న మోహమున మున్న యతీశ్వరరూప మూని సొం
పొప్ప భవద్గృహాంగణ మహూపవనంబుననుండి వెండి నన్
గుప్పున కౌఁగలీక ననుఁ గొందలమందఁగఁ జేసి యేగి తీ
విప్పు డటుల్ జుడింగి చన నింతయు శక్యము కాదు కోమలీ!

ఈతఁడు రచించిన గ్రంథములలో చంద్రరేఖావిలాపము తుది రచనమయినట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. రచియించితివి మున్ను రసికులౌనని మెచ్చ
సురుచిరజానకీపరిణయంబు
వచియించితివి కవివ్రాతము లొప్పగడంగ
ద్విపద రాధాకృష్ణ దివ్యచరిత
ముచ్చరించితివి విద్వచ్చయంబు నుతింపఁ
జాటుప్రబంధముల్ శతకములును
వర్ణించితివి యిరువదిరెండు వర్ణనల్
రాణించగా సుభద్రావివాహ

మాంధ్రలక్షణలక్ష్యంబు లరసి నావు
భూరిరాజన్యసన్సత్ప్రపూజితుఁడవు
బళిర! నీభాగ్యమహిమ చెప్పంగఁదరమె
జగ్గకవిరాజచంద్ర! వాచాఫణీంద్రా!

చింతలపాటి నీలాద్రిరాజను క్షత్రియపుంగవు నీకవి ధనార్జనా సక్తి కలవాఁడై యాశ్రయింపఁగా నాతఁడు తానుంచుకొనిన చంద్రరేఖ యను వేశ్యను నాయికఁగాఁ జేసి యొక ప్రబంధమును రచియింపు మనియుఁ దగిన బహుమాన మొసంగెదననియుఁ జెప్పెనఁట! అందుల కీతడంగీకరించి చక్కని ప్రబంధమును రచియించి, తీసికొని వెళ్లగా నీలాద్రిరాజు ఆణివిళ్ళ వేంకటశాస్త్రియను నారామద్రావిడ బ్రాహ్మ ణుని ప్రోత్సాహముపై జగ్గకవి తెచ్చిన గ్రంథమును గైకొనక తిరస్క రించెనఁట అందుపై నాతఁడాగ్రహముచెంది యాగ్రంథమును చించి వైచి, చంద్రరేఖావిలాపమను నీగ్రంథమును రచియించెను.

ఈగ్రంథము నోటవచింపరాని బూతులతో నిండియున్నది. తిట్టుకవులు చాలమంది కలరు గాని తిట్లతో గ్రంథమును రచించినవాఁ డీతఁడేగాని మఱియొకరు లేరు. రావణదమ్మీయాదు లున్నవి గాని యందు బూతులు లేవు. సభలోఁ జదువుటకు జంకనక్కర లేదు. ఈ గ్రంథమట్టిది కాదు. కొన్ని పద్యములు బండబూతులుతో నున్నవి. మిగిలినవి తిట్లతో నున్నవి జగ్గకవి, సరసుఁడు మనోహరముగా కవిత్వము చెప్పఁగలవాఁడు ఔచిత్యము నెఱింగినవాఁడు. అట్టిమహాకవి లేఖిని యిట్టి బూతుపుస్తకమును వ్రాయుటకేల జంకతేదో తెలియ కున్నది దనాశాపీడితుఁడై యొక వేశ్యను నాయికఁగా జేసి గ్రంథమును మిగుల కష్టపడి వ్రాసిన యాతనికి నిరాశ కలిగినతోడనే జనించిన యాగ్రహమాతనిచే నిట్టిపనిచేయించియుండును. కృతి నిరాకరణావ మానము ను భరింపలేకపోయినాడు. వేశ్యను నాయికగాఁ జేసి పుస్త కమును వ్రాయుటయే కూడని పని. ఆపని చేసిన పిదప నిరాదరణ జనించినది. అందుచే నీకవి యాకృతిపతి యపయశమును శాశ్వతము చేయ సమకట్టి యిట్టి బూతు గ్రంథమును రచించినాఁడు. "అర్ణవ వేష్టితాఖిల మహామహీమండలిలోన బూతులం బూర్ణుఁడ" నని కవియే వ్రాసికొనియున్నాఁడు. పూర్వకవి వర్ణనమునఁగూడ నీతఁడీగ్రంథమున

తిట్టుకవులను హాస్యకవులను మాత్రమే యిట్లు వర్ణించినాఁడు.

క. భీమకవి రామలింగని
శ్రీమంతుండైన వెలుంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో
ద్దామగతిం జిత్తవీధిఁ దలఁచి కడంకన్.

ఈతఁడీగ్రంథమును రచియించి యూరకొనలేదనియు, గోల కొండ పట్టణమునకుఁబోయి, యచ్చటి మహమ్మదీయ ప్రభువులపైఁ బద్యములుచెప్పి వారలనాశ్రయించి యాగ్రంథమును, విజయనగర సంస్థానాధిపతుల సభలో నీలాద్రిరాజు సమక్షమున జదివించి వినునట్లా సంస్థానాధిపతియు, గోలకొండకు సామంతుఁడునగు విజయరామగజపతి యొద్దకొక ఫర్మానాను పంద్రెండుగురు సిపాయిలతోఁగూడఁ దెచ్చి నిండుసభలోఁ గవి స్వయముగా నీపుస్తకమును జదివెననియు, నీలాద్రి రాజు నెన్నితిట్టినను, నాతనిభార్యను పొగడుచు వ్రాసిన

క. ఖలుఁడైన నీలనృపుఁడీ
యిలపై నిన్నాళ్లు బ్రతుకునే నరసాంబా
గిళకవితకనమయమం
గళసూత్రోత్కృష్టమహిమఁగాక కుమారా!

యనుపద్యమును విని, నాయమ యీమాత్రపు గౌరవమునైనఁ గవి నిలువబెట్టెనుగదా యని సంతసించి తనయాభరణములను దీసి కవికి బహుమానముగాఁ బంపెననియు గ్రంథమును సాంతముగా శాంతముతో విని, విజయరామగజపతి "మాబావకుఁదగినట్లు బుద్ధిచెప్పితివి కవీ" యని యనెననియుఁ జెప్పెదరు. ఇందెంత సత్యమున్నదో చెప్పజాలము, ఆకాలమునం దిట్టి కార్యము లసాధ్యములు కావు.

చింతలపాటి నీలాద్రిరాజు, విజయరామరాజుగారి చెల్లెలి పెనిమిటియని వీరేశలింగము పంతులుగారు, ఆంధ్రకవుల చరిత్రములో

వ్రాసియున్నారు కాని యదిసత్యముకాదు. నీలాద్రిరాజు సోదరిని విజయరామరాజుగారు పరిణయమాడినట్లు మార్కండేయపురాణావతారికలో నీక్రిందిపద్యములో నున్నవి.

ఉ. చింతలపాటి నీలనృపశేఖరు చెల్లెలిఁ జంద్రమాంబ న
 భ్యంతరనిర్మలత్వగుణ పాకలపాటినృసింహశైలభూ
 కాంతునిపుత్రి రాజమను గైకొనెఁ బత్నులుగాఁగ వారలా
 గుఁతియు మాద్రి పాఁడునృపుఁ గొల్చిన రీతిని గొల్చి రానృపున్.

గీ. వీరిలోన చంద్రాంబ శ్రీ విజయనగర।
 రాజధానికి నత్యంతరమ్యతా సు।
 సౌఖ్యదంబుగాఁగ కాసారమట్ల!
 నొకతటాకంబుజేయించె నుజ్వలముగ॥

ఈబంధుత్వమును జగ్గకవి గ్రంథస్థము చేయలేదు. విజయరామరాజుగారు, బొబ్బిలియుద్ధమునకుఁ బూర్వము రాజమహేంద్రవరమున ఫ్రెంచిసేనానాయకుఁడగు 'బుస్సీ'ని కలసికొనుటకై విజయనగరమునుండి బయలుదేరి పోవునప్పుడీ నీలాద్రిభూపతి సన్నద్ధుఁడై కూడనుండెనని రంగారాయచరిత్రమునందీ క్రింది పద్యపాదములఁ జెప్పఁబడియున్నది.

 "నలఘువిక్రముఁడు చింతలపాటి నీలాద్రి
  రాజుగా రొక కొంత ఫౌజుతోఁడ"

ఈనీలాద్రిరాజు జగ్గకవిని కృతి రచింపుమని చెప్పినట్లును, పిమ్మట కృతిని గైకొనక నిరాకరించినట్లును నీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

మ. సరసాగ్రేసరు కూచిమంచికులభాస్వద్వార్ధి రాకావిధుం
 జిరకీర్తిన్ బహుళాంధ్రలక్షణవిదున్ శ్రీమజ్జగన్నాథ సు
 స్థిర కారుణ్యకటాక్షలబ్ధకవితాధీయుక్తునిన్ జగ్గరా
 డ్వరనామాంకితు నన్ను జూచి పలికెన్ వాల్లభ్యలీలాగతిన్.

క. వేంకటశాస్త్రిలు మాకు న
లంకారగ్రంథ మొకటి లలి సురభాషన్
బొంకించె నాంధ్రకావ్యం
బంకిత మొనరింపు నీవు నట్లనె మాకున్

క. అని మున్ను సత్ప్రబంధము
నొనరింపు మటంచుఁ జెప్పియుంటిమి వెస న
ట్లనె నీవుఁ జెప్పఁగా నది
గొన నిపుడు ధనంబు లేదు గొదువలభించెన్.

కృత్యాది పద్యమిది:

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబలప్రతాపపుర రక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్జ్వల కేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు దా
వీకన్ జింతలపాటి నీలనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్.

ఇందలి కవిత్వశైలి తెలియుటకై, బూతులు లేని పద్యములను రెండింటి నేరి యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. అందలము ల్మతాంగములు నశ్వచయంబులు పల్లకీలునున్
మందర శైలరాజనిభమత్తగజంబులు వెంటనంటి రా
ముందుగ పొందుగా ధనము మూటలు వేటలు కొన్కలంపి నా
మందిరసీమ గాంతు రసమాననృపాలకుమారు లెప్పుడున్,

ఉ. వేంకటసోమపేధి కిది వేగ మెఱుంగఁగఁ జెప్పకుండినన్
గింక వహించి దుఃఖపడు కేవల మాతఁడు దీని గన్నవాఁ
డింకిట నుండనేల యని యేడ్చుచు నాతనిఁ జేరి యొంతయున్
జంకక చెప్ప నాతఁడును సంభ్రమదుఃఖదయార్ద్రచిత్తుఁడై.

ఈనడుమ నిందలిబూతుశబ్దములను తొలఁగించి యన్యపదములను జేర్చి యీగ్రంథమును ముద్రింపించియున్నారు.

ఈనీలాద్రిభూపతియింటిపేరు 'రాచిరాజు' వారై నట్లీగ్రంథాంత మందలి "రాచిరాజోల్లసద్వంశదావానలా" యనుపద్యపాదమువలనఁ దెలియుచున్నది.

ఇట్టిగ్రంథమునెవ్వరును రచియింపఁజాలరనియు, నిది యాచంద్రార్కముభూమిపై నిలుగఁగలదనియు నీక్రిందిపద్యములలోఁ గవి చెప్పినమాట యింతవఱకు సత్యమైనది.

క. ఈకృతికి సమముగా నీకృతి
నేకవులును జెప్పఁజాల రిది బిరుదము భూ
లోకములోపల నీకున్
జేకురె నిటు హాస్యలీల నీలనృపాలా!

చ. ధరణియు మేఘమార్గమును దారలు దామరసాప్తచంద్రది
క్కరటిగిరీంద్ర శేషఫణికంధికిటీశ్వరకూర్మనాయకుల్
స్థిరముగ నెంతకాలము వసింతురొ తత్క్రియ నీప్రబంధము
ర్వర సరసోత్తముల్ కవులు వర్ణన సేయఁగ నుండుఁ గావుతన్.

ఈకవి రచియించిన భక్తమందారశతకము నీతనివంశీయులగు కూచిమంచి శ్రీరామమూర్తిగారు ప్రకటించుచు, బీఠికయం దీజగ్గకవి వంశవృత్తము నిచ్చియున్నారు. దానినీక్రింద నుదాహరించుచున్నాఁడను.




" రామా ! భక్తమందారమా ! " అను మకుటముతో ౧౦౧ మత్తేభ శార్దూల వృత్తములుగల యీశతకమును, జగ్గకవి రచియించి యుండెను. శతకాంతమందలి యీక్రింది పద్యములవలన తిమ్మభూపతి యీకవికి 'బేబదల్' బిరుదము నిచ్చినట్లు తెలియుచున్నది.

మ. సరసప్రస్తుత కూచిమంచి కులభాస్వద్వార్ధి రాకాసుధా
కరుఁడన్ గంగనమంత్రి నందనుఁడ రంగ త్తిమ్మభూమండలే
శ్వర వర్యార్పిత "బేబదల్" బిరుద విస్ఫాయజ్జగన్నాథనా
మరసజ్జుండను బ్రోవు మెప్పు నను రామా! భక్తమందారమా!

ఈతిమ్మభూమండలేశ్వరుఁ డెవ్వరో కనుఁగొనవలసి యున్నది. కవికి నివాసగ్రామమయిన కందరాడ పిఠాపుర సంస్థానములోనిది. కాని యీసంస్థానప్రభువులలో తిమ్మరాజులెవ్వరును లేరు. పెద్దాపుర సంస్థానప్రభువులలో నీతని కాలమున కళాతిమ్మజగపతిరాజులు రాజ్యము సేయుచుండిరి. ఆప్రభువే క్రీ శ. ౧౭౩౦ సంవత్సరప్రాంతమున నీకవికి బిరుదము నిచ్చియున్నట్లూహింపఁ దగియున్నది. ఈతిమ్మభూపతి ౬౫ సంవత్సరముల వయస్సున ౧౭౩౪వ సంవత్సరములో రుస్తుంఖాను చే మోసగింపఁబడి యసువులను బాసియుండిరి. కావున నీబిరుదప్రదాన కాలము ౧౭౩౦ అయియుండును.

భక్తమందారశతకమునందలి మూఁడు పద్యము లిటనుదాహరింపఁబడుచున్నవి.

శా. ఆర్తత్రాణపరాయణుండవని ని న్నత్యంతమున్ సజ్జను
ల్గీర్తింపన్ విని తావకీనపదనాళీకద్వయం బాత్మవి
స్ఫూర్తిం జెందఁగ నెంతు నెల్లపుడు న న్బోషింపుమీ సత్కృపన్
మార్తాండద్విజరాజనన్నయన ! రామా !

మ. అమరశ్రేష్ఠుని వారుకంబునకుఁ దూండ్లా హారమీశానమా
ళిమహాభోగికి గాలి మేఁత నిను హాళిన్మ్రొయు మాద్యద్విహం
గమలోకేంద్రున కెల్లఁ బుర్వుగమియే బోనంబు ప్రారబ్ధక
ర్మ మవశ్యంబు భుజింప కెట్లు చను రామా ! ......

మ. ఇటు రా రమ్మని పిల్చి గౌరవముగా హేమాంబరాందోళికా
కటకప్రాకటభూషణాదు లిడి వేడ్కన్ ఱేడు ప్రార్థింప వి
స్ఫుట భంగిం దగు కావ్యకన్యనిడ నొప్పన్ గాని ధ్రో నుర్వి కో
మటి మేనత్త మొ బల్మిఁ గట్టఁగను రామా !

## 405 ప్రభంజనము అహోబలపతి

ఈకవినిగూర్చి మక్కపాటి వెంకటరత్నముగారు భారతి (యువ సం॥ ఫాల్గునమాసము ౫౨౬వ పేజీ) లో నిట్లు వ్రాసియున్నారు.

ఈయన గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా సంతరావూరు వాస్తవ్యుడును ఆగ్రామకరణములలో నొకడునునై యుండెను. చిన్న తనమున విద్యావాసన లేక హాలికవృత్తినుండెను ఈతనిపేరు గాలి ఓబళయ్య ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు. భారద్వాజస గోత్రుడు. తండ్రి నరసింహయ్య. తల్లి లక్ష్మీదేవమ్మ. తన యింటిపేరు ప్రభంజన వంశమని అహోబలపండితీయమున నీతడు వ్రాసికొనెను. తన తండ్రి మొదలగు కరణములు గ్రామములపై వసూలయిన సర్కారుదస్తును హరించి జమీందారుల యొద్దికి బరారికాగా రాజభటు లీతనిని బట్టుకొనిపోయి ప్రభువునాజ్ఞమేరకు గారాగృహస్థుని జేసిరి. ఈతడు చదువరికాకున్నను, శ్రావ్యముగ బాడగలవాడై యుండెను కారాగృహమునం దొకదినమున బాడుచుండగా బ్రభువు మొదలగువారు విని యతనింబిలిపించి పాడించి విని సంతసించి. నీవెవరవని యడుగ నా తడు తనవృత్తాంతమును జెప్పి తాను చిన్నవాడనగుటచే నిర్దోషినని విడిపించినచో తనమేనమామయగు పోలూరి మాధవ సోమయాజులుగారియొద్దకుబోయెదననియు మనవిచేసి వేడికొనెను. మాధవసోమయాజులుగారు జగద్విదితులగుటచే బ్రభువు విని సంతసించి యతనిని విడిపించెను. అంత నాతడు తన తల్లితోగూడ వినుకొండ తాలూకా గోకనకొండ (గోకర్ణగిరి) గ్రామమునకు మేనమామల యింటికి జేరెను. మామగారింటనుండువా రందఱు స్త్రీలు సహా విద్వాంసు లగుటచే నీతనిఁబరిహాసించుటయు, నితడురోషపడి దేశాటన మునకేగెదనని మామగారికిజెప్పగా వారు వలదని వారించి 'నీకొక

మంత్రము చెప్పెదను. దానిని జపించుకొనుమని నృసింహమంత్రము నుపదేశించెను. అంతట నీతఁడచటఁగల కొండగుహయందుఁ జేరి తపముఁ జేయగా స్వామి యొక మనుజాకృతినివచ్చి యేమో నాలుకపై వ్రాసి నీయింటికిఁబొమ్ము రమ్మనియొక రాత్రితోడ్కొని వచ్చి పిలువ నింటివారు తలుపుతీయఁగా నాతఁడదృశ్యుఁడయ్యెను. ఈతఁడొకఁడే యింటఁబ్రవేశించియుండెను. ఓబళయ్య నాఁటినుండి కుశాగ్రబుద్ధి కలిగి మామగారియొద్ద విద్యనేర్చి పండితుఁడై నవద్వీపము మొదలగు చోట్లకేఁగి మిక్కిలి విద్యాభ్యాసము చేసివచ్చెను. మేనమామ నే-తన గురువని యహోబలపండితీయమునఁ బేర్కొనెను. శ్రీరామభక్తుఁడై అహోబలపండితీయమును కవి శిరోభూషణమను పేర నన్నయభట్టీయము నకు వ్యాఖ్యయువ్రాసి అభినవ నన్నయసూరియని బిరుదముగాంచెను. పిదపఁ గాళిందీపరిణయమను నాలాశ్వాసముల పద్యకావ్యము ను వ్రాసెను ఇది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ బ్రకటింపబడినది. కాని గ్రంథమన్యహస్తగతమై గ్రంథపాతమేర్పడి మొదటిభాగముత్స న్నమగుటంజేసి పీఠికవృత్తాంతములు తెలియకున్నవి. అంతైన విశేష ములు వ్రాసియుండలేదు. కాళిందీపరిణయమొకటి (పద్యకావ్యము) ౧౮౯౯ సం॥రం (శ్రీ) రా. బ పనప్పాకం అనంతాచార్యులవారివలన వైజయంతీపత్రికయందుఁ బ్రచురింపబడినది దీని కవి యెవరైనది తెలియదు.

ఈతఁడు పిదప రాజాశ్రయమున మైపోలు, నారాయణ పురమునను నగ్రహారములు సంపాదించినట్లు తెలియవచ్చుచున్నది. ఇందు నారాయణపురము వినుకొండతాలూకా గోకనకొండ సమీప మున గుండ్లకమ్మ యొడ్డుననుండి యేటిపోటునకుఁగొట్టుకొనిపోయెనని చెప్పుదురు. ఈజాడ లిప్పటికిని గనుపట్టుచున్నవి. ఈరెండుగ్రామము లనుగూర్చి యీకవి వ్రాసినదనెడి రెండుపద్యములనిందు దాహరించు చున్నాను. ఇవి వాడుకవలనఁ జెడి నిర్దుష్టములుగ లేకున్నవి.

సీ. శ్రీమించుఁ దూర్పున సిరులకుఁబట్టైన
కులిశాయుధునివీడు గొల్లపాడు
ఆగ్నేయదిశయందు నఖిలవేదాంతార్థ
మహిమకు నిలయము మైలవరము
దక్షిణదిశయందుఁ దనరారుచున్నట్టి
జమ్ములమడక సౌజన్యనడక
నైఋతిపార్శ్వాన నరులకద్భుతపట్ల
పురుహూతుని మెట్ట పూరిమెట్ల
రాజిల్లుకొండల రాయుని పాలెంబు
భూజనాళికిఁగల్పభూరుహంబు
వాయవ్యదిశయందువబులు గోకనకొండ
నిరతార్థిజనులకు సిరులునిండ
ఉత్తరదిశయందు నున్నతస్థితి గాంచు
నాగులవరము భూనాకపురము
ఈశాన్యదిశయందు భాసిల్లు కీర్తి చేఁ
గవికల్పవల్లి కూళల్లపల్లి

గీ. అష్టపుర మంతరస్థాయియైన
శాశ్వతైశ్వర్యముఁలకును సదనమైన
ప్రబలనారాయణపురఁబు పాలకడలి
పట్టిమెడనున్న నవరత్నపతక మనఁగ

సీ. జానకీపతి లేఁతసజ్జరొట్టెలపాలు
కొంపల కప్పెల్ల గొడ్లపాలు
సంవాసములు దొంగ జాగిలంబుల పాలు
నయనముల్ జాగరణంబు పాలు
గట్టిపాత్రపుతాళ్లు కట్టెమోపులపాలు
మృదువైన (మొవ్వంపు) చేతులు మండ్ల పాలు

భూరిసంధ్యానిధుల్ బురదనీళులపాలు
నాలుక దీనోక్తి జాలిపాలు

తే. ఘనతరస్నేహమది తుచ్ఛజనము పాలు
చిత్త మేవేళ నతిదీర్ఘ చింతపాలు
హారిహారీ! దేహ మంతయు నలతపాలు
మైదవోలున నుండుట మాకు(జాలు.

ఈయన అభినవనన్నయభట్టారక బిరుదువహించి

క. గట్టిగ నభినవనన్నయ
భట్టాచార్యాభిధాన పటుబిరుదాంకం
బిట్టట్టనక వహించిన
దిట్టను నను(బోలగల సుధీవరు లేరీ ?

అని చదువుచుండెడివాడట. ఈతడు గోకనకొండ గుహయందు( దాను తపస్సుచేసినచోట నృసింహాలయము(గట్టించి ప్రతిష్ఠించెను ఇది యిప్పటికిని గలదు.

ఈకవి కాలమును నిర్ణయించుటకు నాధారము లెంతయత్నించినను, లభింపవయ్యె కాని యీతని కుమారుడు రామభద్రిప్పశాస్త్రులుగారు శా. శ ౧౬౭౦ శుక్ల నామ సంవత్సర శ్రావణ శు॥ ౧౫ లున శ్రీ రాజామలాద్రిజు రామారాయణింగారివలన వినుకొండ తాలూకా ముమ్మిడివరము నగ్రహారముగ(బొందెను. ఇందునుబట్టి అహోబల పండితు(డును రమారమి ౨౦౦ యేండ్ల క్రిందటివాడని చెప్పనగును. ఈకవివంశస్థు లిప్పటికిని ముమ్మిడివరము నగ్రహారముగ ననుభవించుచున్నారు. ఈ వంశమువారు ముమ్మిడివరము నర్సారావుపేట తాలూకా కోణిదెనమజరామన్లాయపాలెము, సంతరావూరు గ్రామము లందు(గలరు. ఈక్రింద( జూపినరీతిని యీకవి వంశస్థులు పండితులయి స్వామికృపచే దినదినాభివృద్ధినొందుచున్నారు.

అహోబలపండితుఁడు

|

రామభద్రప్పశాస్త్రి

|

రామచంద్రశాస్త్రి

|

నరసింహశాస్త్రి

|

చిన్నపిచ్చయ్యశాస్త్రి

|

సుబ్రహ్మణ్యం

|

సాంబయ్య



## 406 ఆత్రేయపురపు తమ్మయ్య

ఈకవి "గొల్లవేషకథ", "సముద్రమథనము" అను రెండు వీధి నాటకములను రచియించెను. ఈనాటకము లిప్పుడు ప్రదర్శింపఁబడుట లేదు కాని నలువది సంవత్సరములకుఁబూర్వమీ నాటకములు పల్లెటూళ్లలోఁ దఱచుగాఁ బ్రదర్శింపఁబడుచుండెడివి. ఈనాటకములలో వేశ్యాస్త్రీలు "గొల్లస్త్రీ" పాత్రమును "సత్యభామ" పాత్రమును గైకొని సంగీతసాహిత్యాభినయములఁ గనుపఱచుచు మనోహరముగా ప్రదర్శించుచుండెడివారు

ఈతమ్మయకవి గోదావరి మండలములోని కొత్తపేట తాలూకాయందలి ఆత్రేయపురము వాస్తవ్యుఁడయినట్లు "ఆత్రేయపురి గోపాలుని" నుతించియుండుటచేఁ దెలియుచున్నది. మడికి, వెదురు మూడి మొదలగు గ్రామములలో ఆత్రేయపురపువారున్నారు వారు నియోగిబ్రాహ్మణులు. భరద్వాజసగోత్రులు. మడికి సింగన వీరి పూర్వుఁడనియందురు ఇతఁడురచించిన గొల్లవేషకథ గ్రంథాంతమున "ఇది యేడిదభాగవతము" అనివ్రాయబడియున్నది. యేడిద, మండ పేట గ్రామములు రెండును సరిహద్దుగ్రామములు. ఈ రెండుగ్రామములయందును వేశ్యలు పలువురిప్పుడును నున్నారు. వీరు తఱచుగా వీధినాటకములను బ్రదర్శించుచుండెడివారు. ఈగ్రంథముయొక్క యొకప్రత్యంతమున "దుగ్గిరాల రంగసానికూఁతురు శ్యామలాంబ తాడిపర్తి చలమయ్యయొద్ద నీగ్రంథము చదివి పార్థివసంవత్సర పుష్య బహుళైకాదశి శుక్రవారమునాటికి ముగించి" నట్లున్నది. వేఱొక ప్రతియందు "విరోధినామసంవత్సర జ్యేష్ఠబహుళ షష్ఠీ సోమవారము నాటికి జదువబడిన" దని వ్రాయఁబడియున్నది. ఈతిథి వారములను బట్టిచూడఁగా నీకవి క్రీ. శ. ౧౭౬౯కు పూర్వుఁడని తేలినది. ఏడిద మండపేట గ్రామములు రెండును గోదావరిమండలములోనివి. ఇచ్చట 'దుగ్గిరాల' గృహనామముగల వేశ్యలిప్పుడును గలరు.

గొల్లవనిత బ్రాహ్మణులవీధికి 'చల్ల' అమ్మటకై వచ్చుటయు, విదూషకప్రాయుఁడగు నొకబ్రాహ్మణుఁ డామె కులమునుగూర్చియు, చల్లయొక్క శ్రేష్ఠత్వమును గూర్చియు ప్రశ్నించుటయు, నామె ప్రత్యుత్తరము లిచ్చుట మొదలుగాగలకథ యిందు వర్ణింపఁ బడు చుండును.

గొల్లలలోఁగల జాతులు, వారి యాచారములు యీక్రింది ద్విపదలలో వర్ణింపఁబడినది.

ద్వి :- మొదలెజ్జగొల్లలు మష్టిగొల్లలును
పెదవీటిగొల్లలు పెయ్యగొల్లలును
కోటికోటులు మందగొల్లలు పాక
నాటిగొల్లలును పూనాటిగొల్లలును
అలిగంపగొల్లలు నాలగొల్లలును
ఇలపూడి సజ్జ గాడీజాతులైన
గొల్లల పంద్రెండుకులములలోన
కొల్లగా మే మెజ్జగొల్లలమయ్య
రాజు లెల్లను మెచ్చ రాణింతు మయ్య
మాజాతి కొక్క నీమం బున్న దయ్య
రవిఁ జూచియును ద్రొక్క రా దదిగాక
రవికయు దొడగఁగ రా దెప్పుడైన
చుక్క బొట్టెపు డుంచుట లేదు నుదుట
ముక్కుకు వగమీఁ ముక్కు లేదు
పల్లెరు గమ్మ లేర్పడఁ బెట్టరాదు
అడ్డగట్టును లేదు ఆడుగుజ్జమును
ఎడ్లలమై యెద్దునెక్కఁగరాదు
పరికింప హనుమంతబసవశంకరము
సరససింహతలాట జయనామములును
బిరుదులు గలవయ్య పేర్వేరమాకు
వరుసతో నీరీతి వర్తింతుమయ్య.

సీ. సకలామయ సంహారచక్రివి
స్తరపరాక్రమము యింతక్రగుణము
శుభ్రాభ్ర హిమశశిస్ఫురిత తేజఃపుంజ
కౌముదీసంపూర్ణ కాంతిపరము
ఘనపారిజాత వికస్వర పుష్పాగ్రి
ఘుమఘుమపరిమళఘూర్ణితంబు
జీవనాధార సంజీవనద్రివ్యాప
ధక్రియ దేహసుందరరసంబు

షడ్రిసోపేతమగు వస్తుసాగరంబు
బహుసుధాసార రుచికరపానకంబు
నయిన యీచల్ల యిది దేవతార్పితంబు
అనుభవింపుఁడు జనులు మీ కగును శుభము.

ఆ ఉదయకాలమందు నొకముని కోపాన
శాపదగ్ధుఁడైన జాడదేక
సారిది ప్రొద్దుపొడుపు సూర్యునిఁ గనుఁగొని
మ్రొక్కు వేయరాదె ముద్దుగుమ్మ.

తే. పాలలోపల శశి పుట్టెఁ బాలలోనఁ
బంకజారాతి పుట్టె కల్పద్రుమంబు
పుట్టె సుధపుట్టెఁ గాప్రొద్దు ప్రొద్దు లేచి
వినవె పాల్కడవకు మ్రొక్కు వేయవమ్మ.

తే. ముజ్జగంబులు బొజ్జలోఁ గలిగియున్న
యిజ్జగము లేలుచున్నట్టి యీశ్వరుండు
యదుకులంబున జన్మించి నందుచేత
జగతిపైనున్న జనులెల్ల గొల్లలధిప

క. గొల్లలు ధర్మగుణజ్ఞులు
గొల్లలు పుణ్యాత్ములవని గోపాలకులున్
గొల్లలె యెక్కువధీరులు
గొల్లలకును సాటి యెవరు కోరి నుతింపన్.

ఈకవి తననుగూర్చి యీక్రింది పద్యమును వ్రాసికొని యున్నాడు

క. జనులార! సరసవిద్వ
జ్జనులారా! సమస్తసభలఁ జాతురి మెఱయన్
వినరయ్య గొల్లకథ గాఁ
దనరెడు నాత్రేయపుర పుతమ్మయకవితన్.

## 407 దశరధరామకవి

ఇతఁడు విశాఖపట్టణమందలి రామతీర్థమున వెలసియున్న శ్రీరామచంద్రస్తుత్యాత్మకముగ 'సీతాపతీ' యను మకుటముతో, మత్తేభ శార్దూలవృత్తములలో సీతాపతీశతకమును రచించెను. ఈ శతకమును రచియించినందులకు మెచ్చి కుమందాను, దాట్ల వెంకట మహీపాలుఁడు నూటపదహారువరహాలను, రెండుశాలువులను బహుమతి యిచ్చెనఁట! ఈవిషయము లీక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చు చున్నవి

మ. ఒక శార్దూలము నొక్క మత్తయిభము న్వేరొక శార్దూల మొ
క్కొక మత్తేభముగాఁగ లివరుస నే నూహింతు నేర్పొప్పఁ దా
పక నామాంకితభవ్యపద్యశత ముత్పాదింతు నీక్షించు మా
మక వాఙ్మపుణి రామతీర్థగిరిధామా! రామ! సీతాపతీ!

శా. నీరేజాసనజంభభిన్ముఖసురానీకంబు పౌలస్త్యదు
ర్వారోదారపరాక్రమంబు వినిపింపన్ వచ్చు వేళన్ బయః
పారావారమునన్ భుజంగవరతల్పంబందు నిద్రించు ని
న్నారాధించెద రామతీర్థగిరిగేహా! రామ! సీతాపతీ!

శా. దానస్తోత్రములన్ భవత్పదయుగధ్యానంబులన్ స్వామికా
ర్యానూనస్పృహ నీడులేక మను దాట్లాఖ్యాన్వయోద్యత్తమం
దానీభాగ్యచిరాయురుజ్జ్వలల నొందన్ నీకృపాపాంగదృ
ష్టానుం జేయుము రామతీర్థవాసా! రామ! సీతాపతీ!

మ. శర మొప్పారఁగ నీమహాశతకమున్ గావించు నాసత్కవీ
శ్వరు దాట్లాన్వయజాతవేంకటమహీపాలుండు నూటాపదా
ర్వరహా ల్జోడగుశాల్వలిచ్చి సుయశోవర్ధిష్ణుఁడై సద్బహూ
కరణంబుం దగఁజేసె నాఘనుని చాగం బేమనన్ భూగతా
మరభూజంబన రామతీర్థగిరిధామా! రామ! సీతాపతీ!

ఈగ్రంథ మొనర్చిన కాలమును గవి యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. దశరథరామనామకవి దాట్లకులోద్భవు వేంకటావనీం
ద్రశశికి నిష్టవేల్పయి నిరంతరరక్ష యొనర్చు రామతీ
ర్థశరణుఁగూర్చి నేర్చిన విధంబున జెప్పె జయోర్జమాసిపృ
త్త్వశతక మద్రిగోరస సుధాకర శాకసమాఘుసంగతిన్.

ఇందలి శకసంఖ్య ౧౭౮౬ అని దొరతనమువారు ప్రకటించిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార గ్రంథముల పట్టికలో నున్నది కాని యదిపొరపాటు ఆసంవత్సరము 'జయ' కాలేదు. ఈశక సంఖ్య ౧౬౭౭ అని తోఁచుచున్నది. ఆసంవత్సరము జయ అయినది. అట్లయినచో నది క్రీ. శ. ౧౭౫౫ అగును.

ఈకవి కులగోత్రాదు లేమియుఁ దెలియవు. విశాఖపట్టణ మండల వాస్తవ్యుఁడనుట నిశ్చయము. రామగిరి ప్రాంతమువాఁడై యుండును.

## 408 లింగకవి

ఇతఁడు లక్ష్మణ ప్రాణరక్షణమను నొకయక్షగానమును రచియించెను. హనుమంతుఁడు సంజీవనిఁ దెచ్చి లక్ష్మణుని బ్రతికించిన కథ యిందు వర్ణింపఁబడినది. ఈ క్రింది ద్విపదలలోఁ దాను ప్రోలనార్యుని కుమారుఁడనని మాత్రము చెప్పుకున్నాఁడు.

ద్వి. అనిశకృపారసమూర్తి యఖిలసమర్థ
వినుతపావనజగద్విఖ్యాతు పేర
అంకితంబుగఁ బరమానందు పేర
......శహంతుఁడగు ప్రోలనార్యతనూజ.
సురుచిర బుధజనస్తుతలింగధీర
విరచితశృంగారపటురీతిఁదనరు.

ఈకవినిగూర్చి యింతకంటె నేమియుఁ దెలియుటలేదు. గ్రంథము శిధిలావస్థలోనున్నందున యీతనికాల, కుల, గోత్రాదులను దెలిసికొనుట కనువుపడినది కాదు పదునెనిమిదవ శతాబ్దివాఁడనియే తలంపవచ్చును.

ఈ యక్షగానమును పవని గ్రామమందున్న గోపాలస్వామి కంకితము చేసియున్నాఁడు.

వ. అని కృతీశ్వరుండగు పవనిగోపాలస్వామి నేమనికీర్తింపుచున్నాఁడు.

జంపె :- నరసురార్చనలోల ! నక్తంచరాభీల !
పరహితార్థసుశీల ! పవనిగోపాల !

ఈకవి పవని గ్రామమువాఁడై యుండును. ఈకవి పద్యకవిత్వమునందు సమర్థుఁడు కాఁడు. ద్విపదకవిత్వమైనను అంతరసవంతముగా లేదు



# 409 కొట్ట వేంకటేశ్వరకవి

ఇతఁడు తెలగాణ్యశాఖఁజెందినవైదిక బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; సోమనార్యపుత్త్రుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు.

ఈకవి విమలాంగీపరిణయమను పద్యకావ్యమును రచియించి తనయిష్టదైవమగు శ్రీవెంకటేశ్వరున కంకితము చేసెను. ఈగ్రంథము ముద్రితముకాలేదు. రెండాశ్వాసములుగల యొక యముద్రితప్రతి R. 564వ గ్రంథముగా మదరాసుప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము నందున్నది. దీనిమాతృక బొబ్బిలివాస్తవ్యులగు సీతారామశాస్త్రులు గారియొద్ద నున్నదఁట. మాంధాతచక్రవర్తికిని, గుంతలదేశాధీశుని తనయయగు విమలాంగికిని జరిగిన పరిణయగాథ యిందు వర్ణితమైనది. ఈతని కవితనుగూర్చి కవివ్రాసికొనిన యీక్రిందిపద్యమువలన నీతఁడు మనోహరమైనకవిత చెప్పఁగలవాఁడని తెలియుచున్నది.

గీ. ప్రతిపదప్రసిద్ధార్థగౌరవముఁ బాక
 రీతివృత్తి చమత్కారజాతివార్త
 లలరఁ దోఁచిన గతిఁ గూర్చి యలర మాధ
 వునకు నిచ్చెద వేంకటేశునకుఁగృతిని.

ఈక్రింది గద్యవలన నీతని యిష్టదైవము శ్రీ వెంకటేశ్వరుఁ డయినట్లును, ఇతడు బాలకవి బిరుదమును గలిగి యున్నట్లును దెలియ వచ్చుచున్నది.

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ కవిత్వ వైభవ కొట్టవంశాబ్ధిచంద్ర బాలకవిబిరుద సోమనార్యతనూజ కౌశికగోత్ర పవిత్ర సుజనవిధేయ వేంకటేశ్వరనామధేయ ప్రణీతంబైన విమలాంగీ పరిణయంబను ప్రబంధము.

ఈకవినిగూర్చిన యీక్రింది వాక్యములు, "విస్మృతకళింగాంధ్ర కవులు" అనుగ్రంథమునుండి గైకొనుచున్నాఁడను. "ఈకవి నివాస స్థలము విశాఖపట్టణమండలంలో రాజామునకు దగ్గఱగానున్న యిల్లంనాయుడువలస. ఈగ్రామము కొట్రవారికి శ్రీ బొబ్బిలి పురాధీశులు అగ్రహారముగ దయచేసినందున బాలకవికిఁ బూర్వమును దరువాతను గూడ నీవంశజులచ్చటనే కాపురముండియున్నారు. బాలకవి బాల్యము విద్యాభ్యాసము మొదలగువానిని గూర్చిన సమాచారమేమియుఁ దెలియరాకున్నది. కొట్రవారి వంశము పండితవంశమైన కారణముచేత నీతఁడు తాతతండ్రులయొద్ద విద్యాభ్యాస మొనర్చెనని మనమూహింపవచ్చును. ఈతని బిరుదనామమగు "బాలకవి" అను దానినిబట్టి యీతఁడు పిన్ననాఁడే సరసమగు కవిత్వము చెప్పఁగలవాఁడై పెద్దలచే మెప్పు వడసినవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. ఇతఁడు పెద్దవాఁడై ప్రౌఢకవియైన పిదపగూడ బాలకవి నామము వీనిని విడువకుండెను.

బాలకవి కాలమును సులభముగా నిర్ణయింపవచ్చును. ఇతఁడు సుప్రసిద్ధాంధ్ర కవిశేఖరుఁడగు నడిదము సూరకవి సమకాలీనుఁడు, మిత్రుఁడునైయుండెను. ఈక్రింది రెండుపద్యములును వీఁదివిషయములకు సాక్ష్యమగుచున్నవి.

బా ల క వి :—

క. అంతా కవులమె గామా!
అంతింతో పద్యమైన నల్లగలేమా!
దంతివి నీతో సమమా?
కాంతాసుమబాణ! సూరకవి! సరజాణా!

సూ ర క వి :—

శా. భద్రాజు న్నిరసించి సత్కృతులు చెప్పం బూనుచో మేటియై
చద్రాతింబలె నున్నవానికిని నిచ్చల్ దెబ్బఁ బుట్టించునే
కుట్రల్ సేయని సత్యసంధుఁడవి లోకు ల్మెచ్చ వర్తించు నీ
కొట్రా బాలకవీందు శేఖరుఁడు మాకుం బూజ్యుఁ డెల్లపుడున్.

సూరకవి క్రీ శ. ౧౭౨౦ ప్రాంతమున జనన మొంది ౧౭౮౦ సంవత్సర ప్రాంతమునఁ గీర్తి శేషుఁడయ్యెను. సూరకవి కంటె వయస్సునఁ జిన్నవాఁడగు బాలకవి ౧౭౩౦ - ౧౭౬౦ మధ్యకాలమునందుండి యుండవచ్చును.

బాలకవి పిత్రార్జితమగు భూవసతివలన వచ్చునాదాయముచేత జీవనము గడవక కాఁబోలు కవితావృత్తిచే దేశాటనముగూడఁ జేయుచుఁ గాలక్షేపము చేయుచుండెడివాఁడు కొలఁదిమందిశిష్యులను వెంటఁబెట్టుకొని, పర్యటనము సల్పుచుండెడివాఁడనియు, శిష్టుఁడై స్వయంపాకము చేసికొని భుజించునియమము గలవాఁడనియు మన మీక్రింది పద్యమువలనఁ దెలిసికొనవచ్చును.

ఉ. చేకొని యాచకత్వమునఁ జేసి సమస్త దిగంత రాళికిన్
బోకయు రాకదీరదది బుద్ధికిఁ గల్గిన మోసమై స్వయం
పాకపునిష్ఠయుంచుఁ బ్రతిబంధక మొక్కటి దెచ్చికొంటి నే
నాఁకటికోర్వ వంటకసమర్థుఁడ శిష్యులు కూడిరారు తా
జాకలమానుఁ గాని కొనసాగదు చందము దోఁచ దీశ్వరా!

ఇతఁడు తన దేశాటనములో నాశుకవిత్వ ప్రదర్శన సామర్థ్యముచేఁ బొందిన విజయముఁ గూర్చిన సమాచార మొకదానిని లోకమిట్లు నుడువుచున్నది. పాలకొండదరి వీరఘట్టమను గ్రామమునకు వర్షాశన నిమిత్త మొకప్పుడు బాలకవి వెళ్లియుండెను. అక్కడ "పర్వతాలు" అనుపేరుగల కోమటికవి యొకడుండెను. అతఁడు తనశక్తిని నెదుటివానిశక్తిని నెఱుఁగనివాఁడై తనకాలపుఁ బ్రసిద్ధ కవీశ్వరులనుగూడ ధిక్కరించుచుండెడువాఁడు. అమాయకుఁడును వేషాడంబరములులేని శుద్ధశ్రోత్రియుఁడును నగు బాలకవి పండితమ్మన్య వైశ్యకవి ధిక్కరింపులకు లోనై యుండెను. గ్రామములోనివారు

కొందఱు పర్వతాలుపక్షమునను గొందఱు బాలకవి పక్షముననుండి యీకవీశ్వరద్వయమునకుఁ గవిత్వప్రదర్శనమునఁ బోటీపరీక్షఁ బెట్టిరి. దైవయోగముచే నానాఁటికి బాలకవిమిత్రుఁడగు సూరకవి యాగ్రామమునకు రాఁ దటస్థించెను. అంతనాకోమటికవి బాలకవిని జయించుటకన్న సూరకవిని జయించుటయే తనకు నధికప్రఖ్యాతి తేగలదను నుద్దేశముతో నాబ్రాహ్మణకవులిద్దరు తనకుఁ బ్రతికక్షులై యుండుట తనకోరికయని సభ్యులతో నుడువ వారందుల కంగీకరించిరి. గ్రామములోని పెద్దల సమక్షమునఁ గవిత్వ ప్రదర్శన మారంభమాయెను. కృష్ణార్జునులవలె సూరకవి, బాలకవిగార్లు తమ కవితాసామర్థ్యము వెల్లివిరియునట్లుగా నూఱులకొలదిఁ బద్యములు సెప్పి సభ్యులకు మోదంబును, బ్రతికక్షికి ఖేదంబును గలిగించిరి. పాపము! పర్వతాలు కించిత్తైనను, ఆకవీశ్వరద్వయముతో సాటి కాఁజాలక సభ్యుల పరిహాసమునకుఁ బాత్రుఁడై సంపూర్ణముగ నపజయమొందెను. ఈకవితా యుద్ధమును గూర్చిన సూరకవి చాటుపద్యము నిట నుదాహరించుచున్నాఁడను.

ఆ. వె. నరుని నొగలమీఁద హరియున్న చందాన
సూరకవి వరేణ్యు జోగఁగూడు
కొట్రబాలకవి యకుంఠ వాగ్ధాటికిఁ
బర్వతాలు గడు పారిపోయె

ఈకవికి మామిడితాండ్రయనఁ జాలఁ బ్రీతియఁట! అందుచే వ్యయప్రయాసములను సరకుగొనక మంచిమామిడిపండ్లను సేకరించి తాండ్రపోయించి, యింటి యంగడములో నాతాండ్రపోసిన చదరల నెండబెట్టఁ గాకులు దానిని జకాచకలు చేసి కవివరునకుఁ గోపమును ఖేదమును గలిగించుచుండెను. అంత నీతఁడు పలుగాకులకు నీయేకాక్షులను నిర్జింప సాధనము గానక తనకవితయే శరణమనుకొని వానిపైఁ బద్యబాణములఁ బ్రయోగించుచుండువాఁడట! ఆశ్చ

ర్యము! ఆపద్యములు చెప్పిననాఁటనుండియుఁ గాకులు కొట్టువారి యింటికి వాకిటఁ జేరుటమానుకొనెనఁట! ఇటులనే యెలుకలరాయిడి భరింపనోపక యెలుకలపైఁ బద్యములు సెప్పి యాబాధ నివారణచేసికొనెనఁట. ఆపద్యముల నిటఁబొందుపఱచుచున్నాఁడను.

ఉ. నీ కుటిలత్వము న్విడువ నేరవు, తిట్టెదఁ దాండ్రఁ గైకొనన్
 రావు; పరాకుచేసియును రావు; వివేకముఁ దెచ్చుకొమ్ము; నా
 వాకులు తప్ప వారయ ధ్రువంబుగ నమ్ము మనంబులోన యో
 కాకమ! నీకుఁ దెల్పెదఁ జికాకొనరింపకు నేఁ గవీంద్రుఁడన్.

చ. ఎలుకలు పందికొక్కులును నేపున గోడల గాదెమూలలన్
 కలుఁగులు వెట్టి లోఁగొనియెఁ గందులు నువ్వులుఁ
 గాయగూరలున్
 బొలయఁగఁ దిట్టెదన్ బయికిఁ బోవక నిల్చిన జాములోపలన్
 బలుకులు గావు బాలకవివాక్కులు కర్కశబాణజాలముల్.

మీఁదనుడివిన గాకమూషక బాధానివారణవృత్తాంతము విశ్రంభపాత్రమైనను గాకున్నను బద్యరచనా సమాచారము మిథ్యకానేరదు. కానేరదుకదా! ఇట్టిశక్తిసామర్థ్యములను గలిగి ప్రసిద్ధిగాంచిన కవివరు లనేకులు మనకుఁ గృతపరిచయులే. కాబట్టి, ఈకవివరుని కవితాప్రజ్ఞ యమోఘమై యుండిన నుండవచ్చును.

బాలకవి కొన్నిశతకములును ప్రబంధములును జెప్పెనని ప్రజలమగు వాడుక కలదు. కాని యవియేవియు నిప్పుడు గానరాకున్నవి. ఇతని కృతులలో నెల్ల 'భల్లాణచరిత్రము' అను ప్రబంధము మిక్కిలి యెన్నికయైనదని చెప్పుదురు గాని యదినామమాత్రావశిష్టమైనదిగా నున్నది. కవివంశజులుకూడ నీతని కృతులనుగూర్చి తగిన సమాచారము నీయలేనివారై యుంట యెంతయు శోచనీయము.

... ... ...

బాలకవికి నుభయభాషలయందుఁ జక్కని పాండిత్యము కలదు లక్షణ విరుద్ధములగు ప్రయోగములు విరళముగాఁ గనఁబడుచున్నను మొత్తముమీఁద నీతని కవిత్వము మృదుమధురమై కర్ణరసాయనముగా నున్నదని చెప్పవచ్చును. చిన్ననాటనుండియుఁ గవిత్వముఁ జెప్పు సామర్థ్యము గలవాఁడగుటచే ధారాశుద్ధి చక్కగనున్నది ౧౮ వ శతాబ్దమున వెలువడిన పెక్కుప్రబంధములతో నీతని విమలాంగీ పరిణయ మన్నివిధములఁ దులఁదూఁగుచున్నదని చెప్పవచ్చును కవితా ధోరణి దెలియుటకు గొన్ని పద్యముల క్రిందనుదాహరించుచున్నాఁడను.

క. సుందర ఘృణి చందిరమణి
కంధరమణి నిలయజాతకాంతిలతా న
త్కందర్పకీబృందకరీ
టుక్కఁదమరీచిత్రభాసికుధరం బెక్కెన్.

ఉ. బొమ్మలుదీర్చినట్లొలయు బొమ్మల గ్రీవుల మూపులం బుజా
తమ్ముల వీగనొత్తు స్ఫురితమ్ములచేఁ దలమించు కన్నులం
గమ్ము నిరాకరించు రుచిరమ్మిన కమ్మని మేలు జాలువా
నమ్మక చెల్ల! వీనిసాబఁ గమ్మక రాంకున కైననున్న దే!

ఉ. అంత ననంత కాంత విపినాంతర తాంతలతాంతసంతతా
క్రాంత జనంతతంతశశికాంత నిరంతరరుజ్జ్వితాంత వి
భ్రాంత మిళింద కాంత కలరావని శాంత నితాంత వాసనా
క్రాంతనికుంజపుంజనర కాంతము పొల్చె వసంత మంతటన్.



# 410 నెల్లూరి శివరామకవి

కవిచరిత్రకారు లెవ్వరు నీతని చరిత్రమును వ్రాసియుండలేదు. ఈతఁడు పాకనాటి నియోగి బ్రాహ్మణుఁడు. కాశ్యప గోత్రుఁడు. ఇతఁడు 'కామకళానిధి' యను గ్రంథమును రచించి జయసింహమండలేంద్రునకుఁ గృతి యొసంగెను. కృతిపతి తననుగూర్చి నుడివిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

చ॥ హితుఁడవు పాకనాట నుతికెక్కిన నెల్లురివంశజాతుఁ డీ
వతులిత సాహితీపటిమ యాదవరాఘవ పాండవీయమన్
గృతిగల వీరరాఘవ కవీంద్రసుతుండవు కొద్దివాఁడవే
తతమతి సంస్కృతాంధ్రకవితానిరతా! శివరామసత్కవీ!

క॥ హితమతిఁ బండితపామర
మతమై పురుషార్థమై సమంచితమౌ నా
తత కామకళానిధిఁ గృపఁ
జతురత రచియింపవలయు సరసులు మెచ్చన్.

కవితండ్రియగు వీరరాఘవుఁడు యాదవరాఘవపాండవీయమను త్ర్యర్థి కావ్యమును రచించిన మహాకవి. ఆతనిగూర్చిన విశేషములాకవి చారిత్రమునఁ జదువనగును. శివరామకవి తనగ్రంథమును ఛత్రపతి శివాజీ సవతిసోదరుఁడైన ఏకోజీమనుమఁడగు జయసింహమహారాజునకుఁ గృతియొసంగెను. కృతిపతి సూర్యవంశపు క్షత్రియుఁడై నట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

కం॥ అతఁ డఖిలలోకధర్మ
స్థితికై సంజ్ఞాఖ్యయైన చెలియందుఁ గనెన్
సుతునతఁడు సువర్ణసుకీ
ర్తితుఁడై సూర్యాన్వవాయ దీపకుఁడయ్యెన్.

కం॥ ఆ యిక్ష్వాకు కులంబున
శ్రీయుతులు దిలీపరఘుహరిశ్చంద్రకకుత్
స్థాయుస్సగర భగీరథు
లాయతమతు లుదయమంది రతులప్రౌఢిన్.

గీ॥ వారి కులమునఁగలిగె నవార్యబలుఁడు
భోసలాభిధధాత్రీప్రభుండతండు
హితమతి మహారటదేశంబునేలుచును య
శంబు దిక్కుల నించె భాస్కరవిభూతి.

గీ॥ అతని పేరిట నాభాస్కరాన్వయంబు
భోసలకులంబనఁగను పొగడు గనియె.
నతనికిఁ బురోహితుఁడు గాధిసుతుఁడు గాన
ధాత్రినతనికిఁ గౌశికగోత్ర మమరు.

... ... ...

కం॥ ఆరాణ్మోమరులయందు ను
దారయశోమహిమ వెలయ నాహవవిజయా
ధారుఁడగు హరిశ్చంద్ర ధ
రారమణుఁడు సూర్యవంశరత్నమ్మనఁగన్.

కం॥ ఆయన కనుజుఁడు సుజన వి
ధేయుఁడు జనవినుతనామధేయుఁడు శ్రీరా
ధేయుఁడు దానకళా రా
ధేయుఁడు జయసింహ రాజధీరుఁడు వెలయున్.

కృతిపతికి వృద్ధప్రపితామహుఁడైన మాలోజిని, ప్రపితామహుఁడైన శాహాజీని కవి వర్ణించియున్నాఁడు.

శా॥ ఆ శాహక్షితిపాలకుండు నిజబాహాజాగ్రదుగ్రాసి ధా
రాశీర్ణప్రతిపక్షభూమిభృదురఃప్రాలిప్తగోరోచనా

శ్రీశోణప్రచురప్రతాపరుచియై శిష్టావళీరక్షకుం
డై శాసించె ధరాతలంబు నయవిద్యాపారగుల్ మెచ్చఁగన్.

గీ॥ తనదుభుజశక్తియును శౌర్యధైర్యమహిమ
గాంచి ఢిల్లీశ్వరుఁడు సంతసించి చెల్మి
నాప్తుఁడై మహారాజ విఖ్యాతి నొసఁగ
స్థిరతరవిభూతిచేతఁ బ్రసిద్ధిగనియె.

మాలోజీ, శాహజీలను కవి చక్రవర్తులని వర్ణించినను, వీరు గొప్ప భూపతులుగారనియు, శాహజీ అయిదువేల మనసబుదారనియు చరిత్రకారులు వ్రాసియున్నారు. శాహజీకి మహారాజ విఖ్యాతి నొసంగిన ఢిల్లీశ్వరుఁడు ఔరంగజేబు పాదుపా (?) యైయుండును.

ఆ శాహజీకి జిజాబాయి, తులజాబాయి అను నిద్ద్వరు భార్యలు. వారిలో జిజాబాయియందు శివాజి, శరభోజి అను నిద్దరుకుమారులను తులజాంబికయందు ఏకోజీయను కుమారుఁడును గలిగిరి. ఈ శివాజీయే మహమ్మదీయప్రభువుల జయించి ఢిల్లీశ్వరునికి ప్రక్కలోనిబల్లెమై మహారాష్ట్ర రాజ్యమును స్థాపించి ఛత్రపతియైన ప్రతిభాశాలి. శివరామకవి శివాజీనిట్లు వర్ణించియున్నాఁడు.

మ॥ అతఁడుద్వేల భుజాబలాఢ్యుఁడు తురుష్కాధీశుఁడౌ పాదుపా
నతి శౌర్యాప్తిఁ దృణీకరించి బహుదేశాధ్యక్షులంగూర్చి సం
తతధాటీగతి హస్తిపట్టణముపై దండెత్తి పోరాడి ని
ర్జిత ఢిల్లీశసమాఖ్యఁజెందె నృపతిశ్రేణుల్ ప్రశంసింపఁగన్.

... ... ...

ఎవ్వఁడేకాతపత్రమై యెసఁగ ధరణి
నేలుచును ఛత్రపతియన మెప్పుగాంచె
నతఁడు విలసిల్లు సకలవిద్యావివేక
భాస్కరుండు శివాజిభూపాలకుండు.

శివాజితమ్ముఁడైన ఏకోజీ కృతిపతికి పితామహుఁడు. ఈతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడై దక్షిణదేశమును జయించి మహారాష్ట్ర రాజ్యమును స్థాపించిని వీరాగ్రేసరుఁడని యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ॥ పారసీకారట్ట బాహ్లికాజానేయ ఘోట్టాణదట్టముల్ గొలిచినడువ
దండెత్తి నర్మదా దక్షిణావనిసీమఁగల భూపతులనెల్లఁ గలఁచివైచి
చేరి కర్ణాటక క్షితి బెంగళూరిలో నిలచి వింధ్యాచల తలమునందు
నతుల పంచద్రావిడాధీశ జయకృతాక్షర పంక్తితో స్తంభమునిచి

మఱియు మైసూరి బలముచే మగ్నుఁడైన
పాండ్యరాజును రక్షించి ప్రబలుఁడగుచు
చోళరాజ్యంబుఁ గైకొని యేలుచుండె
రమ్యగుణశాలి యేకభూపాలమాళి.

ఇందుఁ బేర్కొన్న మైసూరి బలమనఁగా టిప్పు? హైదరాలీ! ఎవరు పాఁడ్యరాజెవరు! ఇవి నిర్ధారింపబడవలసియున్నవి.

ఏకోజీకి ముగ్గురు భార్యలు. అందు దీపాంబవలన శహాజీ, శరభోజీ, తులజరాజు అను ముగ్గురు తనయులు జన్మించిరి. ఏకోజీ జీవించియుండగనే శహాజీ రాజ్యభారమును వహించినట్లీక్రింది పద్యము వలనఁ గన్పట్టుచున్నది.

క॥ అతని యనుమతిచే ధర
ణీతలభరమున్ భజించి నృపనయ విద్యా
చాతురి రామవిభుండన
ఖ్యాతిం గనె శాహనృపతి ఘనతరమతియై.

శహాజీకి తరువాత క్రమముగా శరభోజియును కృతిపతి తండ్రియగు తులజీయు రాజ్యాధికారమును వహించినది.

Tanjore was taken under the administration of the Company on the 26th November 1799 on the occasion of the installation of Sarbhoji, a son of the late Raja.

The native ruler of Tanjore, Raja Sahaji being deposed, appealed to the English to reinstate him. 1744 A. D. As a reward of on the reinstatement to surrender to the Company the fort and lands around Devikota. The English failed in their efforts to restore Sahaji still they determind to have their reward etc.

Page 80, British India.

కృతిపతి తండ్రియగు తులజరాజును, కృతిపతిని కవి యీక్రింది పద్యములలో వర్ణించియున్నాడు.

సీ॥ స్మృతినివహోదిత శీలరక్షితధర్మ మాధారభూతలముగాఁగ
నిజభుజోద్భవ సమున్నిద్రప్రతాపంబు కనకాలవాలమై గరిమఁజెంద
రమణీయ దానధారాప్రవాహంబులు సతతాభిషేకార్ధజలముగాఁగ
గృతివరవారజేగీయమాన గుణాళి ప్రబలతమంబైన ప్రాకుగాఁగ.
గరిమగాంచినయట్టి సంకల్పలతిక
మించిత్రిభువనముల నాక్రమించియుండ
ధరణివర్ధిల్లు నాచంద్రతారకముగ
నీశ్వరవిభుఁడు తుళజమహీవిభుండు.

సీ॥ సుందరాకృతియైన సుందరాబాయియు
మాన్యయా రాజకుమారబాయి
శుభతరచారిత్ర సుకుమారబాయియు
బాలయా మోహనబాయిదేవి
రమణీయశీలయా రామకుమారాంబ
లలితలక్షణయగు లక్ష్మీబాయి
అనుపమతరభాగ్యయైన రాధాదేవి
సతియుమాబాయిదా సద్గుణనిధి

వీరలైనమంత్రుఁడు యాదవవిభుని యష్ట
మహిషుల విధాన దనునతి మహిమగొల్వ
విబుధజనములపాలిటి వేల్పనంగ
జగతివర్ధిల్లు దులజరాజన్యవిభుఁడు

సీ॥ అల సుందరాబాయియందు సద్గుణనిధి
జనపాలమణి హరిశ్చంద్ర విభుని
ధర్మైకవసతి రాధాబాయి యందు నృ
సింహవిక్రము జయసింహ విభుని
రమణీయచరితయౌ రాజకుమారాంబ
యందు నేకోజి ధరాధినాథు
వరరూపయగు సుమాబాయియందు
గుణాఢ్యుఁడైన ప్రతాపసింగావనీంద్రు
గాంచి నాల్గుభుజమ్ముల ఘనతగాంచు
శ్రీమహావిష్ణుకైవడిఁ జెలఁగు నతఁడు
సేతుపతి గర్వహరణప్రసిద్ధకీర్తి
చారుతరమూర్తి తులజరాట్చక్రవర్తి.

సీ॥ పాండ్యకేరళరాజభామినీకచహార
కల్హారములకాంతి గాయపరచి
కరహాటకుటిలాట కర్ణాటకామినీ
కుంకుమరేఖల సుంకమడిగి
ప్రవిడకరూళవిదర్భమంత్రాంగనా
వీటికారుచులకు వెరపుఁజూపి
కుంతల నిషధాంధ్రకాంతాకుచద్వయీ
గోరోచనాచ్ఛవి మారుపరచి
తనదు తీవ్రప్రతాపముద్యద్విభూతి
సకలజగముల నెరసి నిశ్చలముగాఁగఁ

సత్యభాషావిజిత హరిశ్చంద్రుఁడగుచు
జగతిఁ బర్థిల్లు శ్రీహరిశ్చంద్ర నృపతి.

సీ॥ ఆ విక్రమార్కాదులైన నీతనిసరి
గానేర్తురా? పరాక్రమము బల్మి
నాథనాథీశాదులైన నీతనితోడ
జోడౌదురా! ధనస్ఫురణ కలిమి
నా యంగరాజాదులైన నీతనిసాటి
పూనెదరా? దానపూర్తి నెలమి
నా కాళిదాసాదులైన నీతనికీనయౌ
దురా! కవనమహత్వ మెలమి
ననుచు విబుధులుగొనియాడ నలరునౌర!
భోసలాన్వయవారిధి పూర్ణచంద్రు
డైన రాజకుమారాంబికా సుతుండు
యేకరాజన్యఘనుఁడు వివేకధనుఁడు.

చ॥ అనయము నన్నదమ్ములు మదావహలీలలఁ గూఁడియుండఁగా
జనకులు ముద్దుముద్దుగ ప్రసన్నత నెప్పుడు గారవింపఁగాఁ
దనయులు బౌత్రులుం జెలులు దారతఁగొల్వఁ జిరాయురున్నతుల్
గని ధరవర్ధిలన్ సుఖముగా జయసింహ నృపాలుఁడెప్పుడున్.

కవికాలము నిర్ణయమునకై మనము కష్టపడనక్కరయుండదు. ఛత్రపతి శివాజి క్రీ.శ. 1626 న జన్మించి క్రీ.శ. 1674 సం॥న ఛత్రపతియై క్రీ.శ. 1681 లో నస్తమించెనని చెప్పుచున్నవి. అతని కుమారుఁడు ఏకోజీకూడా తంజావూరునందు క్రీ.శ. 1676-1683 వరకును, అతని కుమారుడు శాహాజీ క్రీ.శ. 1684-1710 వరకును, అతని తమ్ముఁడు శరభోజీ క్రీ.శ. 1711-1728 వరకును, అతని తమ్ముడు తులజరాజు క్రీ.శ. 1729-35 వరకును రాజ్యమేలినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. అందువలన కవి యీగ్రంథమును తులజాజీ జీవించి

యుండగనే రచియించియుండినందున క్రీ. శ. 1730-35 లమధ్య యుండెననుట స్పష్టముగా చెప్పవచ్చును.

కామకళానిధిలోని విషయము కామశాస్త్రసంబంధి. నాయికా నాయకుల జాతిలక్షణములు, వారల సత్త్వములు, ప్రకృతులు, ప్రవర్తనములు, దంతక్షత నఖక్షత భేదములు, బంధములు, బాధ భేదములు మొదలుగాఁగల కామపురుషార్థముతో సంబంధించిన విషయములను పద్యరూపమున కవి మృదుశైలిలో లిఖించియున్నాఁడు. భోగైకలాలసులను మహారాజులిట్టి గ్రంథములను రచియింపఁ గవులను బ్రోత్సహించుచుండిరి. ఇట్టిది పాఠకుల కుపయోగముండదు సరికదా గర్హనీయమని కొందరందురేమోయను భయముచేఁగాబోలు కవి తన కృత్యము నిట్లు సమర్థించుకొన్నాఁడు

"అట్టి మదనదేవతాధిష్ఠితంబగు తృతీయపురుషార్థంబు పరలోక సాధనంబగు ధర్మశాస్త్రంబుకన్న నిహలోకసాధకంబగు కామశాస్త్రంబు మతిమంతులగువారికి మోక్షసాధకంబగునది యెట్టులనిన; "ధర్మావిరుద్ధోలోకేస్మిన్ కామోఽస్మి భరతర్షభ" యను భగవద్వచన ప్రామాణ్యంబున ధర్మార్థంబుల ననుసరించిన కామంబు కామత్వంబు నొసంగు. స్వకాంతామాత్రకృత కామకళావిశేషంబులఁ బుత్రసంతతి గల్గుటంజేసి పరలోకసాధకంబగు గార్హస్థ్యధర్మంబున సౌఖ్యావహంబగుట."



# 411 పూసపాటి వేంకటపతి మహీపాలుఁడు

" ఈ రాజకవి శ్రీ పూసపాటి మహారాజవంశమునకుఁ జెందిన వాఁడు. క్రీ. శ. ౧౭౧౯ సంవత్సరమున నిప్పటి విజయనగరము నిర్మింప బడకమున్ను శ్రీ పూసపాటి మహారాజులు కుంభిళాపుర రాజ్యమునకుఁ బరిపాలకులుగా నుండెడివారు ఇప్పుడు విజయనగరమునకుఁ తూర్పుగా సుమారు ౮ మైళ్లదూరములోనున్న "కుమిలి" యను గ్రామమే నాఁటికాలమునఁ గుంభిళాపుర నామముతో రాజధానీనగరమై యుండె నని పూసపాటి రాజులకుఁగల పూర్వబిరుదములలోని "స్థలకుంభిళాపుర నికేతనుండును", అను దానివలనఁ దెలియవచ్చుచున్నది.

క్రీ. శ. ౧౭౫౭ సంవత్సరమున బొబ్బిలియుద్ధములో వీరస్వర్గము గాంచిన విజయరామగజపతిమహారాజున కీ వేంకటపతి మహీపాలుఁడు పెదతండ్రి. ఈయన తమ్ముఁడును విజయరామరాజు తండ్రియునగు, ఆనందగజపతిమహారాజు బాలుఁడై యున్న కాలమున నీ వేంకటనృపాలుఁడే రాజ్యభారమును వహించి తమ్మునికిగాఁ బరిపాలన మొనర్చుచుండెను. విజయనగరమునకుఁ బడమరగా గోస్తనీ తీరముననున్న "కొత్తాము" అను గ్రామము శా. శ. ౧౬౩౭ సంవత్సరమున (క్రీ. శ. ౧౭౧౫) గొన్ని బ్రాహ్మణకుటుంబములకు వేంకటపతిరాజపురమను పేరితో నీయనచే నగ్రహారముగా నీయబడియెను. ఆదానశాసనమిట నుదాహరింపఁబడినది.

"శ్రీరస్తు శాకేస్మిన్ ఋషిరామశాస్త్ర శశభృత్సంఖ్యాయుతే
మన్మథేవర్షే మాధవమాసి భానుజయుతే రాకాదినాబ్జగ్రహే
సింహాద్రిస్వవిధేరఘూత్తమముదే కొత్తాము సంజ్ఞంపురమ్
విప్రేభ్యః ప్రదదౌస వేంకటవిభుః శ్రీ పూసపాట్యన్వయః ॥
శ్రీమాన్ వేంకటభూపతిః శ్రితనిధిః శ్రీ పూసపాట్యన్వయః

స్మార్తేభ్యో నిఖిలార్థ విద్భ్య ఉరుధీః శ్రీ వైష్ణవేభ్యోదదా
చత్వారింశతమంశ మూర్జితతమం కొర్లాము సంజ్ఞంపురం
కృత్వా వేంకటరాజపట్టణమితి ప్రఖ్యాతముర్వ్యాం సదా ''

స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౬౩౭ అగు నేటి శ్రీ మన్మథనామ సంవత్సర వైశాఖ శు ౧౫ స్థిరవారమునందు ౧ శ్రీ వొడ్డె జగ్గుభట్లుగారు ౨ సోమయాజుల వేంకటావధానులు ౩ కర్రి రామభట్లు ౪ కర్రి విశ్వేశ్వరభట్లు మొదలయిన బ్రాహ్మణులకు శ్రీ మన్మహామండలేశ్వర మహీమండలరాయ మన్యసుల్తాన్ శ్రీ పూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వ్రాయించియిచ్చిన అగ్రహారపు ధర్మశాసనపట్టా :- మా మొఖాసాసమతు పొట్నూరు సీమ తాలూకు కొర్లాం అనే గ్రామములోను యిరవైవక్క వృత్తి నిర్ణయంచేసియిస్తిమి గనుక యిందుకు ౧ వొడ్డె జగ్గుభట్లు ౨ సోమయాజుల వెంకటావధానులు ౩ కర్రి రామాభట్టు ౪ కర్రా విశ్వేశ్వరభట్టు ౫ బులుసు జగ్గువఝులు ౬ యనమంద్ర విజ్జంభట్టు ౭ పూరికంటి వేంకటభట్టు ౮ వేదుల యజ్ఞంభట్టు ౯ ఆతీ నరసంభట్టు ౧౦ పిట్టల రామాభట్టు ౧౧ కాశీసోల్లి బుర్రిభట్టు ౧౨ శ్రీ నారాయణభట్టుకు ౨ కి ౧౨ దేవరకొండ నారాయణభట్టు ౧౩ యర్రగుంట్ల సూరుభట్టు ౧౪ పిట్టల చినరామభట్టు ౧౫ అయిస్సోల చేనులు ౧౬ గంటి సోమయాజులు ౧౭ వేదుల సీతారాముఁడు ౧౮ అవధానుల రామాభట్టు ౧౯ ఇంద్రకంటి లింగంభట్టు ౨౦ భాస్కరభట్ల అప్పలిభట్టు ౨౧ వేదుల విస్సంభట్టు, యీచొప్పున మర్యాదచేసి వేంకటపతిరాజపురం పేరుపెట్టి శ్రీ సీతారామార్పణముగాను వాపీకూప తటాకారామనిధినిక్షేప ప్రజాసహితంగాయిస్తిమి గనుక ఆగ్రామం విరివిగా ఫలపరుచుకుని అందుల ఫలసాయం మీపుత్రపౌత్ర పారంపర్యాయం అనుభవిస్తూ సుఖానవుండేది.

ఏకైకభగినీలోకే సర్వేషామపిభూభుజాం
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా ।

స్వదత్తా దుహితాచైవ పితృదత్తాచ సోదరీ
అన్యదత్తాచ మాతాస్యా ద్విపరిదత్తా వసుంధరా ।
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ .. వేం.

వేల్పూరి స్థాపయ వ్రా_స్తే పొట్నూరు షరాబు కొమ్మోరాజు గురవన్న కుమారుండ శివన్న చెక్కిన దానపట్టా.

N.B :- ఈపరికారముగానే వేటూరి దానశాసనము ౧౯ వృత్తు లేర్పఱచి శ్రీ అలఘురు తిరుమల గొడవర్తి శ్రీ వేంకటపతిఅయ్యంగార్లుం గారు మొదలగు వైష్ణవులకుఁగూడ నిదే కాలమున నిచ్చియున్నారు.

దాన శాసనకాలమునుబట్టిచూడఁగా నీవేంకటపతిరాజకవి కాలము క్రీ శ. ౧౬౬౦ - ౧౭౨౦ మధ్యకాలముగాఁగనబడుచున్నది. ఈయన అన్నమన్నృపాలుని పౌత్రుడు; కృష్ణమరాజు పుత్రుడు. తల్లి కేసమాంబ. వీరినిఁగూర్చి యితఁడు తన ప్రబంధమగు "ఉషా పరిణయము" లోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాడు.

సీ॥ లయకాలకీలికీలాభీల్లమాలిక
మించి శాత్రవుల భంజించువేళ
స్థిరసాంద్రచంద్రికా పరిపూర్ణ చంద్రుఁడై
లీల భూజనులఁ భావించు వేళ
దశశతవదన ప్రధానభోగీంద్రుఁడై
లలితకళాప్రౌఢి దెలుపు వేళ
బహుపళ సుమ ఫలభరితమందారమై
యొనర నరులకోర్కెలొసఁగు వేళ

గీ॥ నీకఁడనిసర్వజనులు సంప్రీతిఁగొల్వ
నలరుచుండెను బూసపాట్యాన్వయాబ్ధి
చంద్రుఁడగు కృష్ణరాజేంద్రచక్రవర్తి
నందనుండన్న భూపపురందరుండు.

గీ॥ అమ్మహీపతిపరిణయం బయ్యె వేడ్క-
దసర నీపూరివేంగళేంద్రునిసుపుత్రి
నమితకళ్యాణకవితవిఖ్యాతమహిత
విమలసద్గుణనికురుంబ ! వేంగళాంబ !

గీ॥ ఆ వధూమణియందు నెయ్యంబుతోడ
నన్నభూపతిగాంచె విఖ్యాతులైన
సుతులనిరువుర నత్యంత శుభగమతులఁ
గృష్ణభూపాలు గోపాలకృష్ణవిభుని

సీ॥ శ్రుతిపదరహితుఁడై యతిభుక్తిను జగ
ద్ప్రాణు భక్షించిన వానిఁదెగడి
శిరములఁ గుంభముల్ ధరియించు వారలఁ
దరలక నిల్పు దిక్కరులఁ గెడచి
సానుల శిఖరసంచయముల నెవ్వేళ
మమతఁ గైకొను గోత్రసమితి రోసి
ఒకయచలాధిపుండు కణఁకఁ దనుంట
వెన్నుజూపిన కూర్మవిభుని మాని
చారువిజ్ఞాను నాశ్రితజననిధాను
నన్యకాంతాస్యవిముఖు సౌజన్యసుముఖు
వీరకృష్ణమహీపాలుఁజేరె నౌర !
ధీరగంభీరమతిని ధాత్రీపురంధ్రి.

గీ॥ గొట్టెముక్కలవంశాబ్ధికువలయాప్తుఁ
డనగఁజెన్నొందు బంగారు జనవరేణ్యు
తనయ యైనట్టి కేసమాంబను వరించె
మజ్జనకుడైన కృష్ణనృపాలవిభుండు.

సీ॥ తనతండ్రి యెపుడప్పులను భంగమును జెందఁ
గనులక్ష్మి యేపాటి కలిమిపాలఁతి

తనపుత్రికుం డపుత్రికునిగాఁ గనునట్టి
గంగ యేపుణ్యసంకల్పవతియొ
తనపతి బహుళార్తి నెనయ గనుంగొను
రోహిణియే యనిరుద్ధచరిత
తనసుతు పెండ్లి సేయను నేరక మెలంగు
పర్వతాత్మజ యేశుభప్రదాత్రి

గీ॥ యనఁగ విలసిల్లెఁ బతిహితాయత్త యగుచు
పూసపాట్యన్వ మేదినీభుజుని కృష్ణ
రాయవిభురాణి మాధుర్య రమ్యవాణి
కీర్తిసద్గుణనికురుంబ ! కేసమాంబ !

రాజ్యభారమును వహించుట కర్హుఁడగిన వయస్సు తనతమ్ముఁడగు సానందరాజునకు వచ్చినంతనే యీ వేంకటనృపాలుఁడు రాజ్యపాలనాదికము నాతనికిచ్చివేసి తాను గావించిన యగ్రహారమునఁ బ్రత్యహము విప్రులయింటనే భోజనముఁ జేయుచుఁ బారమార్థికచింతకలవాఁడై పండితగోష్ఠిచేఁ దనజీవితశేషంబును నొక రాజఋషివలెఁ గడపెనని వినుచున్నాము.

ఈమహారాజు రాజకీయవ్యవహారములయందెంత దక్షుఁడో కవిత్వము మొదలగు లలితకళలయం దంతసమర్థుడు. తన పూర్వులగు రాచిరాజు (నవభారతకృతికర్త) తమ్మిరాజు (శ్రీకృష్ణవిజయ గ్రంథకర్త) లవలెఁ గవితావిషయమునఁ దానుఁగూడ విఖ్యాతినొందవలెనను కోర్కెతో "ఉషాభ్యుదయ" మను నొకశృంగార రసప్రబంధమును రచియించి తమరాజధానీనగరమున కనతిదూరములో శ్రీరామతీర్థక్షేత్రమున వేంచేసియున్న శ్రీరామచంద్రున కద్దానిని కృతియొసంగెను

ఈయుషాభ్యుదయము ౫ ఆశ్వాసముల ప్రబంధము ఇందలి కథ హరివంశము నందును భాగవతము నందును వర్ణింపఁబడిన, ఉషా

నిరుద్ధుల వివాహోత్సవమునే యాధారముగాఁజేసికొని యీప్రబంధమును రచించినాఁడు.

ఈవెంకటరాజకవి చక్కని కవిత్వముఁజెప్పఁగలవాఁడేయైనను, శ్లేషయందు మిక్కిలి మక్కువకలవాఁడగుటచే సరళమగు కవితాప్రవాహము హృదయావర్జకముగాఁ బ్రవహింపక తద్రచనకుఁగొంత లోపము కలిగించుచున్నదని చెప్పవలసివచ్చినది. పండితకవి సమాజముచేఁ బ్రబంధరాజముగా నాదరింపఁబడు వసుచరిత్రయొక్క కవితావిధానమునే తనకు నాదర్శముగాఁజేసికొనిన వాఁడగుటచే నిందులోని పద్యములు పెక్కులు వసుచరిత్రలోని పద్యముల ననుకరించుచున్నవి. మొత్తముమీఁద నీతనికవిత్వము సంస్కృతపదభూయిష్ఠమై యలంకారశోభితమై నిరర్గళ ధారకలదియై కర్ణరసాయనముగనున్నది. కవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిపైదుష్యముకలదని యీప్రబంధమునందలి పద్యములే మనకుఁ బ్రబలనిదర్శనములు. కవితాధోరణి తెలియుటకుఁగాఁగొన్ని పద్యములిచటఁ బొందుపఱచుచున్నాఁడను.

క. కాంతాంసహితపల్లవ
సంతతభావనములలరు సమధికలీలన్
గాంతారసహిత పల్లవ
సంతతభావనములందు సమధికమగుచున్

చ. అచటి యనంతరత్నమయహర్మ్యములొప్ప నిశాంత మెంతయున్
బ్రచురతఁ దాన నంతసుఖపద్ధతి చూడఁ బురాంగనల్ సదా
రుచిఁ గని మిత్రుఁ డంచునవరోధము సేయరుగాక జాలక
ప్రచరుఁ డదెందుఁబోఁగలఁడు పట్టెద మందురు సౌదసీమలన్.

చ. అరయ రథాంగవిభ్రమముగాఁగ బిరుందులు గబ్బిచన్గవల్
కరువలివారువంబులును గన్నులు సార్థములై సహాయతన్
బరఁగుట నేమొ గాక లలనామణు లేక్రియ నెక్క నోపువా
రరుణతురంగ ఘర్మసలిలాదృతసాలము కేలిశైలమున్

సీ. సౌందర్యగగనవిస్ఫారమాధారమై
నవవయః పవనసంతతిని దాల్చె
నవవయః పవనసంతతి పెల్లుగొని పొంగి
విరహానలార్చుల వెలయఁబూనె
విరహానలార్చు లబ్బురముగా వెలుగొంది
కనుఁగొలఁకుల నీరు కలుగఁజేసెఁ
గనుఁగొలఁకుల నీరు గబ్బిమై పొడగట్టి
కుచధరాభ్యుదయసంగోష్ఠి మనియెఁ

గీ. కుచధరాతస్థలంబునఁ గోమలికిని
వికలచింతాలతల్ సంభవించెఁ బెలుచఁ
బంచశర పరబ్రహ్మప్రపంచమునను
తద్వ్యగుణవృత్తితో నవస్థలు చెలంగ.

క. అథవా కాకునినాదము
సథవాగీతస్వనంబు సముదితపరదే
శథవావిలాపమామ
న్మథవీణకుఁ ద్రివిధతానమానము లెసఁగన్.

గీ. జన్మమమృతాబ్ధి నమృతంబు చక్కదనము
పదవిశంకరమౌళి యాబాల్యవసతి
యిన్ని గల్గి యనాథల నేచెదేల ?
కులము రూపంబు కొలఁది సద్గుణము వలదె ?



# 412 ఏకమహారాజు



ఇతఁడు తంజావూరు రాజ్యమును క్రీ శ 1735వ సంవత్సరము మొదలు 1740వ సంవత్సరమువఱకును బరిపాలించిన మహారాష్ట్ర ప్రభువు. ఇతనికి బావాసాహేబు అను వాడుక పేరు కలదు. ఇతని తండ్రి తులజమహారాజు. ఇతనిని తుక్కోజీయందురు ఈకవితల్లి రాజకుమారి; మొదటిఏకోజీమహారాజునకును దీపాంబకును బౌత్త్రుఁడు; ఇతనికి శాహాజీ శరభోజి అనువారలు పెదతండ్రులు. శాహాజీమహారాజు ప్రపితామహుఁడు

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రకటించిన తంజావూరునందలి లిఖితపుస్తకభాండాగార పట్టికయందీకవి క్రీ.శ. 1676 మొదలు 1683 వరకు రాజ్యముచేసినవాఁడని వ్రాయబడినది. కాని యది పొరబాటు. ఆకాలమున రాజ్యముచేసిన యాతఁడీతఁడుకాఁడు. అతఁడు ఛత్రపతి శివాజీమహారాజునకు సవతిసోదరుఁడు.

ఈకవి మొదటి తుళజమహారాజుకుమారుఁడు ఇతఁడు రామాయణమును ద్విపదకావ్యముగా రచియించెను. మఱియు విఘ్నేశ్వర కల్యాణమను యక్షగానమును చేసెను. ఈ రెండు గ్రంథములలోను కూడ తనవంశమును వర్ణించియున్నాఁడు. రామాయణమునందలి ద్విపదలలోని వర్ణనమిట్లున్నది.

> శ్రీగణనాథు నాశ్రితపారిజాతు
> బాగుగా నుతియించి వాక్సిద్ధి కిపుడు
> శ్రీశారదాదేవిచిత్తాంబుజమున
> భాసిల్లఁ బ్రార్థించి భక్తితోడుతను
> వాసవప్రముఖగీర్వాణవందితుని
> భోసలాన్వయరాజపూజితపదుని

ఫాలనేత్రుని భక్తపాలుని చంద్ర
మౌళీశ్వరుని దయామానసుఁ దలఁచి
ధరణి రామాయణోద్యానసంచార
వరకోకిలంబైన వాల్మీకిఁ దలఁచి
వ్యాసశుకాదుల వర్ణించి కాళి
దాసాదికవులకుఁ దగఁ గేలుమోడ్చి
కులదైవతమ్ముల కొనియాడి మదిని
పొలుపొందు సత్కవిబుధులసమ్మతిని
భోసలకులశాబ్ధిపూర్ణచంద్రుండు
భాసురమాళోజిపార్థివసుతుఁడు
సాహసాంకుఁడు నిత్యసత్యసంధుండు
శాహభూపాలుండు చతురమానసుఁడు
అతని తనూజుఁ డీకావనీపాలుఁ
డతనిబాలకుఁడు శాహక్షితిపాలుఁ
డతనిసోదరుఁడు మహాకీర్తిశాలి
చతురుఁడు శరభరాజన్యదేవేంద్రుం
డారాజసోదరుం డతులవిక్రముఁడు
ధీరుఁడు నయశాలి దీపాంబసుతుఁడు
చోళభూపాలుండు సుగుణాకరుండు
పాలితసుజనుండు పరమపావనుఁడు
పనువడి తుళజభూపాలుఁ డారాజ
తనూజాతు డేకధరణిపాలకుఁడు.

ఇతఁడు వాల్మీకిరామాయణమునంతను సరిగా ద్విపదలో వ్రాయ లేదు. అందలికథను గైకొని సంక్షేపించి యించుమించుగ రెండువేల ద్విపదలలో రామాయణమును రచించెను. ఇది ముద్రితముకాలేదు. కాని సమగ్రమైన తాళపత్రప్రతియొకటి తంజాపుర ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్నది. పైన వ్రాసిన ద్విపదలనుబట్టి యీకవి

తండ్రి తుళజమహారాజని తెలియుచున్నది. ఈకవి వంశవృక్షమును శాహామహారాజు కవిచారిత్రమున నిచ్చియున్నాఁడను. ఏక తండ్రియైన తుళజమహారాజున కెనమండ్రుభార్యలు. అందు రెండవభార్యయైన రాజకుమారబాయికీకవికుమారుఁడు. నెల్లూరి శివరామకవిచేఁ గామకళానిధియను గ్రంథమును గృతినందిన జయసింహామహారాజీకవికి సవతిసోదరుఁడు. కామకళానిధియందు శివరామకవి యీ ఏకమహారాజు నీక్రిందిపద్యములోఁ గొనియాడియున్నాఁడు.

క. ఈనరపతి కనుజుఁడు వి
ద్యానిధి యేకోజిరాజు ధరఁ జెలువొందెన్
నానావిధవైభవస
న్మానితుఁడై దానదేవమణియై గుణియై

సీ. ఆవిక్రమార్కాదులైన నీతనిసరి
గానేర్తురా పరాక్రమము బల్మి
నాధనాధీశాదులైన నీతనితోడ
జోడౌదురా ధనస్ఫురణ కలిమి
నాయంగరాజాదులైన నీతనిసాటి
పూనెదరా దానపూర్తి నెలమి
నాకాళిదాసాదులైన నీతని కెన
యౌదురా కవనమహత్త్వ మెలమి
ననుచు విబుధులు గొనియాడ నలరు నౌర
భోసలామ్నాయవారిధిపూర్ణచంద్రుఁ
డైన రాజకుమారాంబికాగ్రసుతుఁడు
నేకరాజన్యఘనుఁడు వివేకధనుఁడు.

## 413 కద్రకవి

ఇతఁడు "దాసూజగన్నాయకా" అను మకుటముతో శ్రీ జగన్నాథస్వామివారిపై ౧౦౦ మత్తేభ శార్దూలవృత్తములుగల శతకమును రచియించెను. ఈ క్రింది పద్యములో కర్త పేరున్నది. తండ్రి సింహాద్రి.

మ. ఘనతల్లీశుభనామకీర్తన లపేక్షం జేయు మీభృత్యుఁడన్
అనఘుం డామహనీయుఁ డన్న వెగ రార్యస్తోత్రపాత్రుండ స
జ్జనమాన్యుండ నృసింహసేవకుఁడ సౌజన్యుండ సింహాద్రినం
దనుఁడన్ గద్రకవీంద్రనాముఁడ నే దాసూజగన్నాయకా!

ఈకవినిగురించి యింకనేమియుఁ దెలియదు. గ్రంథాంతమున ప్రతివిలేఖకుఁడు "జయనామసంవత్సరం భాద్రపద శు ౯ బుధవారం వరకు, నడగోట నరహరి, కంచరకుంట్ల వెంకటనర్సుప్రతిలో ఉన్న క్రిమానజగన్నాథశతకము ౧౦౦ పద్యాలు సంపూర్ణంగా వ్రాసెను" అని వ్రాసికొనియున్నాఁడు. క్రీ. శ. ౧౮౯౪ వ సంవత్సరములో వచ్చిన యాతిథి శనివారమును ౧౮౩౪ సంవత్సరములో వచ్చిన యాతిథి గురువారమునైనవి. ౧౭౭౪వ సంవత్సరములో వచ్చిన తిథి బుధవారమయి యుండును. కావున నీకవి యంతకుఁ బూర్వుఁడు ఎట్లయినను పదునెనిమిదిశతాబ్ది ప్రథమార్ధములోనివానినిగా దలంప వచ్చును.



ఈకవి పద్మనాయకకులజుఁడు; ఇతఁడు లీలాశుకయోగి రచించిన శ్రీకృష్ణకర్ణామృతమును మూఁడు కందపద్యశతకములుగా రచియించెను. ఇతఁ డీగ్రంథమును రచియించెదనని కవుల నడుగఁగా వారీతనివంశమును వర్ణించినట్లును, ఈతఁడు పరాంకుశయతీంద్రుని శిష్యుఁడైనట్లును, ఈక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. విను దయ లీలాశుకకృత
ఘనకర్ణామృతము తెనుఁగుగా గందములన్
వినుతింపఁ దలఁచి ప్రణామము
లనువుగ నొనరించికవులనడిగ వారల్

క. విను మశేషుసింగరిదయన్
మనయు పరాంకుశయతీంద్రశిష్యుఁడవై
పెనుపొందు నీకుఁ జిత్రమె
వినుపింతుము నీదువంశవిధ మేర్పడఁగన్

క. వెలయ విను పద్మనాయక
కులమణి ధరణిపతిరావుగురువారాయం
డలరుచు వరించెఁ బోయిన
పలివెంకటవిభుతనూప్రభవఁ గృష్ణమ్మన్

క. వారిసుతులందు లింగన
వీరుఁడు చంద్రమ్మయందు వేంకటపతి భూ
దారుఁ గని రెండవసుతు
మారుఁడు మాదన్న బుచ్చమను పెండ్లాడెన్.

క. ఆ మేనమామసుత యెడ
దా మోహరభక్తుఁ జంద్రధార్మికుఁ గనె నా

ధీమంతుఁడు మేనరికపుఁ
గోమలి నప్పాంబ సాధుగుణనికురుంబన్.

క. పరియించి కాంచె నిన్నున్
బురుషోత్తమవేణుకృష్ణమూర్తి నుతింపన్
సిరులిచ్చు నుడువుమని నేఁ
బరితోషముతోడ నిట్లు పకిలితి వినవే.

ఈకవి యేమండలమువాఁడో తెలియలేదు. ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమున "శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౫౯ అగునట్టి గాను ఏవం ప్రవర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ఈశ్వరసంవత్సర మార్గశిర శు ౧౧ భృగువారంవరకు ముంగర నరసన్న తనస్వధాతు వ్రాసుకున్నది" అనివ్రాసియున్నది. కవి యింతకుఁ బూర్వుఁడు. కావున పదునేనిమిదవ శతాబ్దివాఁడని తలంపవచ్చును.



## 415 ఆలపాటి పెద్దు

ఇతఁడు కుమ్మరకులజుఁడు; వైద్దాప్పపాపాంబలపుత్త్రుఁడు; పెద్దన లింగమాంబలపౌత్త్రుఁడు; శివజ్ఞానస్వామిశిష్యుఁడు. ఇతఁడు భల్లాణచరిత్రమును, యక్షగానముగా రచించి బిల్వేశ్వరున కంకితము చేసెను. ఈతనికిఁ గోకిలాంబయిష్టదేవత. ఈక్రింది ద్విపదలలో నీతనివృత్తాంతమును జెప్పుకొనియున్నాఁడు.

"అని సూతముని మానులకుఁ బల్కె ననుచు
విని కోకిలాంబికా విభుశంభుపేర
గనకబిల్వార్చితకామేశుపేర
ననుఁ బ్రోచు నావైద్యనాథునిపేర

బరగు నలంకారభావమీచరిత
వెలువొప్ప వ్రాసిన వినినఁ జదివిన
నీశుఁ డిచ్చును జాల నీప్సితార్థములు
వాసిఁ బుత్రులు పౌత్రవరులు సంపదలు
పొందుదురని తనబుద్ధిఁ జింతించి
ముందుగా సద్గురుమూర్తియైనట్టి
సంతోషశివజ్ఞానస్వామిని మదిని
సంతతముఁ దలంచు సద్భక్తిపరుఁడు
అంగలి గాంగశివాచారధరుఁడు
జంగమతీర్థప్రసాదసేవకుఁడు
శాలివాహనవంశచరితుఁ డీభువిని
ఆలపాకనూర నమరిన పెద్దు
పెద్దనలింగమాంబికసుతుం డయిన
వైద్దెప్పపాపాంబవరపుత్రు పెద్దు
లలితమై తనరు భల్లాణునిచరిత
వెలయునాటకముగా వినిపించి దీని
సుకవులెల్లను విని పొంపొంది ధరను
ప్రకటింపుఁడాచంద్రతారకముగను

కోకిలాంబ యీతని కులదేవతయైనట్లును, విశ్వేశ్వరునకీకృతి నంకితము చేసినట్లును, ఈక్రిందికృత్యాది ద్విపదలవలనఁ దెలియుచున్నది.

శ్రీపార్వతీశు దర్శించి సేవించి
నాపాలి శ్రీగణనాథుఁ బూజించి
శరజన్ముఁ బ్రార్థించి సద్భక్తి గాంచి
వరదుఁడౌ మాధవు వర్ణించి మించి
భారతి నర్పించి పరఁగ గీర్తించి
యీరూఢి సత్కవులను నుతియించి

కులదేవతయిన యాకోకిలాంబకును
వలనొప్ప మ్రొక్కి యావరము గైకొనియు
బరవసంబుగఁ బూని భావంబులోన
బరగంగ నాబిల్వపతి కంకితముగ
సరసమౌ భల్లాణచరితనాటకము
వెలయఁ దత్కళావిధ మెట్టిదనిన

ఈకవి నివాసము ఆలపాక యైనట్లీపైన చెప్పిన ద్విపదలలో నున్నది. ఆలపాక విశాఖపట్టణమండలములోనిది.

ఈకవి కాలము తెలియుటకీక్రింది ప్రతివిలేఖకుని వ్రాతలు గొంతవఱ కాధారమగుచున్నవి:

౧ విరోధినామసంవత్సర ఆశ్వీజ శు ౧౦ ఆదివారం ఈభల్లాణనాటకం పుదుచేరిలో మాజేటి సర్వేశలింగం వ్రాసుకొనెను. క్రీ. శ ౧౮౨౯ లో వచ్చిన ఆశ్వీజ శు ౧౦ గురువారమైనది. ౧౮౮౯ లో వచ్చిన యానాఁడు శుక్రవారమైనది కావున నీ తేదీ క్రీ శ. ౧౭౬౯ లో వచ్చిన ఆశ్వీజ ౧౦ యై యుండవలయును.

౨ "ధాతునామసం॥ కార్తికె నెల ౨౧ తేదీ బుధవారం పర్వకాలం గ్రహణం పుణ్యకాలం ఉదయమైన పన్నెండుఘడియల నరమీఁద పుదుచేరిలో ప్రాంసుక్కోటి చేసినది". ఇది క్రీ. శ. ౧౮౧౯ సం॥ డిశంబరు ౮ వ తేదీ బుధవారమయినది. ఆనాఁడు చంద్రగ్రహణ మున్నది

దీనినిబట్టి కవి పదునెనిమిదవ శతాబ్దివాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇతని కవిత్వము సరసముగనే యున్నది. శైలి తెలియుటకై మఱికొన్ని ద్విపదల నుదాహరించెదను:

"భల్లాణ మెచ్చితిభళిర నీవలెను
నిల్లాలి నిటులిచ్చు నెవ్వరీ భువిని

అని మదిఁ గొదవగా నభిమానపడకు
మనఘాత్మ మాతల్లి యీచల్లమయ్యను
నీకును గులసతి నేను మీసుతుఁడ
మీకు నేఁక మోక్ష మిచ్చితే లెస్స
అయిన మీభక్తి నేనరసితి నిపుడు
జనము న్గైకొఁటివీ జగతిలో నీవు
ఆలోకమున బ్రిమభాదులలోన
మేలు నీవని పట్టమిచ్చితి నిదిగో
సతు లిద్దఱుకు నీవు సరి విమానముల
చతురత నెక్కించి చేరిరమ్మనుచు.



## 416 రుద్రరాజు తిరుమలరాజు

ఈతఁడు క్షత్రియుఁడు; ధనంజయగోత్రుఁడు; కూనన్నపాలపుత్రుఁడు. నిరోష్ఠ్యనలరాజచరిత్రమను నైదాశ్వాసముల ప్రబంధమున కీతఁడు కర్తయైనట్లీక్రిందిగద్యవలనఁ దెలియుచున్నది.

గద్య: "ఇది శ్రీమదంతర్వేది లక్ష్మీనృసింహస్వామిచరణారవిందైక శరణరుద్రరాజాన్వయాభరణ ధనంజయగోత్ర పవిత్ర కూనన్నపాలపుత్ర నిరర్గళ కవితావిలాస సంతోషితానేక విద్వత్కవిరాజ తిరుమలరాజ ప్రణీతంబైన నలరాజచరిత్రంబను నిరోష్ఠ్యప్రబంధరాజంబు".

ఈగ్రంథ మింకను ముద్రింపఁబడలేదు. మదరాసు ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమునందు రెండు ప్రతులున్నవి. మఱియొక ప్రతిని నేను చూచినాఁడను. ఈకావ్యకన్య తిరుమలరాజునకు దత్తపుత్రిక యనియు, నీమెకుఁ గ్రొత్తలంక మృత్యుంజయకవి జనకపితయనియు

లోకములో ప్రతీతి కలదు. పైనఁజెప్పిన ప్రతులేడింటిలో నొక్క దాని యందుతప్ప తక్కినయన్నిటిలోను ప్రథమాశ్వాసము లేదు. మిగిలిన యొక్క ప్రతియందైనను గ్రంథాద్యాదిలేదు షష్ఠ్యంతములు మొదలుగా నున్నది. అందుచేత తిరుమలరాజువంశ వృత్తాంతాదిక మేమియుఁ దెలియరాలేదు. కాని గ్రంథము, అంతర్వేది నృసింహస్వామికంకిత మీయఁబడుటచే నీతఁడా ప్రాంతమువాఁడని నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. అంతర్వేది గోదావరిమండలమునందు వసిష్ఠానదీతీరమున నున్నది.

షష్ఠ్యంతాదిగానున్న ప్రతి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగార మున నున్నది అందలి గద్య యీక్రిందివిధమున నున్నది.

"గద్య: ఇది శ్రీమద్భవానీశ్వర శాశ్వతకృపాపాత్ర కొత్తలంక విశ్వ నాథకవీంద్ర సత్పుత్త్ర సకలసుకవి జనానుగ్రహసహాయ మృత్యుంజయ నామధేయ ప్రణీతంబైన నలరాజచరిత్రంబను నిరోష్ఠ్యప్రబంధము".

ఈగద్యనుబట్టి యీకావ్యకర్త కొత్తలంక మృత్యుంజయుఁడే యనియు, ధనలోభము నీగ్రంథమును తిరుమలరాజునకు విక్రయించె ననియుఁజెప్పవచ్చును. తిరుమలరాజు, నిరర్గళ కవితావిలాసుఁడైనట్లు గద్యయందున్నది కాని యిట్టిప్రణీతకృతులనుబట్టి వారిపాండిత్యమును నిశ్చయింపననువుకాదు.

నలరాజచరిత్ర కవిత్వశైలి తెలియుటకై యందలి కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

శా. ఆరాజత్తరకీర్తి చెంతఁ జెలినై యానందసంధాతనై
నారీరత్ననిశాంతచారినయి నానాకార్యనిర్ణేతనై
సారార్థాంచిత నీతిశాస్త్రనిధినై సత్కారలీలాదయా
సారాధారధరిత్రి నేనయితి జంచల్లీల నీలాలకా ౨౩

మ. జనకాధీనతగాని కన్యకలకిచ్ఛాచేష్ట యెంద్రైన లే
ద నిశాశేషనరేశకాంచన కిరీటానర్ఘరత్నచ్ఛటా
జనితశ్రీలలితాంఘ్రియైన నల రాజన్యాగ్రణిం గాంచి యె
ట్లనఘా! జాలెద నిట్టి సంశయకలంకాకీర్ణ కార్యస్థితిన్. ౨౮

చ. జగతి జనించినట్టి నరసంతతి సంతతసత్క్రియారతిన్
గగనచరాకృతిన్ ద్రిదశకాంతల కేళికి నాస సేయఁగాఁ
దగ నరకాంతకై యచలచారి దలంచ ధరిత్రి కేగఁ గా
నగణితరక్తిగాదె తెలియన్ రతినాయక సాయకాళికిన్. ౨౯

మ. అళినీలాలక యత్తరిన్ జననిచే నాసన్నకల్యాణ స
ల్లలితాచార యథార్థరీతి రచితాలంకారయైయాళి క
న్యలకై దండలచేసహేలగతినయ్యాస్థాని కేతేరఁగా
నల రాజాగ్రణి గాంచె సంజనితతృష్ణాచంచలద్దృష్టియై. ౩౦

ఉ. అక్కట లెక్కలేని ఖచరాళికి నేలికయైనయట్టి తా
నెక్కడ యింత నేల చరఁగేలెడి యజ్జననేతకన్య నే
నెక్కడ యాయనర్హగతి నేల తలంచ నహో! నగారి యా
దిక్కరి కేల్గ్రహించఁగలదే హరిణాంగన చర్చసేయఁగన్. ౩౧

శా. కర్ణాటక్షితినేత, యీతని దళత్కంజాక్షి నానాజగ
త్కర్ణాటశ్శిరాద్రికంధరసరద్గంగా ఝరీనీరదృ
క్పూర్ణాగ్రేసర తారకాశరహారాంగక్షీరకాంతిచ్ఛటా
కీర్ణానేకదిశాతటాంతరచరత్కీర్తి న్నిరీక్షించితే. ౩౨

చ. అలగిన యత్తరిన్ గలక నందక సారదయానిరీక్షచే
నలరఁగఁజేసి వస్తు దయహాంకృతిసెందక ధాత్రిరీతి ని
శ్చలత నిజేశు సన్నిధిని సంతతహర్షనితాంతచిత్తయై
చెలఁగెడి కన్య ధన్యగతిచే నలరారెడి సారసానవా. ౩౩

శా. రాజేంద్రా! నిషధాధినేత! యింక నిద్రాసక్తి యేలయ్య! నీ
తేజస్సంతతి చింత గందెడి యరాతిశ్రేణి సత్కీర్తి నా
రాజన్నీరజపీసహాయకిరణాగ్రశ్రీలచే గంది నీ
తేజోరాతినితాంతకాంతికళ జారెం గానరా కెయ్యెడన్. ౫౮

ఈసలరాజచరిత్రకుం బ్రతులు వ్రాసికొనినవి లేఖకులు ఆయా ప్రతులు వ్రాసికొనిన కాలమును తమప్రతులలో వేసికొనియున్నారు. ఆకాలమును విమర్శించిచూడగా క్రీ. శ. ౧౭౯౦ వ సంవత్సరమునకు పూర్వ మీగ్రంథము రచించినట్లు కనుపట్టినది.



## 417 హర్యపరాజు రంగశాయి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; నారాయణమంత్రికిని, చాయమాంబకును బుత్త్రుఁడు; శంకరమంత్రి పౌత్రుఁడు

ఈకవి అంబరీషచరిత్ర మను నైదాశ్వాసముల ప్రబంధమును శివమృగయావిలాస మను నేకాశ్వాసపద్యకావ్యమును రచియించి యుండెను. ఇవి ముద్రితములు కాలేదు. మదరాసునందలి ప్రాచ్యలిఖితపుస్తకాగారమున నంబరీషచరిత్రమునకు రెండును, శివమృగయావిలాసమున కొకటియు నముద్రితప్రతు లున్నవి. భాగవతాష్టమస్కంధమందలి యంబరీషోపాఖ్యానకథయే యీతని యంబరీషచరిత్రమున వర్ణితమైనది. శివమృగయావిలాసమున నీశ్వరుని దారుకావనవిహారము వర్ణింపఁబడినది.

ఈకవి యెచ్చటివాఁడో, యెప్పటివాఁడో తెలియఁదగిన యాధారములు దొరకలేదు. అంబరీషచరిత్ర ప్రతివిలేఖకుఁడు ప్రతి వ్రాసికొనినదినము ప్రజోత్పత్తి సంవత్సర పుష్య బ౭ ఇందువార మని వ్రాసికొనియున్నాఁడు. అది క్రీ.శ. ౧౮౧౨ సంవత్సరము జనవరి ౨౦వ తేదీ అయినది కావున కవి యంతకుఁ బూర్వుఁ డనుట నిశ్చయము. బహుశః పదునెనిమిదవశతాబ్దివాఁడై యుండును.

కవితండ్రి యైననారాయణమంత్రి, వడ్డమాని పేరమంత్రియొక్క యిరువురుకుమార్తెలను రావినూతుల వెంకటనరసమంత్రి కుమార్తెను బరిణయమైన ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది. కళత్రవియోగము తటస్థించుచుండుటచేఁ గ్రమముగా నాయన మూఁడువివాహములను చేసికొనియుండును. కవి వడ్డమానివారిదౌహిత్రుఁడు ..

గీ. అఖిలరాజన్యసభలలోఁ నహరహంబు
వినుతి జేకొని సత్కీర్తి వెలసె నార
యాశ్రితవ్రాతసర్వేశ్వరావనీజ
మతి విభాపాళి నారాయణార్యమౌళి.

ఉ. ఆతఁడు పెండ్లియాడె హరిదంతపరిస్ఫురితాతికీర్తిసం
ఘాతుఁడు వడ్డమానికులగంధిసుధానిధి పేరమంత్రికిన్
సేతుహిమాద్రిమధ్య ధరణీతలవిశ్రుత లక్ష్మమాంబకున్
బ్రాతి జనించినట్టిగుణభవ్యలఁ బేరమ చాయమాంబలన్.

తే. మఱియు రావినూతుల కులమానితాబ్ధి
నలినపరిపంథి వేంకటనరసమంత్రి
కమలగుణసాంద్ర లక్ష్మాంబకాత్మజ యగు
రాజమాంబను బెండ్లాడె రమణనందు.

ఈ రాజమాంబయందు అప్పయమంత్రి జన్మించిన ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

తే. రాజమాంబయందు రాజశేఖరుముందు
కమలవలన శౌరి గనినయటుల
గనియె నారమంత్రిఘను నప్పయాఖ్యాతు
ధీజితాబ్జభూతు ధృతిసమేతు.

క. రామప్రభునకు భక్తిన్
సౌమిత్రియుఁ బోలె నీకు సహజాతుండా
ధీమణి యప్పయమంత్రి
గ్రామణి పరిచర్య సేయుఁ దా సుగుణములన్.

వర్ధమాని వీరమంత్రి యీకవిసోదరికిభర్తయై నట్లీక్రిందిపద్యము లోఁ జెప్పియున్నాఁడు.

క. శ్రీరామచంద్రపద ప
ద్మారాధనహృత్ప్రకాశు మద్భగినీశున్
సూరినుతు వర్ధమాన్కుల
వారిధిశశి వీరమంత్రివర్యుం దలఁతున్.

ఈకవివంశమువారు పూర్వమునుండియు శిష్టాచారసంపన్నులై పండితులై, విజ్ఞానులై, రాజనీతివిశారదులై యుండినట్లీకవిరచించిన యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. శ్రీగురువరపాదసేవాధురీణుండు
సారవేదాంతవిశారదుండు
సంసారభవబంధ సాగరోత్తారుండు
పాపాంధకారవిభాకరుఁడు
హార్యపదాజాన్వయాంబోధిచంద్రుండు
కాశీపతిధ్యానకౌశలుండు
శేషాహిభాషావిశేషవాగ్జాలుండు
పోషితబహుశిష్యపుంగవుండు.

సకలయోగి సమాధినిష్ఠాయుతుండు
సచ్చిదానందరూపవిజ్ఞానమయుఁడు
నిత్యసత్యవ్రతుండును నిర్మలుండు
మల్లపాఖ్యప్రధానుండు మహిని వెలయు.

ఉ. శంకరమంత్రిశేఖరుఁడు శంకరుఁడే యన భూరిదోషనా
శంకరమౌళియై విబుధసన్నుత శాశ్వత సర్వమంగళా
లంకృతుఁడై యహీనరుచిరస్ఫురితాంగుఁడునై యరాతిని
శ్శంకతఁ దేజరిల్లుచుఁ బ్రజాపరిపాలన సేసె నర్మిలిన్.

గీ. సకలరాజాధిరాజులసభలలోన
రమణఁ బేరైన సూర్యపరాజవంశ
కలశవారాశిచంద్రుఁడై ఘనత కెక్కు
శంకరామాత్యమౌళి నెంచంగఁదరమె.

రంగశాయికవికూడ రామభక్తుఁడును నిత్యమును దేవతారాధనచేయువాఁడునై యున్నాఁడు. దేవతారాధన సమయమునసే శ్రీరామచంద్రుండు హృదయగోచరుఁడై యంబరీషచరిత్రమును దనకంకితము చేయుమని యానతిచ్చినట్లు కవి చెప్పుకొనియున్నాఁడు.



## 418 కనుమర్తి అబ్బయామాత్యుఁడు

– ※ –

ఇతఁడు వెలనాటి వైదిక నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; ఇతనికిఁ తండ్రి రాయనమంత్రి; తల్లి నరసమాంబ; తాత అబ్బయమాత్రి; యోగానందుఁ డగ్రజుఁడు.

ఈకవితల్లజుఁడు కవిరాజమనోరంజనము; అనిరుద్ధచరిత్రము అను రెండుత్తమప్రబంధములను రచించెను. కవి తననుగూర్చి యనిరుద్ధచరిత్రమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శుభకరాపస్తంబసూత్రుండు కౌండిన్య
గోత్రుండు నార్వేలకులపవిత్రుఁ
డగు బసవనమంత్రి కమరప్ప, ముమ్మన,
పెద్దయ యెల్లప్ప ప్రియతనూజు
లాకుమారచతుష్టయంబులో ముమ్మనా
మాత్యుఁడు సత్కీర్తిమండనుండు
తత్తనూజాతుఁ డుత్తమధర్మశీలుండు
నిర్మలచరితుండు నిమ్మనాథుఁ
డతని నిజసాధ్వి యగుకొండమాంబగర్భ
మందు జనియించె వినయవిద్యావిచక్షణుండు
హరిహరధ్యానసేవాపరాయణుండు
మహితరుచిహేళి యబ్బయామాత్యమౌళి.

ఇందు వర్ణింపఁబడిన యబ్బయామాత్యుఁడు కవికిఁ బితామహుఁడు. ఇతఁడు కొండవీటిరాజులవలన మన్ననలుబడసి కనుపర్తిపుర మందుండెననియుఁ బండితుఁ డని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. నిండుగుణంబు సత్యమును నీతియు, శాంతముఁ గల్గి కీర్తివం
తుండయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటిభూ
మండలనాయకుల్మిగుల మన్ననసేయఁగఁ బెంపుమీఱె స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తిపురాన్వయవార్ధిపూర్ణచం
ద్రుండని లోకు లందఱు నెఱుంగఁ గటకున్ నుతిసేయ నేటికిన్.

తే. అమ్మహాత్ముని గేహిని యైనపుణ్య
వతికి లక్ష్మాంబ కుదయించె సుతయుగంబు
మహితగుణశాలి రాయనమంత్రివరుఁడు
నిరుపమగుణోజ్జ్వలుండగు నిమ్మఘనుఁడు

క. ధీనిధి రాయనమంత్రికి
మానవతీమణికి నరసమాంబకు జననం
బై నార మిరుపురము యో
గానందుఁడు నబ్బనార్యుఁడనఁ దగు నేనున్.

క. నరసింహపాదభక్తుఁడ
నరసింహకృపాప్రసాదనయలబ్ధమతిన్
నరసింహార్పితహృదయుఁడ
నరసింహునికరుణఁ జాల నమ్మినవాఁడన్.

కవికిఁ దాతయైన అబ్బయామాత్యుఁడు కొండవీటి ప్రభువులచే మన్ననలందెనని వ్రాసినపై యుత్పలమాల నుదాహరించుచు బ్ర. వీరేశలింగముపంతులుగారు తమకవులచరిత్రములలో నప్పటికిఁ గొండవీటి రాజ్యము తురుష్కులయాధీనమయ్యెననియు, నందుచేఁ గాఁబోలు కవి తరువాత రచించిన కవిజనరంజనములో నబ్బయామాత్యుని వర్ణించిన పద్యమునందు కొండవీటివృత్తాంతమును విడిచిపెట్టె ననియు, వ్రాసి, పై యుత్పలమాలలో నుదాహరించిన కొండవీటివిషయము నందలి సత్యముకొఱకుఁ గూర్చి సంశయమును జూపియున్నారు కాని

బలవత్తరమైన కారణములున్న నేతప్ప యావిషయమున సంశయమును జూపబనిలేదు కొండవీడు తురుష్కుల యధీనమైనను, అబ్బయామాత్యుఁడు పండితుఁడు కావున తురుష్కులైనను గౌరవము చూపియుండవచ్చును. కవిజనరంజనములోఁ జెప్పలేదనుకారణమున, ననిరుద్ధచరిత్రమున వ్రాసిన దసత్యమని తలంపరాదు

కవివంశమునకు మూలపురుషుఁడుగా పైసీసపద్యములోఁ జెప్పఁబడిన బసవనమంత్రి కొండవీటిప్రభువులకడ మంత్రిగానుండెనని కవిజనరంజనమున నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు ఈసంగతి యనిరుద్ధచరిత్రమునఁ జెప్పలేదు.

శా. శ్రీపేర్మిన్ శశివోలె బ్రహ్మకులవార్ధిఁబుట్టి కౌండిన్యగో
త్రాపస్తంబపవిత్రసూత్రకలితుండై రామశింహాసనా
ఖ్యోపేతస్ఫుటకొండవీటిపురరాజ్యైశ్వర్యు ల్మంత్రిగాఁ
జేపట్టం బసవప్రధానుఁ డిలమించెన్ భాగ్యసంపన్నుఁడై.

క. ఆమంత్రిమణి ప్రకాశన
భూమణి కనుపర్తి బుక్కపురముఖ్యబహు
గ్రామస్వాస్థ్యానుభవ
గ్రామణి బుధనుతులసుతులఁ గాంచె నలువురన్.

ఈబసవమంత్రి కనుపర్తి, బుక్కపురము మొదలుగా ననేకగ్రామములలో వృత్తులను సంపాదించినట్లు పైపద్యములో నున్నది. కనుపర్తిగ్రామమున కీవంశమువారు కరణములై యుండురనితోచుచున్నది. కనుపర్తి ప్రస్తుతము గుంటూరుమండలములోని వంగవోలు తాలూకాలో నున్నది. కవికిఁ బితామహుఁడైన యబ్బయామాత్యుని నివాసము కనుపర్తి యని చెప్పియున్నందునఁ గవినివాసము కూడ నాయూరే యైయుండును.

ఈకవి కాలమును దెలిసికొనుటకుఁ దగిన యాధారములు గ్రంథములలోఁ గన్పట్టలేదు. పూర్వకవులలోఁ బమ్మెరపోతనామాత్యుని వఱకుఁ గల కవులలోనివారిని మాత్రమే నుతించియున్నాఁడు. వీరేశలింగము పంతులుగారీతనినిగూర్చి "అబ్బయామాత్యుఁడు పదునెనిమిదవశతాబ్దమధ్యముననుండినవాఁడు. ఇతఁడు ౧౭౮౦వ సంవత్సరప్రాంతమునఱకును జీవించియుండవచ్చును. ఇతఁ డాశతాబ్దమునందుండిన ప్రబంధకవీశ్వరులందఱిలోను మిక్కిలి ప్రౌఢుఁడు. వసుచరిత్రమునకుఁ దరువాత నీతని కవిరాజమనోరంజనముతో సరితూఁగఁదగిన ప్రబంధము లొకటిరెంటికంటె నెక్కువగా లేవు. కవిరాజమనోరంజనములోని యీక్రిందిపద్యమువలనఁ గవిసాహిత్యమునందు మాత్రమేకాక సంగీతమునందును బ్రవీణుఁడయినట్లు కనఁబడుచున్నాఁడు.

క. శ్రీమంగళగిరినరసిం
హామేయకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడఁ గానకళా
ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్."

అని వ్రాసియున్నారు.

తనకవిత్వమందు తప్పులున్నచో దిద్ది గ్రహింపుఁడని బండితులఁ గోరుచు నీతఁడు రచించిన పద్యము లేడెనిమిది యున్నవి. అందు రెం డీక్రింద వ్రాయుచున్నాఁడను.

చ. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరిసొమ్ము గాదు భా
రతిదయ సౌధవార్ధి కవిరాజులమానసముల్ ఘటంబు లా
యతమఃకొలంది లబ్ధ మగునయ్యమృతం బటుగాఁ దలంచి య
ద్యతనకవీంద్రులార! కృపదప్పక మత్కృతి నాదరింపుఁడీ.

ఉ. ఎవ్వరి కెంతబుద్ధి పరమేశుఁడు దాఁ గృపచేసె నట్టిదై
నివ్వటిలున్ గవిత్వరుచి నేరుపుచాలినఁ జాలకుండినన్

నవ్యక వర్తమానకవినాథులు చేకొనరయ్య మత్కృతిన్
బువ్వులు గందకుండ రసముం గొను తేటులవంటి నేర్పునన్.

అనిరుద్ధచరిత్రమునందు, ఉషానిరుద్ధులపరిణయకథయే వర్ణితమైనది. ఈదంపతులకుఁ గలిగిన బాలుని సాముద్రికశాస్త్రలక్షణముల బరీక్షించి యాతఁడు గొప్ప యదృష్టవంతుఁ డగునని నారదుఁడు చెప్పినట్లు కవి తనకుఁగల సాముద్రికశాస్త్రపరిజ్ఞానమును వ్యక్తీకరించుచు గ్రంథాంతభాగమున రచించిన పద్యములలో నొక్కపద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

సీ. వరలీల దక్షిణావర్తరేఖాయుత
భ్రూమధ్యుఁడు సమస్తభూమి నేలు
నైదురేఖలు ఫాలమందున్నవాఁడు
దీర్ఘాయుస్సమన్వితుం డైనవాఁడు
ఊర్ధ్వరేఖలు పాదయుగళంబునందుఁ
బెంపొందుమానవుఁ డుత్తమోత్తముండు
దనరిముప్పదిరెండు దంతములు గల్గిన
యట్టినరుండు భాగ్యాధికుండు

తే. కంబుసన్నిభ మైనట్టి గళమువాఁడు
విలసితం బగుకీర్తుల వెలయువాఁడు
కఠినమగుహస్తతలములుం గడుమృదుత్వ
చరణములు గల్గుమనుజుఁ డైశ్వర్యయుతుఁడు.

ఈకవికి మంగళగిరినృసింహస్వామి యిష్టదైవము అనిరుద్ధచరిత్రము నా దేవునకే యంకిత మొనర్చెను. ఆస్వామి, కవికి స్వప్నమునఁ గాన్పించి

క. బాలత్వమందె నీకు ద
యాళుఁడనై యొసఁగితిన్ మదర్పితకవితా

ఖేలనము ను మద్భజనా
శీలంబును దృఢముగాఁగఁ జేశితివత్సా!

క. అవిరుద్ధచరిత్రయుఁ జ
క్కనిమచ్చుట విస్తరించి కణఁగి ప్రబంధం
బొనరింపుము శ్రేయోవ
ర్ధన మగు మాపేర నంకితము సేయుఁ దగన్

అని యానతిచ్చెనఁట.

కవిజనరంజనము ను రచించినప్పుడుకూడ నానృసింహస్వామియే స్వప్నమునఁగనఁబడి,

క. మునుపు పనిరుద్ధచరిత్రం
బను కృతిరచియించి మంగళాచలపతికై
యొనరారు నాకు నంకిత
మొనరించితి నేను బ్రీతి నొందితి నింకన్.

శా. మద్భక్తుండు పురూరవుండు మనుధర్మంబొప్పఁ బాలించె నే
తద్భూమండల మేకచక్రముగఁ దద్వార్తల్ పురాణోక్తముల్
తద్భావార్థ మెఱింగి విస్తరము నొందం జేయు మస్మత్ప్రసా
దోద్భూతాద్భుత శేముషీచతురవాగ్వ్యక్తిన్ బ్రబంధంబుగన్.

వ. తత్ప్రబంధంబు మద్గోపాలనామాంకితంబుగా రచియింపుము మదీయకృష్ణావతారసగుణబ్రహ్మోపాస్తి పరులు నాకుం బ్రియతములు గావునఁ దద్రూపంబున నీచే నుపాసితుండనై నీహృదయంబున విహరింతు నని యానతిచ్చుటచేఁ గవి కవిజనరంజనమును శ్రీకృష్ణునకంకిత మొనర్చెను. కవులు రచించిన గ్రంథములను నరాంకితము చేయుటకంటె భగవదర్పిత మొనర్చుట శ్రేయోదాయకమని యనిరుద్ధచరిత్రమున నీక్రిందిపద్యములలోఁ దెల్పినాఁడు.

క. చదువులకు మేర యెయ్యది
చదివినమాత్రంబె చాలు సరస వచస్సం
పదఁ దా నేర్చినకొలఁదిని
యదఁ గవితఁ జెప్పి హరికి నర్పింపఁదగున్.

మ. అతిదాక్షిణ్యుఁడతండు పూర్వకవికావ్యప్రౌఢవాచారసో
న్నతులం దేలిన, దేలఁగాక యెపుడున్ నావంటి కించిజ్జ్ఞుచేఁ
గృతి విశ్వాసమెఱింగి చేకొనియెడున్ శృంగారపద్యల్లలీ
రతులంజొక్కియుఁ గుబ్జమేను వగమీఱన్ దీర్చి చేపట్టఁడే.

క. భగవంతుని సద్గుణములు
పొగడువివేకంబె తమకపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతిసేయరు
జగతిన్ సత్కవు లుచ్ఛసంపద కొఱకై.

మ. హరినామాంకితకావ్యమెట్టిదయినన్మాననంబై సజ్జనా
దరణీయంబగుఁ బుష్పమాలికలలో దారంబు చందంబునన్
నరనామాంకితమైనకావ్యము రసౌన్నత్యస్థమయ్యున్ నిరా
దరణంబై చను హీనజాతిపురుషున్ గైకొన్న వేశ్యంబలెన్.

కవిజనరంజనమునకుఁ బురూరవశ్చరిత్రనామాంతరముగలదు. ఇది యైదాశ్వాసముల రసవత్తరమైన శృంగార ప్రబంధము. పురూరవ చక్రవర్తి సుగుణములు నారదునివలన విని దేవేంద్రుఁ డాతని నాకలోకమునకు రప్పించుటయు నాసభలో నప్సరసయగునూర్వశి యారాజచంద్రుంగాంచి మోహించుటయుఁ గొండొకనెపంబున నింద్రునాజ్ఞపై నూర్వశి భూలోకంబున కరుదెంచుటయు నూర్వశీపురూరవసమాగమంబును ఊర్వశి కొంతకాలము భూలోకంబున నాతనితోఁ గలిసియుండి నాకలోకంబునకుఁ బోవుటయుఁ, బురూరవుండు మరల దేవలోకంబున

కేఁగి గంధర్వుల వేఁడి యూర్వశిం దెచ్చుకొనుటయు మొదలుగాఁగల కథ యిందు వర్ణితము.

ఈతనికవిత్వము ద్రాక్షాపాకమున లోకోక్తులతోనిండి, మనోహరముగానుండును ఈతని రెండుగ్రంథములనుండియుఁ బద్యముల నుదాహరించుచున్నాఁడను.

అనిరుద్ధచరిత్రము :

ఉ. బంగరుపళ్లెరంబులను బ్రాఁతిగ నించిన ముత్తియంబులు
పొంగుచు హస్తయుగ్మములఁ బూర్ణముగాఁ బలుమారు ముంచుచున్
రంగుగ నొక్కరొక్కరి శిరంబు పయిం దలఁబ్రాలు వోసి ర
య్యంగమరీచినవ్యమణులై విగుహారుఁగ నవ్వధూవరుల్. ౧౫

ఉ. ఎన్నఁడు లేని విన్నదనమేల మొగంబున దోఁచెనమ్మ నీ
కెన్నఁడు లేని చింత మదినెక్కడనుండి ఘటించెనమ్మ హా౦
దెన్నఁడు లేని యీకృశత నేటికి దేహము చిక్కెనమ్మ నీ
యున్నకథంబుఁజూచి వగనొందెడు నాహృదయంబుకోమలీ. ౨౫

ఉ. చక్కని వారిలో మొదలిచక్కనివాఁడగు తండ్రికన్న నాం
జక్కనివాఁడు భవ్యగుణసంపదఁ దాతను బోలువాఁడు పెం
పెక్కనకీర్తివాఁడు కమలేక్షణపౌత్రుఁడు శంబరారికిన్
మక్కువనందనుం డితఁడు మానవతీ యనిరుద్ధుఁజూడుమా ౨౫

మ. అమలేందూపల వేదికాస్థలమునం దాసీనుఁడై యయ్యుషా
రమణీరత్నముతోడ నతివిపుణారంభంబునం ద్యూతసం
భ్రమకేళీరతినున్న పంచశరసామ్రాజ్యాధిపత్యప్రసి
ద్ధమనోజ్ఞప్రతిభాసమృద్ధు ననిరుద్ధుం గాంచి క్రోధాత్ములై. ౩౫

శా. అయ్యా మాయనిరుద్ధుఁడెందరిగనో యాకస్మికంబాటచే
వయ్యోచోటులఁజూడ బంచితిమి గోరంతైన నవ్వార్త లే

దయ్యె న్వాసిఁ దలంచి మామకజనం బత్యంత చింతామయం
బయ్యెట్లున్నది సేయఁగావలయు కార్యం బానతీయ న్దగున్. ౪౮

చ. పురుషులలో నపూర్వరసపూర్ణ శరీరము సంగ సూతికిం
దరుణులలో సమానరహితంబగు రూపము బాణపుత్త్రికిన్
సరసముగా సృజించి యిటు సమ్మతి నిద్దఱఁగూర్చినట్టి యా
సరసిజగర్భుఁడెంత గుణశాలి తలంపఁగఁ బాటలాధరా! ౫౮

కవిరాజమనోరంజనము :-

మ. అయమర్థిజనయంచు యాచకలలాటాంతస్థలిన్ బ్రహ్మ ని
ర్ణయతన్ వ్రాయవహించునట్టిలిపి యర్థంబున్ విశేషాన్వయ
క్రియగా నర్థమవారిగా నొసఁగి యర్థింజేయు వాగీశు వ్రాఁ
తయు నాత్మీయవితీర్ణియు న్నిజముగా ధాత్రీశు నేర్పెట్టిదో. ౧౮

-ఈపద్యము శ్రీహర్ష కృతనైషధమందలి -

శ్లో. అయందరిద్రోభవతీతివైధసీం
లిపింలలాటేర్థిజనస్యజాగ్రతీం
మృషానచక్రేల్పితకల్పపాదపః
ప్రణీయదారిద్ర్యదరిద్రతాంనళః ౩౧

అను శ్లోకమునకుఁ దెలుఁగు :-

ఉ. ఆనరనాథుఁజూచినలతాంగుల డెందపుఁగుందనం బయో
గానల కీలలం గరఁచి యందుఁ దదీయ మనోహరాకృతిం
బూని దృఢంబుగాఁగ నిలుపున్ వలపున్ బడి యచ్చుచేతనా
నా న వినోదము ల్సుమశరాసనకాంచనకారి కృత్యముల్ ౧౩

చ. చదువు వివేకమూలమని సద్గురుసన్నిధి వేదశాస్త్రముల్
చదువఁగ వచ్చినట్టి యలచంద్రుఁడు కుం గురుపత్ని పొందు క
ష్టదశఘటింపఁజేసె నకటా యిఁక నేమనవచ్చు దైవమున్
మదినిదిపుణ్యమానని యొనర్పఁగఁ బాపము వచ్చునేమొకో ౨౮

ఉ. ఏటికిఁజెప్పఁ దాపసి నరేంద్రునిపెంపు సురేంద్రుతోడ నే
నేటికివింటిఁ దద్గుణము లెల్లఁ బరాకొక యింతలేక నా
కేటికిఁబుట్టె వానిపయి నెంతట నంకెకురానిప్రేమ న
న్నేటికి నప్పగించెఁ గుసుమేషునిబారికి దైవమక్కటా! 31

చ. చతురులమంచుఁ బండితులు సారెకు నీమెయికందుఁజూచి క
ల్పితవచనంబులన్ మఱుఁగువెట్టి శశంబు మృగంబు లాంఛన
స్థితి యని పల్కుచుందురు శశీ! పటురాదుఁడు వీరభద్రుఁడు
ద్ధతి నినుఁగుండియల్ కమలఁ దన్నినచోట నరేమి పాపమో. 32

ఉ. వెచ్చనితీర్థమాడి నులువెచ్చ పదార్థము లారగించి బ
ల్పచ్చడమాల్ ముసుంగులిడి పైఁజలిసోఁకని కమ్మటిండ్లలో
ముచ్చుముడింగి యింటిపని ముమ్మరమెల్లనుదీర్చి పక్కకున్
వచ్చినప్రోడయాండ్రకురువంపుడుబల్చనిగొండలూన త్రో
మ్మొచ్చి కవుంగలించి సుఖయించిరి ప్రౌఢగృహస్థులజ్జడిన్. 33

శా. మాయామానుషమూర్తివై యిల బ్రహ్మంబు న్నివాబ్జాసనా
ధ్యేయు న్నిన్ను నెఱుంగలేక తి న్నాఁబుగొన్నందుకుం
బ్రాయశ్చిత్తముగాఁగఁ జేసితివి నాపాపంబు లోపంబుగా
నాయజ్ఞానము వాసె నీకరుణ గృష్ణా గోపికావల్లభా. అ.చ.10

చ. పలికె నరేంద్రుతోఁ గుముదబంధుకులోత్తమహీనుభంగి యి
ట్లలుకువలేక వస్త్రరహితాకృతినాకడనిల్వఁ బాడియే
యలసమయోక్తియుం దలఁపవైతివి పీడని పొందు వీడుకో
వలసెఁ గదా యిఁకన్ గలలవంటివి గావె ఋణానుబంధముల్. 10

ఉ. ఒక్కనిమేషమైన నొకరొక్కరిమోములు చూడకుండినన్
మిక్కిలిజాలినొందుదురు మేనులు జీవములొక్కరూపుగా
మక్కువలందలంపుదురు మాటికి వెన్నవలెం గరంగుచున్
సొక్కుదురొండొరున్ దనుపు సోఁకిన వారల మోహమెట్టిదో. 10

— ※ —

# 419 సుసర్ల సుబ్రహ్మణ్యకవి

ఈకవి తెలగాణ్యశాఖకుఁ జెందిన వైదికబ్రాహ్మణుఁడు; శాలావతసగోత్రుఁడు; పాపయ్యసోమయాజికిని, మహాలక్ష్మసోమిదేవికిని బుత్త్రుఁడు; ఈపాపయ్యసోమయాజికి సర్వేశ్వర సోమయాజియని నామాంతరము. వ్యాఘ్రేశ్వర సోమయాజికిఁ బౌత్త్రుఁడు.

ఈతఁడు సంస్కృతమునఁ బరాశరభట్టార్యులచే రచియింపఁబడిన గుణరత్నకోశమను లక్ష్మస్తోత్రమునాంధ్రీకరించెను. అందుఁ గవి తన పితృపితామహుల నీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు

మ. ధర వ్యాఘ్రేశ్వరసోమయాజిసుతరత్నంబై సుసర్లాన్వయా
బ్ధిరమాసోదరుఁడై సమగ్రతరవిద్యావి. . . . . . . భా
స్వరసర్వేశ్వరసోమయాజి తనరెన్ సర్వజ్ఞుఁడై భాగ్యబం
ధురుఁడై వందితసత్కవీంద్రజనతాస్తోత్రవ్యధీశాలియై

క. తలిదండ్రు లతని బాల్యపుఁ
బలుకులు విని ప్రేమఁజిన్నపాపఁడ యనుచున్
బిలిచిరి పిలిచిన నీఘనుఁ
డలరెన్ బాపయ్యసోమయాజి యనంగన్.

క. సుతుఁ డనువారికి శాలా
వతగోత్రుఁడ సుసరలాన్వవాయోద్భవుఁడన్
హితుఁడను కవిబుధులకు నే
ధృతసుబ్రహ్మణ్యనామధేయుఁడ జగతిన్.

శా. శ్రౌతస్మార్తములన్ ప్రయోగసరణీచాతుర్యయుక్తిన్ బుధ
వ్రాంత చెన్నఁగఁ జెప్పి యాజుషమహాగ్రంథత్రయిన్ లక్షణో
పేతస్ఫీతపదక్రమంబు లొగి నేర్పెన్ ధాత్రిసర్వేశ్వర
ఖ్యాతి న్మించిన యజ్వ మజ్జనకుఁ డయ్యార్యున్ బ్రశంసించెదన్.

ఈకఁడు తనకు విద్య నేర్పిన గురువుల నీక్రిందిపద్యములలో స్తుతించియున్నాఁడు.

చ. తొలుతఁ ద్రిభాష్యరత్నమును దొమ్మిదిశిక్షులు వాని భాష్యముల్
బలుసరహస్యపద్ధతులఁ బాఠముఁ జెప్పియు నాదుమానసం
బలర జటావధానవిధ మంతయు నాకు దయార్ద్రదృష్టిచేఁ
దెలిపిన బ్రహ్మయజ్వ విబుధేంద్రునిపాదము లేను గొల్చెదన్.

క. అవ్యాఁజతత్త్వజ్ఞానమె
ద్రవ్యముగాఁ గలుగు రామలక్ష్మణబుధులన్
కావ్యాలంకృతినాటక
భవ్యవ్యాకరణగురుల భావింతు మదిన్.

పున్నమరాజు రామచంద్రుఁడను నాయన యీగ్రంథమును రచింపుమని కవిని ప్రోత్సహించినట్లీక్రిందిపద్యములలో నుడివియున్నాడు

క. ఒకనాఁడు శ్రీజనార్దను
నకు శ్రీమదగస్త్యదేవునకు నగుసేవల్
ప్రకటముగ జరగువేళన్
సకలప్రజ కూడి నట్టి సభ నిటు నడిచెన్.

వ. ఇట్లు ప్రశంసించి యనంతరంబ సభాగతుండనైన నన్నవలోకించి

క. ఎన్నఁగ భాషాద్వయమున
నున్నతకవితాసమృద్ధి నొనరితి వనినన్
బున్నమరాజకులీనుఁడు
సన్నుతచర్యుండు రామచంద్రుం డనియెన్.

ఉ. శ్రీగుణరత్నకోశమను చెల్వగు సంస్కృతపద్యకావ్యమున్
భోగిశయానరంగపతిపుత్రపరాశరభట్టరార్యులే
లాగునఁ జేసి రట్లు ప్రబలంబున నాంధ్రము సేయుఁడీ మహా
భోగము భాగ్యమున్ యశము పుత్రసమృద్ధియు మీకు నయ్యెడున్

ఈ పున్నమరాజు రామచంద్రుడుగారు, గోదావరి మండల మందలి రామచంద్రపురము తాలూకాలోని మండపేటనగరమునకు కరణము. ఆయనను నేనెఱుంగుదును. నేను పదుమూఁడేండ్లవయసులోనుండఁగా ప్రథమమున క్రీ. శ. ౧౮౯౭ వ సంవత్సరముననే నాయనను జూచితిని. అప్పటి కాయన కించుమించుగ నలువదేండ్లుండును.

సుబ్రహ్మణ్యకవి క్రీ. శ. ౧౮౨౦ వ సంవత్సర ప్రాంతమున నీగ్రంథమును రచించియుండును. ఈయన నివాసముకూడ నామండపేటయే. ఈగ్రామమును గవి యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

శా. శ్రీమద్రాజమహేంద్రనామ నగరీశ్రీభర్గవర్యస్థితా
సామాన్యస్ఫురణాదతత్పురపశ్చాద్భాగతుల్యానదీ
గ్రామణ్యంతికపూర్వదిక్ప్రథితతీరప్రాంతవిద్యోతిత
శ్రీమాండవ్యపురీవరం బలరె ధాత్రీనూతనస్వర్గమై.

ఈ మండపేటగ్రామము మానివాసమైన కపిలేశ్వరపురమున కుత్తరమున పదిమైళ్లదూరములోనున్నది. ఈగ్రంథము మండపేటలోనున్న హరిహరనాథస్వామి కంకితమీయబడినది. ఆస్వామి కవికి స్వప్నమునఁ గన్పడి యీకావ్యమును దనకుఁగృతియిమ్మని చెప్పెనట.

మచ్చుపద్యములు :-

శ్లో. శ్రీమైనమ స్తచిదచిద్విధానవ్యసనంహరేః
అంగీకారిభిరాలోకై స్సార్థయంత్యేకృతోంజలిః.

క. రంగేశా ఖిలచిదచి
త్సంగతసుజగద్విధివ్యసనమును నిజదృ
ష్ట్యంగీకారము చేతను
సాంగముగాఁ జేయు సిరికిసాంజలియగుదున్.

శ్లో. యదిమచుజశిరశ్చాంలీలయాతుల్యవృత్తే
ఽనుజనుసూపాదేవినావాత్రిష్యః
అసరసమథవిష్యనర్కనాథస్యమాత
ర్దరదళదరవిందోదంతకాంతాయతాక్షి.

మ. నరతిర్యగ్సురవృత్తిలీలఁగని నీనాథుండు జన్మింపఁ ద
ద్వరజన్మంబులకానురూప్యముగఁ బద్మా! నీవు జన్మింపవే
నిరసాపేతముతక్కఁ తూహూలసము న్మోషంబుకించిద్దళ
త్సరసీజాంతరకాంతదీర్ఘనయనద్వంద్వా! మదంబా! సిరీ!

ఈగ్రంథము ముద్రితముకాలేదు. అసమగ్రమయిన యముద్రిత ప్రతియొకటి మదరాసునందున్నది. ఈకవి నన్నయభట్టకృతమనియెడి యాంధ్రశబ్దచింతామణిసూత్రములకు తాత్పర్యమును దండాన్వయముగా గ్రామ్యభాషలో రచియించెను.

౧వ సూత్రము :- "విశ్వః శ్రేయం కావ్యమ్".

"కావ్యము సమస్తమున్నైనటువంటి శ్రేయస్సులు గలది. ఆకావ్యము అపార్థం మొదలైన దోషరహితములైనటువంటిన్ని గుణాలంకార సంయుక్తములైనటువంటిన్ని వాక్యార్థములని...... వలెను. యే విభావాదిరూపములచేత రసములయందు వ్యాపారంగలదో అది శబ్దమనిపించుకుంటున్నది. కవీశ్వరులచేతను యే యే విధములచేతనైనానున్ను రసము సాధించతగ్గదికదా".

క. సుసరళ సుబ్రహ్మణ్యాం
డు సబాలసరస్వతీయ నుతనన్నయ వా
క్ప్రస్తృతవ్యాకృతిఁజూచి బు
ధ సమితికినిఁ బ్రీతిఁ గూర్పఁదగునిది జేసెన్.

గ్రంథాంతమందు "ప్లవనామ సం॥ మార్గశిర శు ౧౫ మంగళవారం నాడు సూర్యాస్తమయాత్కు అయిన లిఖితము" అని వ్రాయఁబడి యున్నది. ఇది క్రీ.శ. ౧౮....

ఈకవికి శిష్యుఁడైన మండవేముల వెంకటరామకవి తనక్రియా యోగసారమునందీ సుబ్రహ్మణ్యకవి నిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. తర్కవేదాంతశాస్త్ర ప్రసంగోద్ధత
వాగ్విశేషజితాహివల్లభుఁడు
సేతుకాశీమధ్యభూతలసంస్థితా
శేషవిద్వద్బృంద శేఖరుండు
వసుదితాన్వయముదోద్గతాత్రకింపండితే
తివచోగ్రభాగసందీపితుండు
నతులితచతురితాప్రతిభాపహాసితపం
కేరుహాసంభవాంగీరసుండు

నై చెలంగు సువర్ణవంశాంబురాశి
కార్తికీశీతకిరణు నగణ్యపుణ్య
గుణవరేణ్యు సుబ్రహ్మణ్యకోవిదాగ్ర
గణ్యు సన్నుతియింతు వాక్కౌశలమున.



# 420 చిత్తారు గంగాధరకవి

— o —

ఇతనికి వెనవెళ్ల గంగాధరుఁడని నామాంతరము కలదు. వెనవెళ్ల యాతని జన్మస్థానమనియు, నీతనియింటి పేరు చిత్తారువారనియు, ననుచున్నారు అది సత్యమే కావచ్చును. ఇతనితండ్రి వీరయ్య. తల్లి మల్లమ్మ. ఇతఁడు జంగమ కులజుఁడు. ఇతని తాత నాగయ్య; సోమాంబ తండ్రితల్లి.

ఈకవి భల్లాణచరిత్రము, సిరియాళచరిత్ర, గంగావివాహము, కొలిపాక మాహాత్మ్యము అనుద్విపద కావ్యములును శుకసప్తతియను వచన కావ్యమును రచియించెను. భల్లాణచరిత్రము ముద్రితమైనది. సిరియాలచరిత్ర, గంగావివాహ మను గ్రంథముల యముద్రితప్రతులు మదరాసునందలి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునున్నవి. భల్లాణ చరిత్ర రాచవీడునందలి వీరభద్రస్వామికిఁ గృతియొసంగెను. ఈ రాచవీడు రావు సర్వజ్ఞసింగమ మహీపాలునకు రాజధాని. నిజాము రాష్ట్రములో నిది కొలిపాక పశ్చిమచాళుక్యరాజయిన సింహబల్లహుని రాజ్యస్థానములలో నొకపట్టణము. ఈకొలిపాక శైవులకు ముఖ్యస్థాన మనియు, సుప్రసిద్ధ శైవాచార్యులు నల్గురిలో నొకఁడయిన రేవణ సిద్ధుఁ డీపట్టణముననే జన్మించెననియు, నాకాలమున నీపట్టణమందు జంగములు వాయించెడి కంచుగంటలు విశేషముగా పోతపోయఁబడు చుండెడివనియుఁ బ్రతీతికలదు.

కొలిపాక మాహాత్మ్యము, శుకచరిత్ర నాకు లభింపలేదు భల్లాణచరిత్ర మూఁడాశ్వాసములు కలది. కవి తననుగురించి యీగ్రంథమున నిట్లుఁ జెప్పుకొనియున్నాఁడు.

శివకవులనుతించి శివయోగమునను
గవితావిశేషంబుఁ గరమర్థిబడసి
అరుసించి వీరేశు కల్పించుకొఱకుఁ
బొరిమించు భల్లాణ భూవరుచరితఁ
దెనుఁగున ద్విపదగాఁ దెల్లంబుసేతు
ఘనులుప్రస్తుతిసేయఁ గవిబుధుల్ మెచ్చఁ
బనిపూని శివభక్తిపరులు నుతింప
వినుపింపవలసిన విజ్ఞానపరుఁడఁ
బరమశివాచారభరిత వర్తనుఁడ
గురులింగజంగమ కరుణాన్వితుండ
మరునిభవీరయ్య మల్లమాంబికల
వరపుత్రుఁ డగువాఁడ వంశవర్ధనుఁడ
ఘనమైనచిత్తారు గంగాధరుండ
వినుపింతు నానేర్చువిధమున మెఱసి.

భల్లాణచరిత్రయందలికథ సుప్రసిద్ధమైనది. భల్లాణుఁడను సింధుకటకపురాజు వీరశైవమతమును జేపట్టి శివభక్తుల కేమియడిగిన నది యిచ్చెదనని ప్రతిజ్ఞచేయఁగా నీశ్వరుఁ డాతనిఁ బరీక్షింపఁగోరి జంగమవేషధారియైవచ్చి యానాఁడు విటునితోనుండని వేశ్యనొక్కర్తెను దీసికొనిరమ్మనికోరుటయు, నాపట్టణమందానాఁడు వేశ్యలందఱికడ నీశ్వరుఁడు వేఱువేఱురూపములతో విటుఁడై యుండుటచే జంగము గోరితవేశ్యలభింపకపోఁగా భల్లాణుఁడు తనభార్యనే వేశ్యగా నలంకరింపించి యాతనికర్పింప నీశ్వరుఁ డామెచేతులలో బాలుఁడై పోయి, యాదంపతులకు మోక్ష మొసంగుటయుగల యీకథను కూర్చియుంచి తిమ్మకవి మొదలగువారు పద్యరూపమున రచించియుండిరి.

ఈకవి రచించిన గంగావివాహము శిరువకోడూరునందలి రామేశ్వరస్వామి కంకితముచేయబడినది. ఈమంజరీద్విపదకావ్యమునం దీశ్వ

రునకును, ఏలూరునందు జాలరికన్యయై వెలసిన గంగాదేవికిని జరిగిన పెండ్లికథ వర్ణితమైనది; ఈగంగావివాహమునందుఁ గవి తననుగూర్చి చెప్పికొనిన ద్విపదల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

చిరివకోడూర్వరీక్షేత్రనివాసు
రామేశ్వరునకుఁ గృతిరాజుఁగాఁ జేసి
వినిపింతు మద్వంశవిధ మెట్టిదనిన
జంగమరాయందు సద్గుణోన్నతుఁడు
నగధైర్యుఁడైనట్టి నాగలింగయ్య
తరుణిమణిసోమాంబతనయుఁడై వీర
యకురాణినిజరాణి యగుమల్లమాంబ
పెక్కునోములునోఁచి ప్రియమర్థిఁగనిన
చక్కనితనయులు సద్ధర్మపరులు
మల్లయ్యవీరయ్య మహనీయఘనులు
అతిశాంతు లీముద్దులనుజులతోడ
బుట్టినశ్రేష్ఠుండు పురుషరత్నంబు.
సరసప్రసంగు సద్గోష్ఠితోను
ఘనుఁడైనచిత్తారు గంగాధరుం
విరచితంబుగ నార్యవేదోక్తమైన
యీగంగకల్యాణ మిది యెట్టిదనిన
వినిపింతునీకథ వీరశైవులకు.

ఈకవిచే రచియింపబడిన సిరియాళచరిత్ర రాచవీటివీరభద్రున కీకృతియీయఁబడినది. జంగమవేషధారియగు శివునకు తనకుమారుడైనసిరియాళుని వండిపెట్టిన శివభక్తునికథ యీగ్రంథమున వర్ణితమైనది.

గంగాధరకవి కవిత్వమునందక్కడక్కడ దోషములున్నను, మొత్తముమీఁద నీతనిరచనములు ద్రాక్షాపాకమున బాలురకుసైత

ములను బోధకములై హృదయరంజకముగానుండును. మూఁడాశ్వాసములుగల భల్లాణచరిత్రమునుండి కొన్నిద్విపదల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

జననాథ! నామాట చక్కఁగావినుము
పనికిమాలినదాని జాణిసదాని
సుక్షీణ తెప్పింప నొల్లనుసుమ్ము
గర్వాంధురాలైన కాంతనేనొల్ల
మిక్కిలిపొడవైన మిగులగుజ్జైన
బెక్కుమాటలదైన బీఁకగొట్టైన
ఇచ్ఛయెఱుఁగనిదైన నెడ్డదియైన
మెచ్చనేరనిదైన మెల్లచూపైన
నిడుదపండ్లదియైన నిద్రపోతైనఁ
బడఁపడిగినదైన బడుగుబక్కయైన
చెండిపోతైనఁ దుచ్ఛపులాగుదైనఁ
గండక్రొవ్వినదైన గడుసురాలైనఁ
జిడ్డుతలైనను జెమటకంపైనఁ
దెడ్డునోటిదియైనఁ దిండిపోతైనఁ
జొల్లునోటిదియైన సోమరియైన
నల్లరూపుదియై నాతి నేనొల్ల

---

సేవయెంతైనను జేకొనఁగాని
ఇతనికిమోహంబు యించుక లేదు
బతిమాలినెమ్మన్న బలుకకున్నాఁడు
చలికూటిపై వెన్న సామ్యమైనాఁడు
భువనబాంధవుఁడీకఁ బోడిమువేళయ్యె
విరహములతమకంబు వేసరిపోయె.

---

విరుపాక్షుఁడప్పుఁడు విటరూపుమాని
చల్లమాదేవి హస్తములలోపలను
నెలనాళ్ల బాలుఁడై నిలిచెను శంభుఁ
డంతటనాశంభుఁ డాచల్లమాంబ
యంతరంగముగట్టిగని సోలిసోలి
చంటికివాపోవఁ జనులు చేప్రారె.

--- --- ---

భల్లాణరాయని ప్రమధులలోన
బల్లిదుగాఁజేసి పట్టంబుగట్టి
భల్లాణరాయ భూపాలునిచరిత
చల్లనిమాటల సరసంబుగాను
నాపాలి శ్రీగురునాథుని పేరఁ
బాపసంహరు పేరఁ బరమేశు పేర
విరివిగ శ్రీరాచవీట వెలసిన
పరమాత్మ శ్రీవీరభద్రుని పేర
విరచించితికథ విశ్వంబులోన.

ఈకవి, పదునేడవశతాబ్దివాఁడని తోచుచున్నదని భల్లాణచరిత్రపీఠికాకారులు వ్రాసియున్నారు. కవికాలమును సరిగానిర్ణయించుటకు తగిన యాధారములు దొరకలేదు. కవినివాసము నిజామురాష్ట్రములోని నల్లగొండజిల్లాయందలి చర్లపల్లి యనుగ్రామమనియు, కవివంశజులకీకవికాలమునుండి సరసకవి బిరుదుకలదనియు, పూర్వమీకుటుంబము వారు వెనవెల్లనివాసులనియు, కవికాలము క్రీ.శ. ౧౮౨౩ ప్రాంతమనియు, గోలకొండకవులసంచికలో వ్రాయఁబడియున్నది.



## 421 శ్రీగిరి విరూపాక్ష కవి



ఇతఁడు "ప్రణుతధవళాంగ మానిహృత్పద్మభంగ యమితభవభంగ శ్రీకాళహస్తిలింగ" యనుమకుటముతో నొకసీసపద్య శతకమును రచియించెను. ఈగ్రంథముయొక్క యముద్రితప్రతులు పదునాలు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నవి. అందు పదునాల్గుప్రతులలో గ్రంథకర్తనామము లేదు. రెండుప్రతులలో శతకాంతపద్యమున "పావన శ్రీగిరిపాపవిభుని యాత్మజాతుండ విరుపాక్షయాహ్వాయుండ" అని వ్రాసియున్నది. దానిఁబట్టి గ్రంథకర్త "శ్రీగిరి విరూపాక్షకవి" యని నిశ్చయింపఁబడినది ఈకవి కులగోత్రాదులుగాని, నివాసముగాని తెలియదు కాళహస్తిప్రాంతమువాఁడై యుండవచ్చును. ఈకవితండ్రి పాపవిభుఁడు.

ఈకవి కాలమేదియో తెలియదు. ఈశతక వి లేఖరులలో మువ్వురు తమకాలముల నిచ్చియున్నారు.

౧. "ప్రభవనామ సంవత్సర భాద్రపద బ ౧౩ మంగళవారంవరకు మట్టెగుంట రంగయ్యగారు కైతేపల్లిపేరేశలింగానికి కాళహస్తి శతకము ప్రతిలోనున్నక్రమానను సంపూర్ణంగా వ్రాసియిచ్చెను." ఇది క్రీ. శ. ౧౮౦౭ సంవత్సరం సెప్టెంబరు నెల ౨౭ తేదీ అయినది. ౧౮౬౭ లో వచ్చినది గురువారమయినవి.

౨. "ప్రమాదినామ సం॥ ఆషాఢ శు౩ శుక్రవారంరోజునర్కి హస్తిలింగశతకము సూరపరాజు వెంకన్న సంపూర్ణంగాను ప్రతిలోనున్నక్రమానను వ్రాసినాఁడు." ఇది క్రీ శ ౧౮౧౯ స॥ జూన్ నెల ౨౫వ తేదీ అయినది. ౧౮౭౯ లో వచ్చిన యీతిథి ఆదివారమైనది.

3. పార్థివనామసంవత్సర నిజశ్రావణ శు౧౧ బుధవారంనరికి ప్రతిలో వున్నక్రమాన మూజేటిపర్వేశలింగం యీ హస్తిలింగకశతకం సంపూర్ణంగా వ్రాసెను. ఇది క్రీ. శ. ౧౮౨౫ సం॥ ఆగష్టు నెల ౨౪వ తేదీ అయినది. వీనినిబట్టి చూడగా నీశతకము క్రీ. శ ౧౮౦౦ సంవత్సరమునకుఁబూర్వము రచియింపఁబడిన ట్లెంచఁదగి యున్నది. కావున నీతనిని పదునెనిమిదవశతాబ్దిలోనివానినిగా యెంచవచ్చును

ఈతనిశైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించెదను.

సీ ధర్మంబు తనపాలిదైవమై రక్షించు
సత్యంబు కై పల్యసరణిఁజూపు
శాంతంబు మేనికి సద్భూషణంబగు
పరహితచరితంబు ప్రబలఁజేయు
విమలకీర్తులు జగద్విఖ్యాతి నొందించు
కరుణారసము ధర్మకలితుఁజేయు
పూర్ణవిద్యలు రాజపూజితుఁగాఁజేయు
నీతిమార్గంబున నెగడు సిరులు
ఘనులెయిటువంటి గుణము దెలిసి
మెలఁగ నేర్తురు భక్తితో మిమ్ముఁగొలిచి.

శతకవుల చరిత్ర కారు లీః వి కాలమునుగూర్చి "ఈతని కాలము సరిగఁ దెలియదు. వ్రాఁతప్రతులనుబట్టి క్రీ.శ 1700 కుఁ బూర్వుఁడు కావచ్చును. ఇది ప్రౌనుదొరవారి కాలమునందె ముద్రితమగుటయే కాక 200 సంవత్సరములకిందటే వ్రాసిన తాళపత్రప్రతులు దొరుకు చున్నవి." అని వ్రాసియున్నారు. మచ్చునకై యింకనొకపద్య మిచ్చెదను.

సీ. ధనవంతుఁడై యుక్తదానహీనుం డైన
నరునివర్తనఁజూచి నగును ధనము
తనయునిఁ బ్రేమతోఁ దండ్రిముద్దాడంగఁ
జూచినవ్వును జారసుదతి మదిని
అవని నాయది యని యఱిశంబు గర్వించు
ధారుణీపతిఁజూచి ధరణినగును
వెన్నిచ్చి రణరంగ విముఖుఁడై చనువాని
నవి మృత్యు వెంతయు నవ్వుఁగాన
లోభితనమున నిందకు లోనుగాక
మెలఁగ నేర్చిననరునకుఁ గలుగు శుభము.

## 422 తిరుమలకవి

ఇతడు చిత్రకూటమహాత్మ్యమను యక్షగానమును రచియించెను. ఈకవి బ్రాహ్మణుఁడు; వేంకటాధ్వరికిఁ బుత్రుడు, బాలసరస్వతి సోమయాజికి మనమఁడు. ఇతఁడు మధురనాయకప్రభువై యాంధ్రకవిపండితపోషకుఁడగు విజయరంగచొక్కనాథభూపాలునిచేత బహుమతులనందినవాడై నట్లు చిత్రకూటమహాత్మ్యమందలి యీక్రింది గద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. శ్రీలచే ననుపమలీలచే నెంతయు
నలువొందు ద్వారకానగరమునను
కాంతమై జితవై జయంతమై జిగిమీఱు
మేరుగారు బంగారు మేడ మీఁద

పొందుగాఁ గనుదోయి విందుగాఁ గనుపట్టు
డంబైన కొలువుకూటంబు నందు
కెంపురాసంతన నింపు రాణించు కుం
దనపు గద్దియనుండు దైవరాయ.

తే. రంగకృష్ణముద్దులరాయ వీరరాజ
సుతుఁడు శ్రీవిజయరంగచొక్కనాథావనీంద్రుఁ
డెలమి కోరిన కోరికలిచ్చు దేవ
నీకు మ్రొక్కెద ననవద్యనిగమవేద్య ।

"శ్రీలచేఁ దనరుచు నృపవరనిత్య
లాలితుండయిన బాలసరస్వతి మఖి
సుతముఖ్యుఁడగుచు నిస్తుల కళాప్రౌఢి
నతని మించిన వేంకటాధ్వరి సుతుఁడు
తిర్మలకవి పార్వతీపతి భజన
నిర్మలమతి విష్ణునిత్యసేవకుఁడు
సంగీతసాహిత్య చతురుఁడౌ విజయ
రంగచొక్కావనీరమణుని కృపను
కర్ణభూషణములు కరభూషణములు
స్వర్ణాంబరంబులు సరిపెనల్ తాళి
యను వొందు నందలం బగ్రహారాది
ఘనబహుమానముల్ గాంచిన వాఁడు
వచనచమత్కారవైఖరి మీఱ
రచన సేయఁగను నర్తన యోగ్యముగను
గొనబు మీఱిన చిత్రకూటమహాత్మ్య
మను నాటకము విద్యలార్యాధిగన్న.
కవులెన్న నానిశాకరతారకముగ
నవనీశ్వర సభార్హమై యొప్పుగాఁత

ఈ నాటకమందలి కథ యీక్రింది మాటలలో క్లుప్తముగాఁ జెప్పఁబడినది.

"సర్వేశ్వరుఁడొకనాఁడు ప్రమథగణంబులఁగూడి కొలువుండి వారిని పార్వతిజూడ యడుగ వారలామె చిత్రకూటంబున తిల్లయను పేరును గాంచియున్నదని. అపుడీశ్వరుఁ డాపల్లవాధర నిపుడు చూడక సొంపుసంధిల్లదు. ఆమె నాట్యమున తనవన్నె వాసి ధరణిలోఁ బొగడ వన్నెడఁబాసి యొంటిగాఁ దిల్లవనినిబొందె. ఆవాలుగంటిని తేఁ చుకొంటినని వేటాడునెపంబున నటకువెడలి యట నాలుగు దినంబులుండి పార్వతిని గలిసి తమకుందనపు మేడకు వచ్చుట యిందు వర్ణితము."

ఈకవి నివాసము మధురయని చెప్పనొప్పును. విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. శ. ౧౭౦౪ మొదలు ౧౭౩౧ వఱకును మధురను పాలించినవాఁడు కావునఁ గవియు నప్పటివాఁడనుటకు సందియము లేదు.



## 423 దినవహి ఓబయమంత్రి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఓబయమంత్రికిని చెన్నమాంబకును గుమారుఁడు. ఈకవి గరుడాచలవిలాసమను యక్షగానమును రచియించి గరుడాచల నరసింహునకంకితము చేసెను. ఈక్రింది ద్విపదలలో నీతఁడు నందవరశాసనుఁడనని వ్రాసికొనెను. దీనిని బట్టి యీతడు నందవర గ్రామమునకుఁ గరణమని యూహింపవలసి యున్నది. కాని నందవరములు నాలుగైదు కలవు. అందీతని నందవరమేదియో తెలియదు. ఈతఁడు నందవరీక నియోగియేమోయని సంశయము కలుగుచున్నది.

ఈగరుడాచల విలాసనాటకమునకు చెంచునాటకమని పేరు. ఈ నాటకము చాలా కాలము వీధి నాటకముగా గ్రామములలో ప్రదర్శింపఁబడుచుండెడిది. ఇప్పుడీ ప్రదర్శనము లంతరించిపోయినవి అహోబల నరసింహస్వామి, హిరణ్యకశ్యప వధానంతరము నందొకమారు వేదాద్రిపై విహరించుటకేఁగి యందు చెంచుకన్యను వివాహమాడిన కథయిందు వర్ణితమైనది.

ద్వి. బలువిడి యుక్కుగంబంబున వెడలి
చలమున హేమకశ్యపుఁజీరి యచటఁ
జెలరేఁగి నవనారసింహరూపమున
మెలఁగుచు లక్ష్మీసమేతుఁడై తాను
వేదాచలంబుపై విహరింతు ననుచు
నాఁదటఁ దలపోయ నతిమోదంబునను
బరిచారకులును సంభ్రమలీల వెగడఁ
గరమర్థి విడుదులు గావించి రెలమి.

దర్వు :- చెంచుబలగము నేటి వారిలోఁ జెలియతానూ
మెలఁగుచు చెంచుఁయా బళపతియనంగఁ బ్రసిద్ధికెక్కెన్.

గద్య :- అనుచునా సకలలోకాధీశు పేర
వనజభవామరవందితు పేర

— — ...

సన్నుతి మీఱఁగ సరసు లౌనసఁగ
వన్నెకెక్కిన నందవరశాసనుండు
చిన్నమాంబాగర్భసింధు చంద్రుండు
ఉన్నతకీర్తియు నుజ్వలగుణుఁడు
దినకరతేజుఁడా దినవహి వోబ
ఘనుని యోబయమంత్రి కవివరేణ్యుండు

గరుడేశ్వరుని పాదకమలంబులకును
పరమభక్తిని సమర్పణముగాఁజేసి
విరచించె నీకథ విఖ్యాతి వెలయ
ధరణిలో నాచంద్రతారార్కముగను.

ఈకవి యేకాలమువాఁడో తెలియలేదు. ఈనాటకమునకుఁ బ్రత్యేకత విలేకరులిరువురు తమ కాలముల నిచ్చియున్నారు. ఒకటి సర్వజిన్నామ సం॥ర భాద్రపద బహుళామావాస్యా గురువారం. ఇది క్రీ. శ. ౧౮౨౭ సం॥ సెప్టెంబరు నెల ౨౯వ తేదీ అయినది. రెండవది సౌమ్యనామ సం॥ జ్యేష్ఠ శుద్ధ గురువారము. ౧౮౪౯ లో వచ్చిన సౌమ్య సం॥ జ్యేష్ఠ శుద్ధ చతుర్థి శుక్రవారమయినది. కావున యీ ప్రతి ౧౭౮౯ లో వ్రాసినదై యుండునని తోఁచుచున్నది దీనినిబట్టి కవిపదునెనిమిదవ శతాబ్దియందుఁ బ్రథమార్ధమున నున్నట్లూహింపఁ దగియున్నది.

— o —

## 424 ధూర్జటి వేంకటరాయకవి

ఈతడు పాకనాటి నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడు; భారద్వాజ గోత్రుడు; లింగరాజకవి పుత్రుడు; వేంకటరాయమంత్రికిఁ బౌత్రుఁడు. ఈ వెంకటరాయఁడే కుమార ధూర్జటి. ఇతఁడే కృష్ణ రాయవిజయమును రచించినవాడు. తాత పేరే యీకవికిఁబెట్టబడినది.

ఇతఁడు రత్నావళీ పరిణయమను నాల్గాశ్వాసముల శృంగార ప్రబంధమునురచియించి చేకూరి రామస్వామిమంత్రికంకిత మొనర్చెను.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవి దిగ్గజములలో నొకఁడని ప్రఖ్యాతి గాంచిన ధూర్జటికవి, యీకవి వంశమునకు మూలపురుషుఁడై నట్లీ క్రింది పద్యములో నుతించియున్నాఁడు.

మ. పటుగంగాలహరీతరంగసమశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనున్ బాదవినమ్రకృష్ణవరరాడ్గంభీరకోటీరవి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకుల కర్తన్ భక్తి రంజిల్లఁగన్.

కవితంద్రియైన లింగరాజకవి కాళహస్తి ప్రభువుల ప్రోత్సాహముచేఁ గాళహస్తిమాహాత్మ్యమును రచియించి దామెర వేంకటపతిరాయని కంకితము చేసియున్నాఁడు. లింగరాజకవిని రత్నావళీపరిణయమునందీక్రింది పద్యములో స్తుతించియున్నాఁడు.

మ. ఘనగౌరీశకటాక్షలబ్ధకవితాగాంభీర్యసంతుష్టభూ
జనరాడ్దత్తసువర్ణచేలమణిభూషాగ్రామపల్యంకికా
ఘనదంతావళఘోటకాదిబహుసత్కారప్రతిష్ఠాత్మ్మ మ
జ్జనకున్ ధూర్జటిలింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

కృతిపతియైన చేకూరి రామస్వామిమంత్రి యీకవినిగూర్చి నుడివినవాక్యములుగా రచింపఁబడిన యీక్రిందిపద్యములవలనఁ గవి పండితుఁడై నట్లును, ఉభయభాషాకవిత్వవిశారదుఁడై నట్లును అమరమును పద్యకావ్యముగాఁ జేసినట్లును, ఇంకను శతకములును, దండకములునసేకములు రచించినట్లును దెలియవచ్చుచున్నది.

మ. ననుఁ గాశీశకటాక్షలబ్ధవిలసన్మందారమాకందబృం
దనవీనామృత సంస్కృతాంధ్ర కవితాధారాసుధాంబోధిసం
జనితామేయకథానిధానఘటనాంచద్వాక్యమాధుర్యగుం
భను నంభోరుహమిత్రకాంతినిధిఁ బిల్వంబంచి పల్కెన్ దయన్.

చ. స్థిరముగఁ గాళహస్తిగిరిజేశవరాగతసంస్కృతాంధ్రసుం
దరకవనంబు వ్యాకరణనాటకకావ్యవిచక్షణత్వమున్
గరిమ వహించి భూవరశిఖామణు లెన్నఁ జెలంగితౌర! బం
ధురతనుకాంతి బాలరవిధూర్జటివేంకటరాయసత్కవీ!

మ. అమరం బంతయుఁ బద్యకావ్యముగ భవ్యంబైన యయ్యాంధ్రభా
ష మహాపండితసత్కవివ్రజము మెచ్చన్ సాహితీకౌశల
క్రమ మొప్పన్ దృఢభక్తితోడుతను శ్రీరామాంకితంబై తగన్
రమణీయంబుగఁ జేసినాఁడవు భళీ! ప్రఖ్యాతి వాటిల్లఁగన్.

చ. ఇదియును గాక బాల్యమున నే శతకంబులు దండకమ్ములున్
గుదురుగఁ జేసి భూవరులు ఘోటకహాటకభూషణాదులన్
మదికి ముదం బెసంగ బహుమాన మొసంగఁ బ్రసిద్ధి గాంచితౌ
విదితయశస్సుధాంశుకర! వేంకటరాయకవీంద్రశేఖరా!

ఈతనితండ్రితాతలచారిత్రములను వేఱుగా వ్రాసియున్నాఁడను. (12 సం. 79; 253 పు) ఇక్కవిశేఖరుఁడు హూ. శ. ౧230 ప్రాంతమున నున్నవాఁడు. ఈతఁడు రచించిన రత్నావళీపరిణయకృతిపతియగు చేకూరి రామస్వామిమంత్రి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; వెంకటనారాయణామాత్యు బుచ్చమాంబికలకుఁ బుత్రుఁడు; ఇతఁడు పాటలపురవాసియైనట్లు క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. ధరణి నమ్మేటి చెలువొందె గరుడసింధు
దక్షిణపినాకినీనదీతటనిరూఢ
పాటలపురాధివాసియై ప్రజలు పొగడ
మనసిజనిభుండు! రామయామాత్యవిభుఁడు!

ఈపాటలపురము ''తిరువాపులియూర్'' అనియును, గరుడినది 'గడిలం' అనియు నిప్పుడు పిలువఁబడుచున్నవి. కృతిపతివంశమును

గవి పెక్కుపద్యములలో వ్రాసియున్నాఁడుకాని యందుఁ జారిత్రోప యోగములగు నంశములు లేవు. ఈతని కవిత్వమునం దచ్చటచ్చట వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములు గన్పట్టుచున్నను మృదు మధురపదసంయుతమై ప్రౌఢమై ద్రాక్షాపాకమున మనోహరముగా నున్నది. ఈగ్రంథమింకను ముద్రింపఁబడలేదు. అముద్రితప్రతులు రెండు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారముననున్నవి కవిత్వ శైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. ప్రకటరసాలసాలనవపల్లవఖాదనమోదమేదురో
త్కకలకంఠకంఠరవధూర్వహ మోర్వనిరీతి గుల్క వ
ల్లకిఁ బలికించి మోహనవిలాసము మీఱఁగ తానసంగతిన్
సకలజనంబు లద్భుతరసంబు వహింప నొనర్చె గానమున్. ౧౮

శా. ఈరీతిన్ నవమోహనాంగి మది సెంతన్ భక్తిసంగీతభం
గీరాజన్మధురోక్తికీర్తనలు రక్తిం బాడి మందాకినీ
ధారాధోరణి సన్నుతింప గడఁగెన్ తత్త్వార్థసంధాయకున్
శ్రీరత్నేశ్వరచిత్రశబ్దరచనాశ్రీసూక్తి రంజిల్లగన్. ౧౯

చ పలుమరు శక్తియుక్తి నిజభార్య సుమోత్కరమాలికల్ విని
ర్మలతరతీర్థముల్ సభయమానసయై గొనితెచ్చి యుంచగాఁ
గులగిరికన్యకావిభుని కోమలపాదయుగార్చకపూజనల్
కలితమతిన్ ఘటింపుచును గాఢతపం బొనరించుచున్నెడన్. ౨౦

ఉ. తామరసాక్షి యంత నిజధామము చేరి మనోజ్ఞమైన సు
త్రామమణీఘృణీపరికరరాజతసౌధమునందు దూతికా
స్తోమము గొల్వ నెమ్మదిని తోరపుసిగ్గు జనింప దివ్యలీ
లామహనీయవైఖరి నలంకృతయై చతురత్వపద్ధతిన్. ౨౧

చ. వననిధినీలశుభ్రరుచిభాసితహాలహాలద్వయంబు బు
ట్టిన పురవైరియందు నొకటిన్ గళ ముద్దిడ నందె నైల్యమున్

దనరె ద్వితీయమైన నిను తద్దయు మౌళి ధరించి గంగ చెం
తను నిడి పర్వతాధిపతిఁదన గని మేను తదాది శూలికిన్. ౩౯

మ. వనజాతాసనవృత్తి సోమవిధుబావశ్రీల రంజిల్ల నూ
తనజై వాత్మకతాప్తి చేఁ గువలయోద్యత్పాలనప్రౌఢి స
జ్జనసంతోషము మీఱఁ బూర్ణవసురాజత్వప్రభావంబు జెం
దిన పుత్త్రుం గని వృద్ధిఁ జెందు భువనాధీశుండు నందుండఁగన్ ౩౯

ఉ. భంబుగ దేనఖాళి కరభంబుగ దే తొడ లాస్యమంబుజా
భంబుగ దే సుధారుచినిభంబుగ దే చిఱునవ్వు శాతకుం
భంబుగ దేతనుద్యుతి యిభంబుగ దే గమనంబు హేమకుం
భంబుగ దే స్తనుంగవ నభంబుగ దే నడుమెన్న కన్యకున్. ౪౯

ఉ. అంత ననంగ రేఖ వినయంబునఁ బ్రియఁ బునుమీఱ దేవతా
కాంతసమీపభూమి నొక కాంచనదివ్యపటంబు నిల్పి దు
ర్దాంతపరాక్రమక్రమవిరాజిత తేజుల సర్వధారుణీ
కాంతులఁ జూపి తే నెలొలుకన్ బలికెన్ కలకంఠి మెచ్చగన్, ౪౯

కాశీక్షేత్రమందలి రత్నేశ్వరలింగమాహాత్మ్యమును నాగరాజ కుమారుఁడగు రత్నచూడునకును గంధర్వరాజుతనయ రత్నావళికిని జరిగిన పరిణయకథను, కుమారస్వామి యగస్త్యునకుఁ జెప్పిన ట్లీగ్రంథమున వర్ణింపఁబడినది.



## 425 అడిదము సూరకవి

—::—

ఈతఁడారువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; శుద్ధాంధ్రరామాయణమును రచించిన బాలభాస్కరకవిపుత్త్రుఁడు; చినలత్సనామాత్యపౌత్త్రుఁడు. ఇతఁడు కవిజనరంజనము, ఆంధ్రనామశేషము, ఆంధ్రచంద్రాలోకము, కవిసంశయవిచ్ఛేదము, రామలింగేశశతకము, వేంకటమంత్రిశతకము అను పుస్తకములను రచియించి రామచంద్రపురమందలి రామలింగేశ్వరస్వామి కంకితముచేసియుండెను. ఈయన నివాసము విశాఖపట్టణమందలి చీపురుపల్లెయైనట్లు సూరకవికిని మఱియొక కవికిని జరిగిన సంభాషణరూపకమైన యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. ఊరెయ్యది? చీపురుపలి
పేరో? సూరకవి; యింటిపే? రడిదమువార్
మీరాజో? విజయరామమ
హారా; జతఁడేమిసరసుఁడా? భోజుఁడయా!

బ్ర శ్రీ వీరేశలింగము పంతులుగారాంధ్రకవుల చరిత్రములో "ఇతనిచే రచింపఁబడిన గ్రంథములనుబట్టి కవి గోదావరి మండలములోనివాఁడైనట్లు కనఁబడుచున్నాఁడు. గాని యితఁడు విజయనగరసంస్థానములో శ్రీ పూసపాటి విజయరామరాజుగారి కాలములో నుండినట్లు తద్రచితములైన చాటుపద్యములు మున్నగువానివలనఁ దెలియవచ్చుచున్నది" అని వ్రాసియున్నారు. గోదావరి మండలములోనియొక తాలూకాకు ముఖ్యపట్టణమై రామచంద్రపురమను నొక గ్రామముండటవలనను, నతఁడొకప్పుడు కాకర్లపూడియందు గృహనామము

గల క్షత్రియప్రభువులకు నివాసస్థానమైయుండుటచేతను, కవి రచించిన రామలింగేశ శతకమున "రామచంద్రపురవాస! రామలింగేశ" యని చెప్పియుండుట మూలమునను, బంతులుగారి కవిని గోదావరి మండలవాసిగా ననుమానించియుందురు. కాని యది సత్యముకాదు. సూరకవి వంశీయులగు, అడిదము రామారావు పంతులు M.A., గారి కవి చారిత్రము నొక గ్రంథముగా వ్రాసియున్నారు. అందు కవి నివాసము చీపురుపల్లెయనియు, దానికి సమీపమున రామచంద్రపుర మను గ్రామమొకటి యాకాలమున నుండెడిదనియు దానినిపుడు గలి విందాడ యని పిలుచుచున్నారనియు నందు శ్రీరామలింగేశ్వరాలయ మున్నదనియు, నాదేవునకే సూరకవి రచించిన గ్రంథములంకితము సేయఁబడినవనియు నందుఁ జెప్పఁబడినది.

సూరకవి నాటికి అడిదము వారిరువదిమూఁడు తరములనుండి కవులుగా నున్నారనియు, నందుఁ బదునాలుగు తరములు నరపతుల యొద్దను తొమ్మిదితరములు కళింగాధిపులయొద్దను జెల్లినవనియు సూర కవి రచించిన యీక్రింది చాటుధారలోఁ జెప్పఁబడినది.

చ. ఇరువదిమూఁడు పూరుషము లిప్పటి కయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతులెల్ల మెచ్చఁ బదునాల్గుతరంబులు మించుఁ బిమ్మటన్
వెరవగు జీవనస్థితి లభించుట తొమ్మిదియయ్యెఁ బూరుషాం
తరము లు నిక్క-ళింగవసుధాధిపు చెంగట నాశ్రయించుటల్.

సూరకవి యీపద్యమును క్రీ. శ. ౧౭౫౦ సంవత్సరప్రాంతమునఁ జెప్పి యున్నాఁడనియుఁ దరమునకు ముప్పది సంవత్సరములు సామాన్యమైన లెక్క యని యుఁ దలంచితిమేని, క్రీ. శ. ౧౫౦౦ సంవత్సర ప్రాంతమున నడిదమువారు కళింగదేశప్రభువుల నాశ్రయించియుందురనియు నంతకు పూర్వము పదునాల్గుతరములకవులు నరపతులకడనుండిరనియుఁ దలంప వలసియున్నది. ఈనరపతి శబ్దము సామాన్యార్థమునగాక విశేషార్థ

ముసఁబ్రయోగించి యున్నాఁడు. నరపతులనుగూర్చి అనితల్లికలు చేయుశాసనమునందిట్లున్నది.

"గజపతిరుత్కళనాథః పాశ్చాత్యాధీశ్వరోఽశ్వపతిః
తాభ్యాంనరపతిరధికః ప్రతాపరుద్రోయతస్త్రిలింగేశః"

ఉత్కళ (ఓఢ్ర) దేశాధీశ్వరుఁడు గజపతియనియు. తురుష్కరాజు అశ్వపతియనియు, వారికంటె నధికుఁడయిన త్రిలింగాధీశుఁడగు ప్రతాపరుద్రుఁడు నరపతియనియు నిందుఁజెప్పఁబడినది. ఆబిరుదములు వారికి వారివారి సైన్యవిశేషములనుబట్టియనఁగా, చతురంగములలో గజములెక్కువగానుండుటచే నుత్కళరాజులకు గజపతులనియు, అశ్వబలమధికముగానుండుటచేఁ దురుష్కుల కశ్వపతులనియుఁ గాల్బలమతిశయించియుండుటచేఁ ద్రిలింగాధీశులకు నరపతులనియు బిరుదము లేర్పడియున్నవి. క్రీ. శ. ౧౪౦౦వ సంవత్సరమునకుఁ బూర్వమీ యడిదమువారు నరపతులవద్దనుండెడివారు. ఆకాల మించుమించుగ నాల్గువందలసంవత్సరములనుకొనినచో క్రీ. శ. ౧౦౦౦వ సంవత్సరము మొదలు, అడిదము వారాంధ్రరాజులవద్దనున్నట్లు తేలినది. అనఁగా ఓరుగల్లును పరిపాలించిన గణపతిదేవుఁడు మొదలుగా రెండవ ప్రతాపరుద్రుని యనంతరమువఱకును కాకతీయప్రభువులవద్దనుండిరనియు, ప్రతాపరుద్రుని పరిపాలనము క్రీ. శ. ౧౩౩౦ ప్రాంతముతో నంతమయినందున, నప్పటినుంచి పైనచెప్పిన ౧౪౦౦ ప్రాంతమువఱకును, ఆంధ్రదేశమును బరిపాలించిన యితరరాజుల యొద్దనుండిరో, లేక యెవ్వరియొద్దను నుండక స్వతంత్రముగ జీవించిరో కాలముగడపి యుందురని యూహింపవలసియున్నది.

పూసపాటివారు మొదటినుండియు, కళింగాధిపులు కారు. సూరకవినాటికి, పూసపాటివారు విజయనగరమున ప్రభువులై యుండుటను, విజయనగరము కళింగదేశములోనిదగుటచు, సూరకవినాఁడు

విజయనగరమును పాలించుచున్న విజయనగరప్రభువగు విజయరామ గజపతి, కళింగాధిపతియని పేరువడసియుండుటనుబట్టియు, సూరకవి, "తొమ్మిదియయ్యెబూరుపాంతరములు నిక్క-లింగవసుధాధిపుచెంగట నాశ్రయించుటల్" అని చెప్పియున్నాడు. విజయరామగజపతి, కళింగాధిపతి బిరుదమును కలిగియున్నట్లు కూర్మపురాణకృత్యాదియందలి యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది

విజయరామగజపతియే కాకుండ, నీపూసపాటివారిలో మరి కొందఱుకూడ నింతకుఁబూర్వము కళింగాధిపతులమని యనిపించు కొన్నవారు కలరు. కాని యింతకుపూర్వమీశబ్దము పూసపాటివారి యందు రూఢియైయున్నట్లు కన్పింపదు.

"పూసపాటితమ్మిరాజుగారు గోలకొండలో సరదారుగానుండి, శ్రీకాకుళమునకు వచ్చి, శ్రీకాకుళమునకు ఫౌజుదారుగానుండిన పేరు మహమ్మదుఖానువలన, ౧౭౫౨ సంవత్సరములో కుమిలిభోగాపురపు తాలూకాలను గుత్తకుపుచ్చుకొని పాలనము చేయనారంభించెను. ఈయనపుత్త్రుఁడైన సీతారామచంద్రరాజుగారు మరికొన్ని తాలూకాలనుగూడ కవులునకు పుచ్చుకొని పర్లాకిమిడీ సంస్థానాధిపతియైన గజపతిదేవుతో మైత్రిసంపాదించి, ౧౫౫ గుఱ్ఱపురౌతులతోను, ౪౫౦ కాల్బలముతోను పోట్నూరు జయించి కళింగరాజని పేరు వడసి యాయూరునివాస మేర్పరచుకొని ప్రబలుఁడై యుండెను" అనిదము సూరకవిచరిత్ర.

ఈవాక్యములనుబట్టి చూడఁగా బూసపాటివారికిఁ గళింగదేశ సంబంధము క్రీ. శ. ౧౭౫౦ సంవత్సరమునుండిమాత్రమే కలిగినట్లు తెలియుచున్నది.

సూరకవిచరిత్రకుఁ బీఠికవ్రాసిన బుర్రా శేషగిరిరావుపంతులు గారు, పీఠికలో "ఈపూసపాటివారు కళింగదేశమునకువచ్చినప్పుడు

వీరిలో నీ ప్రాంతమునకు వచ్చిననియోగికుటుంబములలో నీయడిదము వారు కవిత్వమునకును మాబు రావారు రాజకార్యనిర్వహణదక్షత కును ప్రసిద్ధులు. ఈ రెండుకుటుంబములకును, నాటినుండియు బాంధ వ్యము కలదు. వీరిజ్ఞాతులీ కళింగ రాజ్యమునదప్ప, యాంధ్రమండలం దితరస్థలములయందంతరించిపోయిరి" అని వ్రాసియున్నారు.

ఈవాక్యములనుబట్టి అడిదమువారు క్రీ. శ. ౧౬౫౦ సంవత్సర ప్రాంతమునం గళింగదేశమునకు వచ్చినట్లు తేలుచున్నది. కాని యిందుల కొక బాధకము గన్పట్టుచున్నది. సూరకవిపూర్వుఁడైన నారప్పకు భూపాల రేగయను గ్రామమున కరిణీకమును, మిరాశియీనా మును పుట్టఁబడినవి. ఆనారప్పవంశీయులును గ్రామకరణములునైన నారాయణప్ప సన్యాసిరాజువగయిరాలు క్రీ. శ. ౧౮౬౨వ సంవత్సర ములో, ఈనామువులవిచారణ చేయుటకుగాను దొరతనమువారిచే, ఈనాముకమీషనరుగా నియమింపఁబడిన జి. యన్. టైలరుదొరగారి యొద్ద నీయీనామునుగూర్చి యొక స్టేటుమెంటును దాఖలు చేసియుండిరి. అందిట్లున్నది. "యీయీనాం సుమారు 300 సంవత్సరముల క్రింద ఉన్నదుదార్కు (అడిదంనారప్పకు) మజ్కూరుమిరాశీపని చూడఁగలం దులకు శ్రీయఱ్ఱకృష్ణందేవు, శ్రీనల్లకృష్ణందేవు మహారాజులుంగార్లు మజ్కూరులో కొంతమాన్యం దయచేయించినారు". దీనినిబట్టి చూడఁగా నీయీనాము క్రీ. శ. ౧౫౬౨ ప్రాంతమున నియ్యఁబడినట్లు తేలినది. అట్లయినచో నడిదమువారు పైనఁజెప్పినట్లు క్రీ.శ. ౧౬౫౦ ప్రాంతమునగాక నంతకుఁబూర్వమే, అనఁగా క్రీ.శ. ౧౫౫౦ ప్రాంత మున నే కళింగదేశమునకు వచ్చినట్లూహింపఁదగియున్నది. అయితే మూఁడువందల సంవత్సరములనునది యించుమించుగాఁ జెప్పఁబడిన సంఖ్యయనియు, నది రెండువందలైనఁ గావచ్చుననియు ననవచ్చును. కాని సామాన్యముగాఁ గరణములిచ్చు లెక్కలలో నంత తేడా యుండదు. పైన చెప్పఁబడిన స్టేటుమెంటును నాధారించుచు, రామా

రాపుపంతులుగారు సూరకవిచరిత్రములో "ఈవంశజులచే మూలపురుషుఁడుగ నెన్నఁబడు నడిదమునారప్పకు శ్రీవిజయనగరసంస్థాన ప్రభువులలో నొకరగు కృష్ణమరాజు మహారాజులుంగారు రేగయను గ్రామమునఁ గరణికముచేయుటకుఁ గొంతమాన్యమును దయచేసిరి" అని వ్రాసియున్నారు.

ఇందుఁ గొంతపొరపాటున్నది యనిదోఁచుచున్నది క్రీ. శ. ౧౭౧౨ సంవత్సరమునుండిగాని విజయనగర సంస్థానమను పేరు లేదు. విజయనగరసంస్థాన ప్రభువులలో కృష్ణమరాజు మహారాజులుంగారు గన్పట్టరు. (పూసపాటితమ్మమహీపాలుని చారిత్రములో నిచ్చిన వంశవృక్షమునుజూఁడుడు.) క్రీ. శ. ౧౫౬౦ ప్రాంతమున కృష్ణంరాజుగారొకరున్నారు. కాని యాయనకు "యెఱ్ఱ"అను విశేషణము లేదు. కరణములిచ్చిన స్టేటుమెంటులోని పేర్లనుబట్టి చూఁడగా నవి యుత్కళదేశ ప్రభువులనామములవలె గన్పట్టుచున్నవి. ఒరిస్సాదేశ చక్రవర్తులలోఁగూడ నీపేరులుకలవారున్నట్లు కన్పట్టదు. కాని వీరు చిన్నసంస్థానాధిపతులై, ఒరిస్సాదేశాధిపతులసామంతులైన యుత్కళ ప్రభువులై యుందురని తలంపవలసియున్నది. అడిదము రామనకవి వ్రాసిన చెరువుమీదిపద్యములలోదిగూడ "నల్లకృష్ణతమానాయకాగ్రేసరుండు డెఱ్ఱకృష్ణక్ష్మాతలేంద్రులచట గరణికధర్మంబుఁగల్పించి మాన్యంబుదయచేసి రదిమాస్వకంబు" మాకు అనివ్రాసియున్నారు పాఠకులకు సులభముగా బోధపడుటకై అడిదమువారివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను. సూరకవినివిడచి తొమ్మిదితరములును సూరకవి బదియవతరముగా నిందుచూపడమయినది

నీలాద్రికవి. (1) (1450-1510)

తెలియదు. (2) (1480-1540)

తెలియదు. (3) (1510-1570)

తెలియదు (4) (1540-1600)

తెలియదు (5) (1570-1630)

తెలియదు (6) (1600-1660)

నారప్ప. (7) (1630 1690)

(1660-1720 (8) చినలత్సన్న — కిత్తప్ప — నీలాద్రి

(9) బాలభాస్కరుఁడు (1690-1750)

(10 సూరకవి (1720 1780)

తొమ్మిదవ పదియవ పురుషుల కాలములను రామారావుపంతులుగారిచ్చియుండిరి. ఆమార్గముననే దక్కినవారి కాలములను నేనిచ్చియుంటిని. ఈవంశవృక్షమునందాఱవ పురుషుఁడైన నారప్ప మిరాశి యీనాం సనదుదారని రామారావుపంతులుగారి యభిప్రాయము. తాత పేరు మనుమనకు పెట్టునాచారముండుటచే నాల్గవపురుషుని పేరు కూడ నారప్పయైయుండుననియు, నాతఁడే సనదుదారనియు నాతని కాలము కరణములు స్టేటుమెంటునిచ్చునప్పటికి ౩౦౦ సంవత్సరములై యుండుటచే వారుచెప్పినది సత్యమనియు నేనభిప్రాయపడుచున్నాఁడను. నీలాద్రికవి పూసపాటి రాచిరాజునొద్దనో, ఆతనికుమారుఁడైన తమ్మిరాజునొద్దనో, కవిగను, దండనాయకుఁడుగనుండెనని రామా వు

పంతులుగారును, శేషగిరిరావుపంతులుగారును నంగీకరించుచున్నారు. పై వంశవృక్షమున నీలాద్రికవికి నేనిచ్చినకాలమును, రాచిరాజు, తిమ్మిరాజు అనువారలకాలములును స్వల్పభేదముతో సరిపోయినవి. ఈసందర్భమున నీలాద్రికవిచారిత్రమునను, పూసపాటితమ్మభూపాలుని చారిత్రమునను నేనువ్రాసినవిషయములను పాఠకులు చదువవలయును. నీలాద్రికవియో ఆతనికుమారుఁడో, పూసపాటివారితోఁ గలిసి, ౧౫౦౦ సంవత్సరప్రాంతమున గళింగదేశమునకువచ్చి యిచ్చట నివాసమేర్పరచుకొని క్రమముగాఁ గరణికములను, భూములను సంపాదించియుందురు. పూసపాటివారుకూడ ఆకాలముననే కళింగదేశమునకువచ్చి గజపతులయొద్ద కొంతకాలము సరదార్లుగానుండి, గజపతులప్రభావము తగ్గి తురుష్కులప్రభావము హెచ్చినప్పుడు వారియొద్ద కవులునకు పుచ్చుకొని క్రమక్రమముగా ప్రభువులై కళింగాధిపతులై యుండిరని తలంపవచ్చును ఈవిషయమునుగూర్చి పూసపాటి తమ్మభూపాలుని చారిత్రమున మఱికొంతవ్రాసియున్నాఁడను.

అడిదమువారిరువదిమూఁడుతరములనుండి కవులై యున్నను, ఇరువదితరములవారు రచియించిన గ్రంథనామములైనను మనకుఁ దెలియుటలేదు. గ్రంథములు లభింపకపోయినను, నీలాద్రికవి రణరంగవిజయమును రచియించినట్లును, బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణమును రచించినట్లును వినుచున్నాము.

సూరకవికవిత్వము ప్రౌఢమై యలంకారశోభితమై మనోహరముగా నుండును. ఈతఁడు రచించిన కవిజనరంజనము మూఁడాశ్వాసములుగల శృంగారప్రబంధము. ఇందు హరిశ్చంద్రసార్వభౌమునకును, ఉశీనరమహారాజుకుమార్తెయగు చంద్రమతీదేవికిని జరిగిన పరిణయవృత్తాంతము వర్ణితమైనది. కూచిమంచి తిమ్మకవి రసికజనమనోభిరామమని పేరిడినట్లు సూరకవి తనగ్రంథమునకు, కథను

సూచించునామమిడక, కవులకు మనోహరముగా నుండునది యని యర్థమొసంగు కవిజనమనోరంజనమని పేరిడినాడు. ఇందలి కవితా శైలి తెలియుటకై కొన్ని పద్యముల నీక్రిందనిచ్చుచున్నాఁడను. ఈ గ్రంథము చిన్నదైనను, దీనియందలి గుణములను గ్రహించి పండితులు దీనికి పిల్లవసుచరిత్రమని పేరిడియున్నారు.

ఉ కన్నులచంచలత్వమును గబ్బిచను గవ కర్కశత్వము
న్నెన్నడ మాంద్యముం గురులనెక్కొను వక్రత కౌను కార్శ్యము
న్నన్నుతికెక్కు నానచలసంపద బోఁటి కటి న్ధరించుట
న్వన్నియ కెక్కు వే యవగుణంబులు మిక్కిలి కల్గియున్నెడన్ ౧౪

శా. శయ్యాదంభమునన్ మారాంతకుఁడు; భూపాకైతవస్ఫూర్తి చే
నయ్యార్యాన్వరనుణుండు; దాల్చిరిభుజంగాధీశుల న్నీయసా
హాయ్యప్రస్ఫుటధాటి కోర్వకనుచో నజ్ఞాస్యలాయోర్చువా
రయ్యా! గంధసమీరప్రోవగదవయ్యా యీకురంగేక్షణన్.

శా. కాంతారత్నకమాగమంబుచు నెద న్గాంక్షించు నే తెంచుఁడుం
జెంతం జేరఁగఁ గోరుఁ జేరుడుఁ గుచాశ్లేషాప్తిఁ గాంక్షించుఁగా
నంతం దత్కళలంటఁ గోరు ఫలతృప్తాత్మత్వ మూర్వీపథూ
కాంతా నర్హానటంచుఁ బల్కు స్మృతివాక్యస్ఫూర్తి
సార్థంబుగన్ ౩౪

గీ. ఇంతి సౌందర్యరేఖాదిదృక్షచేత
నెపుడు తెర వఁతురను, వంచినపుడు గోరు
నిమిషపరికల్పితాంతరాయము విదిర్ప
భూమిపతులందు వాంఛాప్రపూర్తి గలదె. ౩౪

పైఁడిపాటి లక్ష్మణకవి రచితమైన యాంధ్రనామ సంగ్రహము నందు చేరని కొన్ని పదములనుజేర్చి యీకవి యాంధ్రనామశేషమను నొక చిన్ననిఘంటువును రచించి రామచంద్రపురమండలి రామలి గే

శ్వరునకుఁ గృతి యొసంగినట్లు కవి యీక్రింది పద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

ఆ వె ఆంధ్రనామసంగ్రహమునందుఁ జెప్పని
కొన్ని తెలుఁగుమాటలన్ని కూర్చి
యాంధ్రనామశేషమను పేరఁ జెప్పెదఁ
దీనిఁ జిత్తగింపు దేవదేవ !

కం తెలుఁగుంగచ్చపు మర్మము
తెలుఁగు కవీంద్రులకుఁ దేటతెల్లముగాఁగన్
దెలియఁగ నడిదము సూరయ
చెలువారఁగ నాంధ్రనామశేషము చెప్పెన్

కం. శ్రీగౌరీప్రియవల్లభ !
రాగద్వేషాదిరహితరమ్యచరిత్రా !
యోగిధ్యేయపదాంబుజ !
భోగివలయ రామచంద్రపుర వరనిలయా !

కవిత్వశైలిచూపుటకై లక్షణగ్రంథములనుండియు నిఘంటువుల నుండియుఁ బద్యములను గైకొనుట న్యాయముగాకపోయినను నీతని గ్రంథములనుండి రెండేసి పద్యములను ఉదాహరించుచున్నాఁడను.

క పొలయలుక యనఁగ నెయ్యఁపు
టలుకయనం బ్రణయకలహ మలరారుఁ గుచం
బులకొప్పు నామములు గు
బ్బలనంగఁ జన్నులనఁగఁ బాలిండ్లనఁగన్

క మొనయన సైన్యము పేరగు
మొన యనఁగా నగ్రభాగమునకు దేరా
దొనయనఁ దూణీరంబగు
దొనయన నవసానమునకుఁదొడరును బేరై

ఈతఁడు రచించిన కవిసంశయవిచ్ఛేదము సార్థకనామమై యొప్పారుచున్నది. ఈతఁడిది లక్షణగ్రంథముగా వ్రాయనుద్దేశించి వ్రాసినదికాదు. రేఫశకటరేఫలు, అప్రయోగములేమోయని కవులకు భ్రమకలిగించు శబ్దరూపములు, తద్భవ శబ్దరూపములు మొదలగువిషయములనిందు సమకూర్చినాఁడు. లక్ష్యములు చాల భాగము భారతమునుండి గ్రహింపఁబడినది. తన తండ్రినిగూర్చియుఁ, దననుగూర్చియుఁ గ్రంథమునుగూర్చియుఁ గవి సంశయవిచ్ఛేదములో వ్రాసినపద్యముల నీక్రిందనిచ్చుచున్నాఁడను.

క చినలచ్చమంత్రితనయుని
ననఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘునజాంఘికశవనధాటి గలిగిన మేటిన్

క. పుడమిగల రసికులెల్లఁ బొ
గడఁ గవిజనరంజనకృతిఁ గావించితి నే
నడిదము సూరకవీంద్రుఁడ
మృడపద పంకజరిరంసుమృదుమానసుఁడన్

గీ. ఆంధ్రమర్మంబు దెలియంగ ననువు పడునె
ప్రకట సంస్కృతరచితసూత్రములచేత
నవని బాణిని ఘటితసూత్రార్థసరణి
తెనుఁగుటీకలచేత సాధింప నగునె

వ అనియిట్లు శ్లాఘాలంఘనజాంఘిక సుకవితామర్మనిరూపణ
హృదయుఁడనై.

క. కవిజనసంజీవనిలోఁ
దలిలిన పద్ధతులు మఱియితరలక్షణల
క్ష్యవినిర్దిష్టగతుల్ చె
ప్పవలయు నని వేఱ యొక్క పద్ధతిచేతన్

క. ప్రియమందఁగఁ గవులు కవి
త్రయ సుకవిత్వానుసరణిఁ దప్పక కవిసం
శయ విచ్ఛేదనకును నా
హ్వాయమిడి లక్షణ మొనర్తు నార్యులు మెచ్చన్

మచ్చు పద్యములు :

తే. కొనవిడుచుపల్కునకును జేకూరును బూర్వ
వర్ణదీర్ఘంబు మధ్యమవర్ణలోప
మలరుచావక పోవకన్ బలుకులకును
మధ్యమాక్షరలోపంబు మదనమథన

క ఒక్కకవి లేదట చును
వక్కాణించుటను జెప్పవలసెను నాకన్
డక్కెను దక్కెననంజను
దక్కెను జయలక్ష్మి పురవిదారి కనంగన్.

ఆ.వె సరసఁగొన్ని గలవుజాత్యేక వచనముల్
వానిరీతు వెలుఁగవలయుఁగవులు
హారు నిసృత్త కేళియత్రైత్తిచూచిరి
యఖిలదివిజవర్యులన్నయట్లు

తే. పాలుఁ బల్లుఁడుతమ్ముఁడన్ బదములోని
దగసమాసంబులై నడుత్వములు బాయు
నల్లువాండన పాలువాండనఁగఁదమ్మ
గుఱ్ఱలనఁదెన్గుపదములుకొన్ని యిట్లు.

ఈకవిరచించిన చంద్రాలోకమునందు నూఱు అలంకారము లను గూర్చి చెప్పబడినది ఇందు.

గీ. బాలురకునైన దెలియగా గాళిదాసు
మును రచించెఁ జంద్రాలోకమును ద్రిలింగ

భాషఁ జేసితి నీకృప భవ్యముగను
దీనిఁ గరుణించి గైకొమ్ము దేవదేవ.

అని సూరకవి చెప్పియున్నాఁడు. కాని యీచంద్రాలోకము నకుఁబీఠిక వివరణమును వ్రాసిన 'అక్కిరాజు ఉమాకాన్త' పండితుఁడు కాళిదాసు చంద్రాలోకమును రచింపనే లేదనియు, చంద్రాలోకకర్త మహాదేవునకును సుమిత్రకును జన్మించిన జయదేవుఁడనియు జయదేవుని చంద్రాలోకమునందలి వైదవమయూఖము నందుఁజెప్పఁబడిన యర్థాలంకారములను గైకొని 'అయ్యప్పదీక్షితులవారు కువలయానందమను పేరనొక యలంకారగ్రంథమును జేసెననియు, ఆకువలయానందముననుసరించి యేసూరకవి యాంధ్రచంద్రాలోకమును రచియించె ననియు, సోదాహరణముగ బీఠికలో నిర్ధారణమొనర్చియు అడిదము రామారావు పంతులుగారు కువలయానందమునుగూడ సాహాయ్యము గాఁగైకొనినను సూరకవి జయదేవకృతచంద్రాలోకమునే యాంధ్రీకరించెనని సూరకవిచరిత్రమున వ్రాసియున్నారు.

సూరకవి "బాలురకు నైనఁదెలియవలయు"నని యేయత్యంత సులభశైలిలో నీగ్రంథమును రచించినమాట వాస్తవము. కాని యిది శాస్త్ర విషయము కావున గురుసాహాయ్యముండినగాని, సామాన్యులకు స్వతంత్రముగా దెలిసికొనుటకు సాధ్యమగునది కాదు. మాతృభాషయందు శాస్త్రముండవలయుననుగోర్కె యే సూరకవి నీగ్రంథ రచనకుఁబురికొల్పియుండును శాస్త్రవిషయము కావున నెట్లయిన నీయలంకార రహస్యములను దెలిసికొనుటకు గురుసాహాయ్యము సామాన్యులకవసరమనుట నిశ్చయము. చంద్రాలోకమును రచించిన వారింకను ఇటీవల కొందఱుకలరు. ఇందలి కొన్ని పద్యములనిటనుదాహరించుచున్నాఁడను.

గీ. అదియకద యుక్తిపూర్వకమయ్యెనేని
హేత్వపహ్నుతియనఁగను గృతులఁ జేప్పు

గాఁడుశశి తీవ్రుఁడర్కుఁడు లేఁడు రాత్రి
వనధిగర్భసముద్భితౌర్వంబితండు.

గీ. భ్రాజిలుఁ బరస్పరోపకారముగఁ జెప్ప
నదికృతులయందు నన్యోన్యమనెడు పేర
రాత్రి శశిచేఁ బ్రకాశించు రాత్రిచేత
శశిప్రకాశించు నన్నట్టిచందమునను.

గీ. సాధనీయార్థసిద్ధికి సాధనంబు
కావ్యలింగమనంగఁ బ్రఖ్యాతికెక్కు
మనసిజుఁడు గెల్వఁబడియెడు మన్మనంబు
లో నిలచియున్నవాఁడుత్రిలోచనుండు.

గీ. వర్ణ్యముపమాన ముపమానవాచకము స
మానధర్మము సంఘటింపనగు నుపమ
హంసిచందాన నీకీర్తి యబ్జనాభ!
యభ్రగంగావగాహనం బాచరించు

గీ. కార్యసుకరతవేఱొక్క కారణాప్తి
వలనఁ గలుగ సమాధినానలరుఁ గృతులఁ
గులటవాంఛను బొందె నర్కుఁడు నుగ్రింగ
వనెడుచందానశైలకన్యాసహాయ!

ఈకవి రామలింగేశ శతకము నీతిదాయకమైనది. ఈతఁడు రాజాశ్రితుఁడైనను, రాజులొనర్చెడి యకార్యములను నిరసించుచు నిందఁ బద్యములను వ్రాసి కవులనిరంకుశులను సూక్తిని బ్రదర్శించిన వాఁడు. విజయనగరరాజ్యమును గొన్నాళ్లు ప్రభుసోదరుఁడగు సీతారామరాజు పరిపాలించుచు బ్రజలను బీడించుచుండుటనుజూచి సహింపలేక యీకవి శతకమున నిట్టిపద్యములను వ్రాసెనందురు ఈ శతకమందలి మూడు పద్యములనిట నుదహరించుచున్నాఁను

సీ. మాన్య బలీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యము ల్చెఱుప సామంతు లంద
తొండిన యూళ్ళగో డెత్తేఁగింపఁ డెవ్వఁడు
పండిన యూళ్లెన్న పతిభువు లంద
ఱిలేఁడు పేద యటంచు నెత్తేఁగింపఁ డెవ్వఁడు
గలవాని సిరి యెంచఁగలరు చాలఁ
దనయాలి చీఁకటిత ప్పెన్నఁ డెవ్వఁడు
బెరకాంత ఱంకెన్నఁ బెద్ద లంద

తే. రిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెఁ గాక దుర్నయుల ననఁగ
నేమిపనియున్న యదిసక్కపీందు త్రిలకును
రామలింగేశ రామచంద్రపురవాస.

సీ. పదుగు రు కోతి వెంబడి సంచరింపరే
వాహకుల్లేరె శవంబులకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్
కలిమి గల్గదె వారకామినులకుఁ
బులి గోవుఁ జంపి నక్కలను బోషింపదే
స్థూలకాయము లేదె దున్నలకును
బుప్పిపంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట
వేణుధరుం డెద్దు వెంటరాడె

తే. న్యాయపద్ధతి నడువని యవనిపతికి
నెన్నిచిన్నెలు గలిగి న నెందుకొఱకు
నంతమాత్రఁ జూడవలయు నాయన్యసుఖము ... రామ ...

సీ. భయమేల కొండంత పగతుఁడు నాకున్న
మేరువు వంచిన మేటిగలుగ
నాకేల శోకసంతాపంబునను గుంద
శీతాంశుమౌళి నా చెంత నిలువఁ
దస్కరభీతికిఁ దల్లడిల్లఁగ నేల
ప్రమథులతో శూలపాణి నిలువ
నగ్నిభీతికి నాకు నళుకుఁజెప్పదఁగ నేల
గంగాధరుండు నాకడ వసింప

తే. ననుచు నెంతటి కెంతటి కలుకులేక
నమ్మియుంటిని నీప్రాపు నామనమున
జాగరూకుఁడవై నన్ను సాఁకుమయ్య..రామ ..

సూరకవి యాశుకత్వము నందతి ప్రజ్ఞావంతుఁడును, ఇట్టి కవిత్వమునందతిసమర్థుఁడునై నట్లీతఁడు రచించిన యీక్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

చ. గడియకు నూఱుపద్యములు గంటములేక రచింతుఁ దిట్టఁగా
దొడఁగితినా పతాలుమని తూలిపడున్ గులశైలరాజముల్
విడువ కనుగ్రహించి నిరుపేద ధనాధిపతుల్యుఁ జేతు నే
నడిదము వాఁడ సూరనసమాఖ్యుఁడ నాకొకరుండు సాటియే.

ఈతని యాశుకవిత్వప్రజ్ఞనుగూర్చియు, నిగ్రహానుగ్రహ సమర్థతనుగూర్చి యనేక కథలు కలవు. వానినన్నిటినిట వ్రాసినచో నది యొక పెద్దగ్రంథమగును. గావున నందు గొన్నిటినిమాత్రమిూ క్రిందనుదహరించుచున్నాఁడను.

పాలకొండసంస్థానమున కేఁగి రాజదర్శనమునకొఱ కెంత ప్రయత్నించినను కాకపోఁగా నప్పుడు చెప్పినవి —

శా. రాజా జారుఁడు, మంత్రి నిర్దయుఁడు, నీరాష్ట్రంబులో పెద్దలా
కోజుల్, కొండలు, జీవహింసకును సంకోచింప రెవ్వారికిన్
దాజీమీరాయరు; పాలకొండపురిలో దాక్షిణ్యశూన్యత్వ మీ
పాజీపట్టణ మేలవచ్చితిని నాపాపంబు సర్వేశ్వరా!

మ. నరసింగుండను, వెంకపాత్రుఁడను, కృష్ణాపాత్రుఁడున్, నాయుఁడన్
శరభాపాత్రుఁడు, పాలకొండ ధరణీసామ్రాజ్య ధౌరేయులై
ధర వర్థిల్లెడు రామభద్రనృపునాస్థానంబునన్ బంచముల్
చిరకాలంబుగ వీరి వెంటఁ దిరుగన్, ఛీ! ఛీ! మనం బొప్పునే!

ఆ గ్రామమున నేయుండు దేవాంగుఁడగు బత్తుల అయ్యన్న కవినాదరించి సన్మానించిన, నానందించి యాతనిపైఁ జెప్పిన పద్యములు:

క. మూఁడేఁబదు లెవ రుండరు
మూఢులు నది గాన లేరు ముల్లోకములన్
వాడుక పడవలె మనుజుఁడు
వేడుకతో బత్తులయ్య విసఁగదవయ్యా!

క. ఇచ్చెడి వానికి, రణమునఁ
జొచ్చెడివానికిని గాని సురుచిరకీర్తుల్
వచ్చునె? పందకులోభికిఁ
బచ్చనివిల్కాఁడవయ్య బత్తులయయ్యా!

గీ. చేదుఁబట్టువేళఁ జెలఁగి యేడ్చును బిడ్డ
యంతకంతసుఖమునదియెయిచ్చు
నర్థి యడుగువేళ నతికష్టమనిపించు
ననఘచరిత బత్తులయ్యనార్య!

క. ఎత్తెఱుఁగ డూళ్ళకంబఁడు
సొత్తెడుదుప్పాడజగ్గు శునకపుదాతల్
ఉత్తమకవుల నెఱింగిన
బత్తులయయ్యన్న యీఁగి పాటిని జేయర్.

బొబ్బిలియుద్ధమున వీరస్వర్గమందిన పెదవిజయరామరాజు గారిపైఁ జెప్పిన పద్యములు.

గీ. మెత్తనై నట్టి యరటాఁకుమీఁదఁ గాక
మఁటమీఁదను జెల్లునే మూఁటివాడి
బీదలై నట్టి సరదార్లమీఁదఁ గాక
కలదె క్రొవ్వాడి బాదుల్లఖానుమీఁద.

సీ. గడీల లోపల గంతు లేయుట కేమి
యీఁటెఁబట్టి యరిపైఁ దాఁటవలయు
సొగసుగ మొలకత్తి బిగియఁ జెక్కుట కేమి
వెఱవక వైరుల నఱుకవలయు
మాటిమాటికిఁ బెద్దమాటలాడుట కేమి
యదలించి రిపులఁ జెండాడవలయు
ఒొమ్మున నెఱ్ఱగందమ్ముఁ బూయుట కేమి
గాయంపు నెత్తురుల్ గ్రమ్మవలయు

గీ. గాని లేకున్న సత్కీర్తి కాంత గలదె?
పూసపాటికులాంభోధి పూర్ణ సోమ!
సమరజయభీమ! గజపతిసార్వభౌమ!
విమలసద్గుణధామ! శ్రీవిజయరామ!

శా. ఢిల్లీలోపల గోలకొండపురి నిండెన్ నీప్రశంసల్ గుఱాల్
బల్లాలం బాడిపించి హుమ్మని యరబ్బానెక్కి పైకొంచు బా
దుల్లాఖానునిఁ బారఁదోలితివి నీదోశ్శక్తి సూ బాలకున్
మల్లింపం దరమౌనె! శ్రీవిజయరామా! మండలాధీశ్వరా!

ఒకప్పుడు తనకాశ్రయదాతయగు విజయరామగజపతిపైఁ జెప్పినది.

ఉ. పంతము నీకుఁ జెల్లు నొకపాటి యమీరుఁడు నీకు లక్ష్యమా!
కంతము కేఁ బూని నిను గొల్వనివాఁడు ధరిత్రిలోన భూ
కాంతుఁ డొకండు లేఁడు కటకంబు మొదల్గొని గోలుకొండప
ర్యంతము నీవె కా విజయరామనరేంద్ర! సురేంద్రవైభవా!

ఇందలి యేకవచనప్రయోగమునకు సీతారామరాజుగారధిక్షేపించఁగా, నీక్రిందిపద్యములో సమాధానమిచ్చెనఁట.

క. చిన్నప్పుడు రతికేళిని
నున్నప్పుడు, కవితలోన, యుద్ధములోనన్
వన్నెసుమీ 'రా' కొట్టుట
చిన్నగు నోపూసపాటి సీతారామా!

పర్లాకిమిడిరాజావారిపైఁ జెప్పినపద్యములు :

క. గోవిందద్వాదశివలె
నేవచ్చితి రాక రాక నీనగరికి నో
పావనగుణ నారాయణ
దేవుమహారాజ! సాహితీనవభోజా!

క. నీవిచ్చు భత్యఖర్చుక
భూవల్లభు డిచ్చు త్యాగమున కెనవచ్చున్
బావనగుణనారాయణ
దేవుమహారాజ! సాహితీనవభోజా!

క. వారిధికినివారధియే
మేరునగంబునకు సాటి మేరునగంబే
నారాయణదేవుకు సరి
నారాయణదేవుగాక నరపతు లెదురా!

ఈకవి ప్రభువులపైననేగాక సామాన్యులపైన సామాన్య సందర్భములలోఁ గూడ నాశువుగాఁ బద్యములను జెప్పినట్లు చాల నిదర్శనములు కలవు

చింతకాయలనిచ్చినందున రేగానిసన్నిగాఁడను వానిపైఁ జెప్పినపద్యము

గీ. బండ్లు నోడలు పట్టవు పలుకులైతె
చేరి వేడిన సీఁడాయెఁ జింతకాయ
కొండశంబాములో రాచకొడుకు కన్న
శంబమున మేలు రేగాని సన్నిగాఁడు.

మంచిగంటమొకటి చేసియిచ్చిన యొకకమసాలిపైఁ జెప్పినది.

క. ముల్లోకంబుల నాలుగ
పల్లిపరశురాము కీర్తి ప్రబలి వెలుంగున్
మల్లిన్ సుమవల్లిన్ జా
బిల్లిన్ అంపాలవెల్లి భీష్మునితల్లిన్.

భార్యకోర్కెపైని తనకుమారునిపై శిశువుగానున్నప్పుడు చెప్పినది.

క. బాబా బూచుల లోపల
బాచన్నే పెద్ద బూచిపల్లుం దానున్
బూచంటె రాత్రి వెఱతురు
బాచన్నను జూచి పట్టపగలే వెఱతుర్.

వత్సవాయి తిమ్మజగపతిమహారాజులుంగారి సమక్షమున పెద్దాపురములో బంధువర్గమువారందఱు నుండగఁ జెప్పినది.

ఉ. రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీనుఁ, డంబికా
రాజు దిగంబరుఁడు మృగరాజుగుహాంతరసీమవర్తి, వి
భ్రాజితపూసపాడ్విజయరామనృపాలుఁడు రాజుగాక యీ
రాజులు రాజులే పెనుతరాజులుగాక ధరాతలంబునన్

శృంగవరపుకోట ప్రభువగు శ్రీముఖి కాశీపతిరాజుగారు విజయరామరాజుగారిపై దండెత్తినప్పుడు చెప్పినది.

గీ. విజయరామమహారాజవీరుఁడేలు
పట్ట ములికించె రాజభూపాలరాజు
కడమమాటల కేమి యీ కాలమునను
బుట్టె నవ్వేను, బులితోఁక గొట్టెగఱచె.

సూరకవికి కరణికమున్నను, కంచరము రేగ గ్రామములో భూములున్నను వానివలనవచ్చెడునాదాయముతో కుటుంబపోషణము జరుగక కవిత్వవృత్తిచే మహారాజులను, ధనవంతులనాశ్రయించి కుటుంబపోషణము జరుపుకొనుచుండెడివాఁడట. ఆవిషయమీ క్రింది పద్యమునుబట్టి నిజమని తెలియుచున్నది.

చ. కరిసెలు వ్రాఁతెగాని యొక కంటెఁ డెఱుంగము మన్య దేశముల్
దిరిగి యభీష్టవస్తువులు తెచ్చి భుజంతుము సర్వకాలమున్
సురుచిరసత్కవిత్వసిధి సూరకవీం దున కేల గల్గెఁ గం
చరమును రేఁగ మేఁకమెడచన్నులవంటివి రెండు మాన్యముల్.

భోగాపురపు కరణమును, కవికి మఱఁదివరుసవాఁడను భోజనప్రియుఁడునైన దేవళ్ళప్పు రామయమంత్రిపైఁ జెప్పినది.

ఉ. గ్రామము చేతినుండ, గృషికల్పితధాన్యము లింటనుండ, శ్రీ
రామకటాక్షవీక్షణపరంపర చే దినమేఁగుచుండ, మా
రామయమంత్రిభోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు నా
సామి యెఱుంగుఁ దత్కబళచాతురి తాళఫలప్రమాణముల్.

ఆశువుగా రచించిన మఱికొన్ని పద్యములు :—

సీ. చుట్టాలకును గూడు పెట్టని పెనులోభి
బొజ్జ తాఁబెంచిన పుణ్య మేమి ?

కార్య మించుక సేయఁగా లేని నీచుండు
రాజసన్నిధి నున్న లాభమేమి ?
పదిమంది మెచ్చని పాపకర్మునకు సం
పద విజృంభిగిన భాగ్యమేమి ?
ఆశ్రితుఁ బ్రోవని యధముఁడు పల్లకీ
యెక్కి తిరిగిన గొప్పయేమి ?

గీ. మాట చెల్లిన యెడల సమస్తబంధు
భూసురాశ్రితజనములఁ బ్రోవ లేని
వాని జన్మంబు కాల్పనా వసుధలోన
బెంకిలిపురీనివాస ! రవిప్రకాశ !
శ్రీమదాకాశకేశ ! యుమామహేశ !

క. అదపాక మామిడాకులు
పొదుపుగ నొక విస్తరంటఁ బొడిచిన వాఁడే
ముదమొప్ప విక్రమార్కుఁడు
అదపాక అత్తవారు ! ఓ నేపాపా !

మ. హనుమంతుం డెదుటన్ దివాకరసుతుం డాచెంత సౌమిత్రియున్
దను సేవింపఁగ జానకీవిభుఁడు వాత్సల్యంబుతో నిల్చి యిం
పున నన్నెప్పుడు గాచుచుండఁగను నీబోయాధములే కిక్కడే
ననుఁ జంపంగలవారె ? రాఘుకులజన్మా ! రంగరాయోత్తమా !

బొబ్బిలినుండి తనస్వగ్రామమునకడవిమార్గమున వచ్చుచుండగా మార్గమధ్యమున గొందఱు బోయవాండ్రడ్డమువచ్చి కవిని జంపయత్నించినప్పుడు చెప్పినదీ మత్తేభము. ఇందుఁ జెప్పినట్లే హనుమంతుఁడును రామలక్ష్మణులును ఆబోయవాండ్రకుఁ గన్పడగా వారు భయపడి పాఱిపోయిరట.

బొబ్బిలిలో "మీరును మీరు మీరు మఱిమీరును మీరునూ మీరలందఱున్" అను సమస్యనీఁగా సూరకవి యీక్రిందివిధముగఁ బూరించెనఁట.

ఉ. సారతరప్రబంధము లసంఖ్యముగా నొనరించినట్టి యీ
సూరకవీంద్రునిం జనిగి చూత మటంచును మాటిమాటికిన్
ఈరసమెత్తి దుష్కృతుల నిచ్చిన వారలనోరు మొత్తుఁడీ
మీరును...

సూరకవితో సంబంధించిన కథలనేకములున్నవి. వానిని గ్రంథవిస్తరభీతిచేనిటఁ జెప్పలేదు. సూరకవి జీవిత విశేషములను దెలిసికొనఁ గోరువారాయన వంశీయులగు రామారావుపంతులు గారిచే వ్రాయఁబడిన సూరకవి చారిత్రమును జూడవలయును. తురగారామకవి నూతన గృహనిర్మాణమునకై యిటుకగోడలను గట్టుచు దారిపోవు వారిని గొన్ని యిటుకలనందించి పొమ్మనువాఁడఁట. ఆమార్గమునబోవుచున్న సూరకవితోఁగూడ నాతఁడట్లేయనఁ దాను సూరకవినని తెల్పుటకై "సూరకవిత్రిట్లు కంసాలిసుత్తె పెట్టు" అని యనియెననియు, నందుపై రామకవి, "రామకవిబొబ్బ పెద్దఫిరంగి దెబ్బ" అని సమాధానమిచ్చెననియు నొక కథకలదు. బ్ర. శ్రీవీరేశ లింగముపంతులుగారీ కథను రామకవిచారిత్రమున గ్రంథస్థముఁ జేసి యున్నారు. కాని రామకవి 17వ శతాబ్దివాఁడును సూరకవి 18వ శతాబ్దివాఁడునునగుటచే నిందు సత్యములేదనియు, తరువాతివారెవరో యీపద్య పాదములను గల్పించియుందురనియుఁ దోఁచుచున్నవి. ఈతఁడు తిట్టుకవియైనట్లు పిండిప్రోలు లక్ష్మణకవి తన లంకావిజయ ములో రచించిన,

క. "తెలియ వినుఁ రామకవ్యా
దులు, సూరకవి ప్రముఖపృథుప్రతిభావం

తులు భీమశ్రీనాథుల్
వెలయఁగ నాకరణిఁ దిట్టలేరాఢమతిన్.

సూరకవి నిగ్రహానుగ్రహసమర్థతనుగూర్చి యనేకకథలున్నవి. ఆళ్ల సరవయ్యయను కోమటియింట జరిగిన వివాహకట్నమునకు సూర కవి వెళ్ళఁగా నతఁడు తేపురమ్మనెనఁట మఱునాఁడుదయముననే వెళ్ళిన సూరకవినిఁజూచి లోపలకుఁబోయి, "పీణ్ణిపాంగర! బాపనోడు దాచపెట్టినట్లు పొద్దుటేపారొచ్చేడు" అనియెనట. ఆ మాటలు ద్వార ముకడనున్న సూరకవి విని "ఆపామే నిన్నుగరవ! అయ్యో సరవా" అనితిట్టెనట. తిట్టుటయే తడవుగ నింటిముంజూరు దూలముపైఁ జేయి వైచియున్న సర్వయ్యనందున్న కృష్ణసర్పమాతనిని గఱచి విగతజీవునిఁ జేసెనట- అట్టి యద్భుతమున కచ్చటనున్న వారాశ్చర్యపడిరి. ఆపామితరులఁ జోలికిఁ బోవక తనదారిని బోయెనఁట.

గ్రంథవిస్తరభీతిచే నీకథలను వ్రాయవిడిచితిని. ఇట్టి కథల యందలి సత్యాసత్యనిర్ణయమసాధ్యకార్యము. పూర్వము వివాహాదు లలో మతత్రయములయందున్న విద్యాధికులను గౌరవించుటకై తాంబూలములను పళ్లెములయందుంచి దక్షిణలతోఁగూడ నర్పించు యాచారముండెడిది. ఇప్పుడుకూడ బ్రాహ్మణ వివాహములలో సదస్యమునాఁడిట్టి యాచారమున్నది. పూర్వము కవులకుఁగూడ నట్టి పళ్లెములనిచ్చువాడుక కలదు. అందు విశేషించి వైశ్యవివాహము లలో నీశ్వర సంభావనలు కవీశ్వర పళ్లెములు తప్పకుండగ యిచ్చు విధి యుండెడిది. క్రమక్రమమున వివాహకాలమున లేకపోయినను కవులు వారియిష్టమువచ్చినపుడు వచ్చి యీసంభావనలను 'వసూలు' చేసికొనియెడివారు. ఆనాఁడీ సంభావనలు భిక్షాటనముగాఁ బరిగణింపఁ బడునవికావు. వేదపండితులు వేదోక్తముగా నాశీర్వదించుటయు, కవులు కవిత్వమూలమున నాశీర్వదించుటయు ముఖ్యముగా నెంచి, గృహస్థులు తమపిల్లల శ్రేయోభివృద్ధినిగోరి యీయాశీర్వచనములను

గ్రహించి, పండితులను, గవులను గౌరవించెడివారు. ఆ యాచార
ముభయతారకమై యిహపరసాధకమై విద్యాభివృద్ధికి సహకారియై
చిరకాలానుగతమైయున్నది. నవీనకాలమున నిది యాక్షేపణీయముగ
గన్పట్టుచున్నది. కాని, యిప్పటివారు రాజుల పట్టాభిషేక వేళల
యందును, ధనికులయిండ్ల శుభసమయములయందును దేశమాత
పేరుననో విద్యాభివృద్ధికనియో మఱియే పేరుననో సొమ్ములను వసూలు
చేయుచునేయున్నారు. అయినను పూర్వాచారముకూడ నిట్టిదే
యని గ్రహింపక నిరసించుటకూడ నాశ్చర్యము కలుగఁజేయుచుండును.

సూరకవి 'పొన్నుపాటి వేంకటమంత్రీ' యను మకుటముతో
నొకశతకమును రచించెనని కొందఱనుచున్నారు. ఈ పొనుగుపాటి
వెంకటమంత్రి గోలకొండ వ్యాపారి శాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు.
శ్రీవత్స గోత్రుఁడు. వీర రాజామాత్యపుత్రుఁడు. ఇతఁడు ౧౮ శతాబ్ది
మధ్యమున శృంగవరపుకోట సంస్థానమును బరిపాలించుచుండిన
శ్రీముఖి కాశీపతి రాజుగారియొద్ద మంత్రి. పొనుగుపాటివారార్వేల
నియోగులలోఁగూడఁ గలరు. కాని వారు కౌండిన్యగోత్రులు.

సూరకవి యితనియొద్ద కవీశ్వర మంత్రీశ్వర భేదముతోఁ
గాక బావమఱఁదుల వరుసలతో చనువుగానుండుచు నెలలకొలఁది
యక్కడనేయుండి ప్రసంగానువశమునఁ జెప్పిన పద్యములను సేకరించి
వేంకటమంత్రి శతకమను పేరఁ బ్రకటించినట్లు కన్పట్టుచున్నది.
ఒకప్పుడు వెంకటమంత్రిగారింట బ్రాహ్మణ సమారాధన కొఱకు
సమకూర్పఁబడిన వస్తుసముదాయమును జూచి సూరకవి

క. ఒక్కసముద్రము దక్కఁగఁ
దక్కిన సంద్రములు నీయుదారమహిమచే
జిక్కఁగద విప్రభుక్తికి
వెక్కసముగఁ బొన్నుపాటి వెంకటమంత్రి

యని చెప్పెనఁట ! అటనుండి యీ పద్యమును వినిన వేంకటమంత్రి సోదరి "బావగారూ! మీబోటి స్వయంపాక నియమముగలవారికొఱకు "దక్కటి సముద్రము పిడచినారము" అనిపలుక సూరకవి నిరుత్తరుఁడయ్యెనఁట ! అచ్చట నున్నవారందఱు నామె చేసిన పరియాచకము నందలి యుక్తికి సంతసించిరఁట.

ఈ వెంకటమంత్రిని సంబోధించుచు వ్రాసిన మఱికొన్ని పద్యములనిఁట వ్రాయుచున్నాఁడను.

క. సరివత్తురె గుణసంపద
వెలువక నీపొన్నుపాటి వేంకటపతి శా
ర్ఙగురు చక్రివర్తులుఁ బదా
ర్ఙగురు రాజులు ముప్పరిద్దఱు నియోగివరుల్.

క. బలవంతుఁడు బలహీనుఁడు
పోఁతురు విధితప్ప, నల్లపూసలు ముత్యాల్
తోలఁగఁగద మగఁడు వోయిన
వెలఁదుకకున్ బొన్నుపాటి వెంకటమంత్రీ

క. వర దానాచారంబుల
గరిమగని వనీపకులు గర్వ్యపలును భూ
సురమణియని నిన్నందురు
విరచితవృష పొన్నుపాటి వేఁకటమంత్రీ

క. లేఁడుభువివానఁపడయని
వాఁడు స్నీయింటభుక్తిపడయని ద్విజుఁడున్
బోడిమి మీఱఁగ నిన్నున్
వేఁడనికవి పొన్నుపాటివేంకటమంత్రీ!

ఈ వెంకటమంత్రి దేవబ్రాహ్మణభక్తి కలవాఁడును, దానకర్ణుఁడును, పేదలయందుకనికరము కలవాఁడని యితనికీర్తి పలువిధములఁ జెప్పుకొనుచుందురు.

ఈ వెంకటమంత్రి చనిపోయినపిమ్మట సూరకవి ఈక్రిందిపద్యమును రచించెను.

మ. కరుణాసాగర! పొణ్ణుపాటి వేంకట్రామదాసున్ వసుం
ధరయందుం జక స్వర్గలోకమునకున్ దర్లించినావేమి? త
త్పూర్గల్పావు లేవ! యాచకులకున్ భూయాచక శ్రేణికె
వ్వరుదిక్కిఁక మిది! మొండికొజ్జ్గఁడవు కావా! వెఱ్ఱివై పల్కితిన్.

సూరకవితో సమకాలికుఁడైన రేకపల్లి సోమనాథకవియను పండితుఁడొకఁడు, ఈ సూరకవికిని స్పర్థ విశేషముగా నుండెడిదఁట! సోమనాథకవి గొప్పపండితుఁడు. వెలివెలగొత్తన్నయను నియోగి బ్రాహ్మణునియొద్ద ఆంధ్రకవిత్వ లక్షణములను నేర్చుకొని రుక్మిణీపరిణయాది కావ్యములను రచియించియున్నవాఁడు. ఆతనిచారిత్రము నీ గ్రంథమున వేఱుగా వ్రాసియున్నాఁడను. సోమనాథకవి తనపాండిత్యమునుజూపనెంచి సూరకవి రచనములనుగూర్చి యాక్షేపించినందున వీరువురకును సంఘర్షణమేర్పడినదనియందురు. ఒకరినిదూషించుచు నొకరువ్రాసికొనిన పద్యములు పెక్కులున్నవఁట. అందుఁగొన్నియిఁట నుదాహరించుచున్నాఁడను.

సూరకవి :- క. ఏమేమో శాస్త్రంబులు
తా మిక్కిలి సతికెనఁట సతకనీ కవితా
సామర్థ్య మెఱుఁగ నేరని
సోమునిజృంభణము గలదె సూరునియెదుటన్.

సోమకవి :- గీ. సోమశబ్దార్థ మెఱుఁగని శుంఠ వగుట
వదరితివిగాని సూరుని రదనపాళి
రాలఁ దన్నిన సోముని లీలఁ దెలియ
వైతి నీగుట్టు బయలగు ననుచుఁ గుకవి.

సూరకవి :- క. తెలుఁగున కబ్బపురీతులు
కల నెఱుఁగని శుష్కతర్కకర్కశ మతికిన్
దెలిసె నొకయించు కించుక
వెలివలి గాతన్నకృపఁ గవిత్వపుజాడల్

క. చెన్నగునియోగికవనపు
మిన్నాయై దిశనకబ్బిమించు నెజెపుఁడా
వెన్నమిఁసిజున్నకబ్బనె
తన్నుక చచ్చినను గాని ధరలోన నృపా !

సోమకవి :- గీ. తర్కకర్కశబుద్ధులై తగిన వారి
కేమసాధ్య మటంచు నూహింప రాదె
తెలుఁగుమాటలు నాల్గయిదు తెలిసి తాము
కవుల మనుకొన్న వెఱిపాట్లుమదిని.

సూరకవి :- సీ. తట్టెడంత విభూతిఁ బెట్టి తాతలనాఁటి
కుండనాల్వేనుల గునిసియాడ
మైల గ్రక్కెడు శాలు మడతలు నెరసిన
బోడిబుఱ్ఱలమీఁదఁ బొసగఁజుట్టి
ప్రాతనీరుంగావి పంచెలు ము... ముల్
గనుపింపఁగా డొల్లుకచ్చగట్టి
యంగవస్త్రంబుల నతికి కుట్టినయట్టి
దుప్పట్లు పైఁగప్పి తుదలు చినిఁగి
నట్టి పుస్తకముల కట్టలు చంకలోఁ
బెట్టి విషంబులు విదులుకొనుచుఁ
బలుగాకి ముండ బిడ్డలు శిష్యులని కొంద
ఱుపచారము లేసేయుచుండఁ గాస్వ
యంపాక నిష్ఠుల మనివంట సాగించి
పదిదినంబుల కొక పట్టుఁబట్టి

సంగీతసాహిత్యసరసవిద్యలవారి
పాలిటి భూతాల పగిదిఁదనరి
యెంత చక్కని శ్లోక మేనిఁ బద్యంబేని
రసమెఱుంగక యుక్కురత వహించి
యితఁడు పండితుఁడు గా డితఁడు తార్కికుఁడుగాఁ
డితఁడు శాబ్దికుఁడుగాఁ డితఁడుసత్క్రి
యారసజ్ఞుండుగాఁ డనిచుల్కనాడుచు
ఘనవిత్తహారణదుష్కర్మ లరుచుఁ
బరఁగు దుష్పండితబ్రహ్మరాక్షసులచేఁ
గవితాసజ్జత గట్టువడియెఁ

గీ. గాన నేరీతిఁ జూచెదో గరుణమూర్తి
శులకవిత్వ మేరీతిని సూటిఁ జేసి
రక్షచేసెదో నీవె మారక్షకుఁడవు
జానకీరామ దేవతాసార్వభౌమ

సోమకవి – క. జిలిబిలి పలుకులవెలఁదీ!
పలుగాకినవారగుళ్ళ పాలైతిగదే
యిలలో వైదికవిద్య
త్రిలక్షంబులకేదిదిక్కు తెల్పితివమ్మా!

సూరకవి కవిత్వమెట్లుండవలయునో యీక్రింది సీసపద్యమునఁ జెప్పి యారీతిగా తన కవిజనరంజనము ను రచియించియున్నాఁడు.

సీ. యతియుక్తవాక్యానుగతి నంటవలయు వ
త్సంబు ధేనువు వెంటఁ దవిలినట్లు
మెట్టుమీఁదను గాలు పెట్టఁ గ్రిందండయ
దిచ్చినట్టులు ప్రాస మొనయవలయు
సానఁబట్టిన మణి చందానఁ బదమర్థ
నారీశుభంగి బంధంబు వలయు

దివివెలుంగు మెఱుంగుఁ దీఁగెయ ట్లర్థంబు
తేటతెల్లంబుగాఁ దెలియవలయు

గీ. నలఁతి తొలపడ్డచంద్రమండలమువలన
జలజలను రాలు నమృతంపుజాలు లీల
రసము తుఁకింపవలె నట్టి రమ్యకవిత
రసికరసనాగ్రరంగచేఁ బబల కున్న

ఇతఁడు రామాయణకథను క్లుప్తముగాఁ జెప్పుచు నొకదండకము వ్రాసెనని సూరకవి చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని నాకా గ్రంథము లభింపలేదు. ఆదండక శైలి తెలియుటకై సూరకవి చారిత్రమున నుదాహరించిన పంక్తులలో గొన్నిటినిట వ్రాయుచున్నాఁడను.

"మాయాకురంగాకృతిన్ రావణప్రేరితుండౌచు మారీచుఁడే తేర సీతాప్రియత్నంబునన్దజ్జి ఘృతూపరాయత్త చిత్తుండవై నీవు బోవన్దశాస్యుండు సీతాసతిన్గొంచు లంకాపురిన్జేర నీవంత మారీచు దున్మాడి తత్పర్ణశాలా సమీపంబునన్జానకిన్గాన కార్తి న్నరారుల్ను రారుల్తరణ్యాంశుజాలాశరణ్యం బరణ్యంబగణ్యంబు లేవేళలన్వ్యాఘ్ర శార్దూల శుండాలముల్ హాతటిద్ధాత్రి హామానసాష్టోప సంధా.తి హాప్రియసి క్వాసియంచాయరణ్యాని నీవాధరణ్యాత్మజ న్స్వాంసుచున్ రావణోత్కృత్తకాయున్జటాయు న్నిరీక్షించి నీవాకబంధున్వధంజెంది లోకైకబంధుండవై పొల్చియుందిందిరాజీవ రాజీవ రాజీవ రామోద సంపాది పంపాసరస్తీర దేశంబునన్మైత్రితో మైత్రిగావించి, వాలి న్మహాసత్వశాలిన్సముచ్చండ కాండాహతిన్జెండ వేచండ వేదండమున్జెండు పంచాస్యమున్బోలి నీవంతటన్ . . .



—::—

సీతావిజయమను నామాంతరముగల శతకంఠరామాయణమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును మర్ధనకవి రచించినట్లిక్రింది గద్యవలనఁ దెలియుచున్నది.

"ఇది శ్రీమదేయకుర్తి నివాస లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష సంప్రాప్త మహాకవిత్వ విద్యాపారీణ సుమహితాంధ్ర గీర్వాణభాషా ప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రాత్రేయగోత్ర పవిత్ర ధర్మనార్యపుత్త్ర నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమానభాగధేయ సకల నృపవిధేయ మర్ధన నామధేయ ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబునందు"

దీనినిబట్టి యీమర్ధనకవి ఏయకుర్తి నివాసుఁడైనట్లును, ఆత్రేయస గోత్రుఁడైనట్లును ధర్మనార్యునికుమారుఁడైనట్లును తెలియుచున్నది. ఈగద్య ముద్రితగ్రంథమునుండి గైకొనఁబడినది. ఈగ్రంథమునకుఁ గృత్యాది లభింపలేదు. ఈగ్రంథమును గంగకవి, లింగకవియనువారలు రచించి యుండినట్లు బ్ర॥ శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు గారాంధ్రకవులచరిత్రమున నీక్రిందివిధముగా వ్రాసియున్నారు.

"ఈయిరువురు కవులునుజేరి సీతావిజయమను నామాంతరము గల శతముఖ రామాయణమును రచించిరి. ఈయిరువురు కవులు వేదాద్రిపురనివాసులు. వీరిలో నీలకంఠోపాసకుఁడయిన లింగకవి తానురచించిన మొదటి మూఁడాశ్వాసములను చిన్నారెడ్డి పుత్రుఁడగు పోచనృపాలునకంకితముచేసెను. నృసింహోపాసకుఁడగు గంగకవి తాను రచియించిన నాలవయాశ్వాసమును భోగనృపాలునకంకితముచేసెను. ఈయిరువురకవిత్వమును మొత్తముమీఁద నిర్దుష్టమయి రసవంతమయి

హ్యాదయంగమముగాను న్నది. ఈకవులిన్నూఱు సంవత్సరముల క్రిందట నుండినట్లు దెలియవచ్చుచున్నది.'' ఆంధ్రకవుల చరిత్రమున శైలి చూపుటకొఱకుదాహరింపబడిన పద్యములు ముద్రితప్రతిలోనుండుటచే కవులిద్దరైనను గ్రంథమొక్కటియేయగుట నిశ్చయము. ప్రథమా శ్వాసాదిపద్యము లేదు. ఆశ్వాసాంతమున శ్రీ మహావిష్ణువును సంబోధించు పద్యమున్నది. ద్వితీయ, తృతీయ, చతుర్థాష్టకను సంబోధించు పద్యమున్నది. ద్వితీయ, తృతీయ, చతుర్థాశ్వాసాది పద్యములు పోచమనృపాలుని సంబోధించుచున్నవి. ద్వితీయా శ్వాసాంతపద్యములు శ్రీరామచంద్రుని పరముగనున్నవి. తృతీయ, చతుర్థాశ్వాసాంత పద్యములు పోచమరెడ్డి సంబోధకములు. ఆంధ్ర కవుల చరిత్రలోఁజెప్పఁబడిన భోగనృపాలునిపేరు ముద్రితప్రతిలోఁ గన్పట్టుటలేదు ఇందలిపోచనృపాలుఁడెవ్వఁడో ఏకాలమువాఁడో తెలియుటలేదు. కాని పోచనృపాలుఁడే నిజమయిన కృతిభర్తయని యూహింపఁదగియున్నది. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండా గారమున నీగ్రంథమునకు మూఁడు ప్రతులున్నవి. అందొకదానిలో నీభోగనృపాలుఁడు గొబ్బూరి వంశజుడైనట్లును, పొన్నూరు పట్టణా ధ్యక్షుఁడైనట్లునున్నది. ఆ గ్రంథాంతమునందలి గద్య :—

''ఇది శ్రీమత్స్వదాదిపురనివాస శ్రీరంగచరణ సరోరుహ భ్రమరాయమాణ పాశ్చాలగోత్రపవిత్ర చిన్నారెడ్డి పుత్త్ర భోగనృపాల నిజాశ్రితలింగసుకవి ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబు''

ఈకవినిగూర్చి కృతిపతి పలికినట్లు కవిరచించిన పద్యములివి :-

చ ఎలసతిలింగసత్కవిసురేంద్ర! ఫణీంద్రవచోవిలాస! నీ
పలుకులు తాండవేశ్వరకపర్దలుఠద్గగనాపగాచల
చ్ఛలదురుయంతరంగచయసంగమజాతనిరర్గళాతిని
ర్మలవిలసత్ప్రమాముఖు సమాన విజృంభణముల్ తలంపఁగన్.

ఉ. కావున నీవు సేయు కృతి గన్గొన నాకిపు డంకితంబుగాఁ
బావనవృత్తిఁ జేయుమని పాయక నూటపదాఱులిచ్చినన్
నేవివరించిసమ్మతిని నేర్పుననవ్విభుపేర నంతయున్
నావినిభోగభూపతికొనర్పఁగఁ జేసెదఁ జిత్తగింపుఁడీ !

కృతిపతిని భోగయరెడ్డి భూవరాయని సంబోధించుటచేతనీతఁడు రెడ్డి కులమునకుఁజెందిన యొకచిన్న సంస్థానాధిపతియో, గ్రామాధికారియోయని తోఁచుచున్నది. ఇఁక నొక తాళపత్రప్రతిలో, ముద్రితప్రతిలోని గద్యయందలి "ఏయకుర్తినివాస" యను వాక్యము లేకుండ "మర్దనకు" బదులుగా "లింగ" యను పదముంచఁబడినది. మర్దనకు లింగ యను నామాంతరముండెనేమోయని తోఁచుచున్నది.

కవిత్వశైలి తెలియుటకై నాల్గాశ్వాసములనుండియు నాల్గు పద్యము 'నిట నుదాహరించుచున్నాఁడను.

ఉ కార్ముక మందె నేని పటుకాండపరంపరచే నరాతులన్
మర్మము లుచ్చిపోవ నసమానచమత్కృతి సేయనేర్చు దు
ష్కర్ములఁగూడఁ డెన్నఁడురుశౌర్యసుధైర్యుఁడు కార్యవేది జో
తిర్ముఖునంతవాఁడు మనదిక్కునఁ గల్గఁగఁ జింత యేటికిన్. ౧ఆ

శా. ఉగ్రారాతిపయోధిబాడబుని విద్యుత్సన్నిభాత్మున్ రణో
దగ్రున్ బాహుబలప్రతాపఘనుమార్తాండాత్మజున్ భూరిహే
మగ్రావప్రతిమానధైర్య రఘురామశ్రీపదధ్యాను నా
సుగ్రీవుం బొడఁగాంచె నంత నతఁడుం జూచె న్మరున్నందనున్. ౨ఆ

చ. బానుపఁగ విష్ణుఁడేడ మనుజుండననేడ మృషోక్తిచేత నా
మనసు కరంగఁ బల్కినను మర్త్యునకై భయమందనేర్తునే!
యనుపమయుద్ధమందు సుర లౌనని మెచ్చ నృపాలుఁజంపి యా
తని తరుణీలలామను సత బుగఁ గైకొను దెల్లకాలమున్. ౩ఆ

మ అనిలాస్త్రం బరివోసి యేసెనది హాహాకార మొప్పంగఁ బ
య్యన జీవంబులు సంహరించుచు మహాశ్చర్యంబుగా వాని నా
భిపిఁ దాముండు మహామధీలతలు నాభీలంబుగాఁ గాల్చి గొ
బ్బున భస్మంబుగఁ జేసి వచ్చెను సురల్ భూషింపఁగాఁ జెచ్చెరన్. ౨౫

ఈకవికాలనిర్ణయమును జేయుట కాధారము లేవియు గ్రంథమునఁ గాన్పించ లేదు. ఈకవులిన్నూఱు సంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్నదని యాంధ్రకవులచారిత్రమున నుడివియున్నారు. ఇది సత్యమయ్యేనేని, యీకవులకాలము పదునేడవశతాబ్దిఁ దుదిభాగ మగును.

ఇంపలికథ నే సీతావిజయమను పేర పెనుమళ్ళ బాపయామాత్యుఁడు పద్యకావ్యముగా రచియించియున్నాఁడు. శతకంధర రామాయణమును వేములవాడ భీమకవికూడ రచియించినట్లు ప్రతీతికలదు. కాని గ్రంథమిప్పుడు లభ్యమగుట లేదు.



## 427 పన్నాల బ్రహ్మకవి

—***—

ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు; ఈకవి "ఖలకర్ణవిషాయనము" అను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. ఈగ్రంథము రావణదమ్మీయమువంటిది. గోదావరీమండలమున పలివెలయొద్దనున్న యేనుగుమహాలు అను గ్రామమునఁగవికికొంతలంకభూమి యీనాముగానుండెడిదఁట. పలివెల సంస్థానపు జమిందారులయొద్ద వ్యవహారకర్తగానుండు కూచిమంచి గోపాలకృష్ణమ్మయనునాతఁడా యీనామును సంస్థానములోఁ గలిపివేయఁగాఁ గవి కోపించి, యాభూమిని సీతగాను, గోపాలకృష్ణమ్మగారిని రావణునితోను, నాయనకుమారుఁడైన వెంకటరత్నమునింద్రజిత్తుతోను పోల్చుచు, రామాయణకథయు నుతన భూమిహరణ కథయును వచ్చునట్లుగా నీతిట్టు కావ్యమును రచియించెను. ఇది రావణదమ్మీయమంతప్రౌఢముగా లేకపోయినను మొత్తముమీఁద కవి తనప్రయత్నమును బాగుగనే నిర్వహించినాఁడని చెప్పవచ్చును.

దండకాశ్రమవాసులు రామునితో రావణునిగూర్చి చెప్పిన యీక్రింది పద్యములోఁ గవి గోపాలకృష్ణమ్మగారి నామమునిమిడ్చియున్నాఁడు.

సీ. విబుధభంగోచిత వేషంబుకలవాఁడు
కుజనతాపాలనగోష్ఠివాఁడు
దురధికలక్షణ దుర్మతిగలవాఁడు
సతతనికృష్టగలవాఁడు
బహుళతృష్ణను జెందిపాపంబుగనువాఁడు
సజ్జనాసమ్మతసరణివాఁడు

పంచాక్షరివిభూతిపాలు జేసినవాఁడు
కవిపురుషుండనగ్రాలువాఁడు

గీ. దుష్టదశముఖుఁడతఁడు సాధుజనతాప
కారి యధికారిధర్మంబుకాలుకతన
కాలనై నను లక్ష్యంబుగాఁగఁగొనఁడు
కానికను ను మింటనుకంటమనఁడు

అయోధ్యను పలివెలగఁ గవి యీక్రిందిపద్యములో వర్ణించి యున్నాఁడు.

క. ధరలోఁబలివెలయను రుచి
రరమాశాలియనఁగ నగరముసాకేతం
బరిది మహాహీనస్థితి
సరయు నరులుదలకఁగు జనులలరనేవెలుఁగుక్.

గోపాలకృష్ణమ్మగారి పలివెలనివాసులే పలివెలను లంకతోఁ బోల్పక యయోధ్యతోఁబోల్చుటకు హేతువేమియో తెలియదు.

కవి తనభూమియున్న వేనుఁగులమహాలు నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. మానక యజ్ఞవిధు లెనయ
నేనుఁగులమహాపధాళిహితమచ్చోన
చ్చో నెగడుగ దే భూమిజ
నావఁ దక రాత్ముఁడొక మహాత్ముఁడు ప్రీతిన్.

ఈగ్రంథమున శ్రీరామచంద్రమూర్తిగా వర్ణింపబడినయాతఁడు రామస్వామినామాంకితుఁడు. కనకదండికులోద్భవుఁడు. ఏనుగమహాలునఁదు 'కనకదండి'వారను గృహనామముగల బ్రాహ్మణులున్నారు

వారికిఁగూడ గోపాలకృష్ణమ్మగారివలన నిట్టి యపకారమే జరిగినట్లు కవి యీక్రిందిపద్యములో వాకొనియున్నాఁడు.

గీ. వాసిఁ గనకదండివారని విబుధుల
నించుకైన సంశయింపఁబోక
దుఃఖపెట్టినట్టి దోసమూరకపోవు
నే కులక్షయంబుగాక యున్న.

ఈగ్రంథమును శా. శ ౧౬౦౧ సంవత్సరమున రచియించినట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. చంద్రఖవసుమహీమిత శాలివాహ
నాబ్దములుజనగా ప్రమాద్యబ్దమాఘ
శుక్ల పక్షాష్టమీయుక్త సోమవార
ముదయముననుండి యీగ్రంథముదయమయ్యె.

క. అల దుష్టదశముఖుఁడు మ
మ్మలయించిన బాము లప్పుడప్పుడు వరుసన్
గలిపితి పార్థివవత్సర
విలసజ్జ్యేష్ట నిజశుద్ధ విదియకుముగిసెన్.

ఈకవి, శివమహిమస్తోత్రమును దెలిగించినట్లీ క్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది. కాని నాకాపుస్తకము లభింపలేదు.

క. నామహిమస్తవమును విబు
ధామోదముగాఁగఁగూర్చి తాంధ్రోక్తిని నీ
కేమెయిని జేయవలసిన
కామితమెయ్యది వచింపు కడఁక నొసగదన్.

ఖలకర్ణి విషాయనము గోదావరి మండలమందలి కోటిఫలి సోమేశ్వరస్వామి కంకితముసేయఁబడుటనుబట్టి కవి కోటిఫలినివాసుఁ డని యూహింపఁదగియున్నది.

ఈ గ్రంథమందలి కొన్ని పద్యములనిట నుదాహరించుచున్నాఁడను.

శా. శ్రీకంఠుండు పురాంతకుండు హరుఁ డక్షీణాహిభూషుండు చం
డీకాముండు శ్మశానవాసి స్మరకోటీహారి కాలారి భీ
మాకారుండగు సోమనాథుఁడు మహోద్యత్స్వాత్రిశూలాయుధుం
డై కాపూరుషవృత్తి వర్తిలుమదీయారిన్ హరించు న్వెసన్. ౧ఆ

క. స్వామి యిది యేమి రామ
స్వామి నిరతరుగాఁగ జూడఁజనునా మన కా
రామబ్రహ్మము గినిసిన
చో మరలుపఁగలఁడె యొరుఁడు సుకరప్రౌఢిన్. ౧ఆ

మ. సుజనుల్ మెచ్చని ఘోరకృత్యములచేఁ జూపట్టు నిబ్రహ్మభూ
మిజనానందములో హరింపుమని నిర్మించెఁగదా! దైవమా!
వృజినంబున్ మరలింప శక్యమె బుధారీ! యిఁక నీదుర్యశం
బు జగంబంతట నిండగాఁ గలదు దుర్బోచస్థితిన్ దుర్మతీ. ౨ఆ

గీ. బ్రహ్మ వ్రాసిన లిఖితంబుఁ బడయకుండ
దీరమి తటస్థమైయుంట చేరువైన
మహితనయసౌమ్యవృత్తిని మాన్యభూమి
రుచిఁ గొనఁగ నియ్యఁ డెట్టి మూర్ఖుండొ కాని. ౩ఆ

గీ. మామహితవృత్తి వెలయ గ్రమ్మరఁగవచ్చె
ననుచు వేడ్కలఁబారులు చనువు నెరప
నాతఁ డనురక్తి నెసఁగ భూజాతలోరు
చిరనిజప్రాజ్యసామ్రాజ్యసరణిఁ జెంది ౪ఆ

బ్రాహ్మణుల మాన్యములు, వారివారిపట్టాలలో లిఖింపఁబడియున్న వానికంటె హెచ్చుపరిమితులుగానుండుటచే, వానినిగొల్పించి, మెట్టవగానున్న భూములను సంస్థానమునకుఁ జేర్చుటకును, పట్టాలు లేకుండ ననుభవించుచున్నవారికడనుండి యాభూములను లాగికొని సంస్థాన

భూములలోఁ గల్పుటకును బ్రయత్నించుటచే నీతఁడులోకకంటకుఁడుగా బరిగణింపఁబడియెనని కొందఱందురు. ఈక్రింది పద్యమువలన నిందు గొంత సత్యమున్నట్లు తోచుచున్నది.

గీ. వరుసఁగనకదండివారిమాన్యక్షేత్ర
ములనుఁగొలువఁబనిచిభూమిహెచ్చె
నని విజృంభణమున మొనసెమిత్రద్రోహి
వీనిశిరముద్రుంప వేళరణ్యా ?

ఈవిధముగా నష్టమునుబొందిన విప్రులనేకులున్నారు. వారి నామములుగొన్ని యీగ్రంథమునందున్నవి కాని గ్రంథవిస్తరణభీతిచే నిందుదాహరింపలేదు.



## 428 బాలకృష్ణకవి



ఈకవి శృంగారమంజరి శృంగ నాయికానాయకలక్షణాదులను దెలుపు లక్షణగ్రంథమును రచియించెను. ఇది ముద్రింపబడలేదు. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నసమగ్రమై కృత్యాది లేని యొకప్రతియున్నది. కృత్యాది లంభిపకపోవుటచే నీకవినిగూర్చిన విషయములేమియుఁ దెలియుటలేదు. ఈక్రింది గద్యవలనఁ గవి 'బాధకాలరస'గోత్రుఁడైనట్లు తెలియుచున్నది.

ఇది శ్రీ మదనగోపాలకృపాలబ్ధ కవితా విచిత్ర బాధకాలరస గోత్ర పవిత్ర బాలకృష్ణకవి ప్రణీతంబైన శృంగారమంజరి యందు

నవమోల్లాసము మొత్తమెన్ని యుల్లాసములో తెలియలేదు. మచ్చునకుఁగొన్ని పద్యములనుదాహరించుచున్నాఁడను.

సీ. స్వాధీనపతి తా నిజాధీశు వశునిఁగా
మెలఁపఁగా నేర్చిన మీననయన
వాసకసజ్జిక వరుని రాకకు మేను
నిల్లు శృంగారించు నిందువదన
రమణుండు వేళకు రాకున్నఁ దపియించు
మును విరహోత్కంఠిత యనులతాంగి
పరకాంతఁ బొందిన పతి చిహ్నములు చూచి
వగచు ఖండితయను వనజగంధి

గీ. ధవుని నెడఁబాసి ప్రోషిత తత్తరించు
నలరుఁగలహాంతరితనాథునడ...
విసుఁగుపతినిచ్చ గానకవిప్రలబ్ధ
నెరవదభిసారికాఖ్యగుమ్మరువ...

ఈయముద్రిత ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమున "ఈ గ్రంథము ప్లవసంవత్సర శ్రావణ శు ౧ శుక్రవారంనాడు కొల్లూరు నాగప్ప సంపూర్ణంగా వ్రాసెను." అని వ్రాసికొనియున్నాఁడు క్రీ. శ. ౧౮౭౧ వ సంవత్సరంలో వచ్చిన యాతిథి శుక్రవారమయినది.

ఈకవి పదునేడవ శతాబ్దియందుండవచ్చును.



# 429 అనుమంచి జగన్నాథకవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; అగస్త్య సగోత్రుఁడు; సుబ్బయామాత్య పుత్త్రుఁడు; నారసింహార్యపౌత్త్రుఁడు.

ఈకవి తారకమంత్ర మహాత్మ్యమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించెను గ్రంథాంత గద్యవలన నీతని కులగోత్రాదులు తెలియవచ్చుచున్నవి.

గద్య :- ఇది శ్రీ సీతారామచంద్ర కరుణాకటాక్ష లబ్ధకవిత్వ వైభవాగస్త్యసగోత్ర పవిత్రానుమంచి వంశపయఃపారావార రాకానిశాకళత్ర, నరసింహార్యపౌత్ర సుబ్బయామాత్య పుత్ర సకల సుకవి జనవిధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన తారకబ్రహ్మమంత్ర మహాత్మ్యము..

ఈక్రింది గ్రంథాదిపద్యమునుబట్టి యీపుస్తకమును శ్రీరామచంద్రునకుఁ గృతియిచ్చినట్లు గానఁగను.

శా. శ్రీమద్భూతనుజాతమంగళమహాశ్రీ వేళతత్రత్యది
వ్యామేయస్ఫుటరత్నవేదిక నిజాస్యాలోకముంజేయు త
ద్రామాస్వాంత మెఱింగి మంగళవిధిం దత్పృష్ఠపీఠస్థుఁడౌ
రామస్వామి కృపాసముద్రుఁడు ననున్ రక్షించు నెల్లప్పుడున్.

తన గురువైన మంత్రిప్రెగడ సుబ్బయామాత్యు నీక్రింది పద్యములోఁ గీర్తించియున్నాఁడు.

సీ. గీ. అట్టి మంత్రిప్రెగడ సత్కులాంబురాశి
సత్కలీనుని సత్కవిస్తుత్యచరితు
నమలగుణాఖ్యుని మద్దేశికాగ్రగణ్యు
సుబ్బయామాత్యు నెపుడు సంస్తుతి యొనర్తు.

ఈగ్రంథమందలి విషయ మీక్రిందిపద్యమువలనఁ దెలియనగును.

ఉ. శౌనక! తెల్పెద న్వినుము చక్రకగాఁ దారకమంత్రరూపకుం
డైన మహాత్ము సచ్చరిత మద్దియు నైహికపారలౌకికా
నూనఫలప్రదం బనుచు నొప్పుగ ధర్మజుతోడ నారదుం
డానతి యిచ్చులాగు మును వ్యాసులచేతను విన్నదంతయున్.

గీ. పరమభక్తితోడఁ బఠియించె నేనియు
విన్న నేని వారు వీగతపాపు
లగుచు నంతమందు దాము సాయుజ్య
మందగలరు నిర్మలాత్ము లగుచు...

ఈకవి యేకాలమువాఁడో చెప్పియుండలేదు. ఇతఁడు మల్లారెడ్డికృతమైన షట్చక్రవర్తి చరిత్రమునకుఁ బ్రతివ్రాసికొని యుండెను. దానినిబట్టి మడపా లక్ష్మినారాయణుఁడను నాతఁడు భావనామ సం॥ర పుష్య శు ౧౦ శుక్రవారమునాటికి ప్రత్యంతరము వ్రాసికొనియుండెను. మల్లారెడ్డి క్రీ. శ. ౧౬౦౦ సంవత్సర ప్రాంతము వాఁడు. కావున నీకవి యంతకుఁదరువాతివాఁడనుట స్పష్టము. క్రీ. శ. ౧౮౭౫ జనవరి ౧౩ తేదీ భావసంవత్సర పుష్య శు ౧౦ మంగళవారమైనది. ౧౮౧౫ సంవత్సరం జనవరి ౧౬వ తేదీ భావసంవత్సర పుష్య శు౧౦ ఆదివారమైనది. ౧౭౫౫వ సంవత్సరమున వచ్చిన పుష్య శు౧౦ మంగళవారము క్రీ. శ. 1694 లో వచ్చిన భావ సం॥ర పుష్య శు ౧౦, ఆదివారమైనది. 1634 లో వచ్చిన భావ సం॥ పుష్య శు౧౦ శుక్రవారమైనది కావున మడపా లక్ష్మినారాయణ యానాఁటివాఁడు. జగన్నాథ వి యంతకుపూర్వుఁడు. అనఁగా క్రీ. శ. 1600 – 1634 నడుమనుండినవాఁడు. కాబట్టి యీజగన్నాథకవి యంతకుపూర్వుఁడనుట స్పష్టముకాబట్టి యీతనిని క్రీ.శ పదునేడవ శతాబ్దిప్రథమార్ధ ప్రాంతమువాఁడని నిశ్చయింపఁదగియున్నది.

తాళపత్రప్రతి పార్వతీపుర సమీపమందలి మృత్యుంజయ నగరమున లభించుటను బట్టియుఁ గవినామము ననుసరించియు, నీతఁడు గంజాముమండలము వాఁడని నిరూపింపవచ్చును.

ఇంతకంటె నీకవినిఁగూర్చిన విషయములేమియుఁ దెలియ లేదు.



## 430 శివరామలింగకవి



ఇతఁడు వీరశైవాచార సంగ్రహమను మూఁడాశ్వాసముల పద్యకావ్యముగా స్కాందపురాణములోని శంకరసంహితను తెలిగించి నట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. పరమశివతత్త్వశాస్త్ర మేర్పడ వెలుంగు
సరయఁగా స్కాందమను పురాణాంతరమున
ఘనులు శంకరసంహితాఖ్యాన మనఁగ
నది తెనుఁగున రచియింతు నభినవముగ.

ఈకవి గోకర్ణమఠాధిపతియగు సోమశేఖరదేవుని శిష్యుఁడైనట్లీ క్రింది గద్యవలనఁ దెలియవచ్చుచున్నది.

ఇది శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యపూర్ణైకలింగైక్య నిష్టాపద వీరమాహేశ్వర సందోహ చరణకమలషండ మకరందపానమత్త ద్విరేఫాయమాన మానసగోకర్ణ మఠాధీశ్వర పంచవర్ణిగయతిరాయ పట్టభద్ర శ్రీ సోమశేఖరదేవ దివ్య శ్రీపాదారవింద బంభరుండైన

శ్రీనందికేశ్వర కరసీరజగర్భోద్భవుండైన శ్రీరామలింగ ప్రణీతంబైన స్కాందపురాణోత్తర శంకర సుసంహితాఖ్యానంబగు వీరశైవాచార సంగ్రహంబు''.

వీరశైవు లనుష్ఠింపదగిన యాచారము లిందు వివరింపఁబడినవి. ఈకవి యేకులమువాఁడో, ఏగోత్రమువాఁడో యెచ్చటివాఁడో తెలియలేదు గ్రంథరచనాకాలము నీక్రింది పద్యమునఁ దెలిపియున్నాఁడు.

సీ. చనినట్టి శాలివాహన శకాబ్దంబులు
పాటింప వేయునార్నూటిమీఁద
నిరవందఁగా నేఁబదేను ప్రమాదీచ
విమలవత్సరము నాశ్వీజమందు
బహుళతృతీయలో భానువాసరమున
రచియించినట్టి నిర్ణయచరిత్ర
వీరశైవుల సదాచారసంగ్రహతదాఁ
బరిపూర్ణ మయ్యెఁ బ్రబంధరీతి

సముచితాచారనిష్ఠులు సాధుజనులు
నంతరింద్రియబాహ్యేంద్రియాదు లెల్ల
నాత్మలింగాభిమానసాధ్యానుభవులు
శివసమర్చకులై యభ్యసింపవలయు.

దీనినిబట్టి యీగ్రంథము శా.శ. ౧౬౫౫ క్రీ.శ. ౧౭౩౩ సంవత్సరముననఁగా నిప్పటికిన్నూఱు సంవత్సరములకుఁబూర్వము రచియింపఁబడినదని స్పష్టమగుచున్నది. ఈగ్రంథము ముద్రింపఁబడలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందొక తాళపత్రప్రతి యున్నది

—***—

# 431 చెరుకుమూడి కృష్ణకవి

ఇతఁడు పాకనాటియార్వేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వేదామాత్యునకును, అక్కమాంబకును బుత్త్రుఁడు; వేంకటాద్రికి దత్తుఁడు; కృష్ణదేవరాయల యాస్థానకవియగు ధూర్జటికి దౌహిత్త్రుఁడు.

ఇతఁడు శృంగారరాఘవమను పేర శ్రీరామకథను పద్యకావ్యముగా రచియించి కాకేపల్లినారాయణామాత్యున కంకితము నొసర్చెను అందుఁగవి తననుగూర్చి యీక్రింది పద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. గురుతర శ్రీవత్సగోత్రు నాపస్తంబ
సూత్రు నిత్యార్చితసోమగాత్రుఁ
బాకనాటార్వేలవారలలో మేటి
ధూర్జటిదౌహిత్రు దురితదూరు
నలరు వేదామాత్యువలన సుసాధ్వియౌ
నక్కమాంబాగర్భమందు జనితుఁ
డగువాని నల వేంకటాద్రికి దత్తునిఁ
జెరుకుమూడికులేంద్రు వరకవీంద్రు

గీ. దక్షిణామూర్తి కరుణాకటాక్షలబ్ధ
చారుసామర్థ్యనిర్మిత భూరికావ్య
నంది తానేకబుధకోటి నన్ను వేడ్క
దనరఁ బిలిపించి పలికె మోదము దలిర్ప.

ఈతఁడు వామదేవచరితము మొదలగు మఱికొన్ని కావ్యములను రచియించిన ట్లీక్రిందిపద్యములలో నున్నది కాని యాగ్రంథము లేవియుఁ గన్పడుట లేదు.

చ. అనువుగ వామదేవచరితాదిమహోత్తమపద్యకావ్యముల్
మునుకొని యెన్నియైనను బ్రమోదముతో రచియించినావు గా
ఘనుఁడవు నీవు వన్నెఁక...సన్నుతకీర్తనసేయఁగా దలం
చిన నొకభవ్యనవ్యకృతి చేకొయొకంగుము కృష్ణసత్కవీ!

కృతిపతియైన నారాయణామాత్యుఁడు నందవరీ నియోగి బ్రాహ్మణుఁడును, వశిష్ఠగోత్రుఁడును, అయ్యనార్యునిపుత్రుఁడు నై యుండెను.

---

## 432 కంచర్ల శరభనకవి

-***-

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయస గోత్రుఁడు. ఇతని తండ్రి అయ్యవారు, తల్లి నరసమ్మ తాత అయ్యనకవి, ముత్తాత మల్లన ఈకవి వంశమునుగూర్చి యీతని పితామహుఁడైన యయ్యనకవిచారిత్రమున వేఱుగా వ్రాయున్నాఁడను.

ఈశరభనకవి అధ్యాత్మరామాయణమను పద్యకావ్యమును రచియించెను ఈగ్రంథమింకను ముద్రితము కాలేదు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున బాలకాండమును, అయోధ్యా కాండమున గొంతవఱకును గల యసమగ్రప్రతియొకటికలదు. దాని ననుసరించియే యీతని చరిత్రము వ్రాయనయ్యెను.

ఈకవి పూర్వుఁడైన రామన మేడూరు సీమలకు స్థలకరణమై నట్లును, వీరప్రతాపదేవరాయలకు పుణ్యాలో కావాప్తికొఱకై శాశ,

1361 సంవత్సరమున శ్రీకాకుళమందలి తెలుగు వల్లభదేవునకు రాగ భోగాదులనిమిత్తమై పండ్రెండుపుట్లు విత్తనములు చల్లుటకుఁ దగినంత భూమిని దానముచేసి, యాభూమిని యీకంచర్ల రామన వశముచేసి యందుకొకశిలాశాసనమును వేయించినట్లును కవియీక్రిందిపద్యము లో వర్ణించియున్నాఁడు.

సీ. శోభితాపస్తంబసూత్రుఁ డాత్రేయసగోత్రుఁడు, కంచెర్లకులపవిత్రుఁ
డలరు మేడూరిసీమలమూలమున కెల్ల స్థలకరణంబైన ధన్యచరితుఁ
డిలసప్తసంతానములునిల్పి ప్రఖ్యాతిఁగైకొని రాజిల్లెఘనులు మెచ్చ
నిత్యాన్నదాన నిర్నిద్ర వైభవసంపదలు పెంపువాటింపఁ దనరునట్టి
దానకర్ణుండు సత్యవ్రతానువర్తి
విబుధసంస్తూయమానార్హ వితతకీర్తి
సరసవిశ్రుత రామన శంభుమూర్తి
సరవిముఖ్యుండు ధార్మికచక్రవర్తి.

సీ. శకవత్సరంబులు శశిబుతుగుణచంద్రులగుక్రోధనాబ్దంబునందు భాద్ర
పదశుద్ధద్వాదశి భానువారంబున భూపతివీరప్రతాపదేవ
రాయలకును బుణ్యమాయతంబుగఁ గొండ, పలికెసనెడియలు కేమి తెలిసి
ణంగుచు వీరెననిరంగ రాయనిగారు వీనా మొసంగిరిభూనుతముగ

గీ. నెలమి శ్రీకాకుళంబున వెలయు తెలుఁగు
వల్లభస్వామి కతిభక్తి వర్ధిలంగ
సముతుపడిపిన్నతిరువడిఘుములుకున్ను
అంగరంగవైభవముల కమరమటియు

కవితాతయైన యయ్యనకవి చాలధార్మికుఁడై కాశీఖండమును ద్విపదగా రచియించినట్లు నీక్రింది పద్యములవలనఁ దెలియవచ్చు చున్నది.

సీ. కృష్ణాపురంబునఁ గీర్తి నానందింప, మేడూరిపురమునఁ బ్రబలఁ దమలర
నాగేశ్వరుని సురనాథు మార్కండేశు, స్థిరబుద్ధితోడఁ బ్రతిష్ఠ చేసి
వనములు బావులు ఘనముగా వేయించె మధురాపురమునఁ శ్రీవ
మనుజకోటి
కృష్ణవేణికిఁ జనఁ గృపనూఁది తావులు బ్రేమనిల్పెను భక్తివృద్ధిఁ బొందఁ
గలితరచనలు కుల్కెడు పలుకు లమర
శబ్దనాటకాలంకార సరణులొప్పఁ
జెలువు మెఱయఁ గాశీఖండ మెలమి ద్విపదఁ
జేసెఁ గంచర్ల యయ్యన శ్రీలుప్రబల.

ఈ కాశీఖండమింతవరకును లభింపలేదు.

శరభనకవి తనవంశము వారికి గురువైన యన్నమారాధ్యుల నిట్లు కొనియాడియుండెను.

గీ. పరమమాద్గల్యగోత్ర విప్రభి జితుండు
రమణ రాజేంద్రు డన్నమారాధ్యులెలమి
వసుధ కంచర్లవంశము వారికెల్ల
గురువులై చాల విఖ్యాతిమహిమ మెఱయ.

గ్రంథాది పద్యమిది.

ఉ. శ్రీకరులబ్జధారణులు సింధుసముద్భవభూషితుల్ దయా
లోకనులార్యభక్తజనలోలులు నాదిమదంపతుల్ సురా
నీక మునీంద్రవందితులు నిత్యవిభూతు లుమామహేశ్వరుల్
మాకొనగూర్తురాత మనమాన కవిత్వపటుత్వసపదల్.

ఈకవి పింగళి సూరనార్యునిని, తెనాలి రామలింగని బూర్వకవులనా గా స్తుతించియుండుటచే పదునేడవ శతాబ్దమునకుఁ దరువాతివాఁడనుట స్పష్టము.

శైలి తెలియుటకై యొక పద్యము.

చ. విమల విచార ధీరబల విక్రమశాలివి నిన్నుఁ బొంగుదున్
సమయము గాదు సుమ్ము రఘుసత్తమ దృశ్యములైనయట్టి రా
జ్యములు శరీరముల్ నిజములై నఁ బ్రయాసము మేలుగాక! దుః
ఖములకు మూలమై ధ్రువము గాదది గానఁ బ్రయాస మేటికిన్.

—※o※—

## 433 వక్కలంక వీరభద్రకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు; భాస్కరామాత్యకవి పుత్రుఁడు; చంద్రశేఖరామాత్యకవి పౌత్రుఁడు.

ఇతఁడు వాసవదత్తాపరిణయమును నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి పీఠికాపుర సంస్థానాధిపతులగు రావుమాధవరాయభూపతి కంకితము చేసెను. ఈకవి గౌరీకళ్యాణమును నింకొక ప్రబంధము రచియించినట్లు తెలియుచున్నది. కాని యది యిప్పుడెచ్చటను లభించుట లేదు.

వాసవదత్తా పరిణయమునందుఁ గవి తనవంశము నిట్లువర్ణించి యున్నాఁడు.

సీ. పాత్రిభారద్వాజగోత్రుఁడౌ మాచప్ర
ధాని యేఘునపుణ్యుతాత తాత
సహజపాండిత్యభాస్వరుఁ డగు మార్కాండ
దండేశుఁ డేమంత్రి తాతతండ్రి
చారుభాషాఫణీశ్వరుఁ డల కొండన
త్కవివర్యుఁడే గుణోత్తరుని తాత
వివిధశాస్త్రరహస్యవేదియౌ చంద్ర
శేఖరుఁ డేకవీంద్ర శేఖరుని తండ్రి

యట్టిగుణధాము వక్కలంకాయాన్వయాబ్ధి
సోము జగ్గాంబికాప్రియు సుజనగేయు
మజ్జనకు భాస్కరుని మృదుమధురవచన
రచన మెప్పింతు మది నెంతు బ్రణుతి సేతు.

చ. దినదినమున్ సమస్తజగతీవరవర్య సభాంతరంబులన్
దన మధురప్రబంధకవితాలసదుక్తిసుధారసంబు స
జ్జనులకు వీనుపండువులు సల్పఁగఁ బ్రస్తుతిఁ గన్న ధన్యు మ
జ్జనకసహోదరున్ సుగుణసాంద్రుని లింగకవీంద్రు నెంచెదన్.

ఆశ్వాసాంతగద్యలో తనను గూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు. "ఇది శ్రీవక్కలంక చంద్రశేఖరమహాకవి పౌత్ర భాస్కర సుకవి పుత్ర విద్వజ్జనవిధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా పరిణయంబు".

ఈగద్యపద్యములనుబట్టి కవితండ్రియైన భాస్కరునకు దండ్రియైన చంద్రశేఖరుఁడును, బినతండ్రియైన లింగనామాత్యుఁడును, తాతకుఁ దండ్రియైన కొండయామాత్యుఁడునుగూడ కవులైనట్లు తెలియుచున్నది కాని, వారేయేగ్రంథములను రచించిరో యిందు చెప్పలేదు. వారిగ్రంథములు నిప్పుడు గానవచ్చుటలేదు.

కృతిపతి పిలిపించి తనను గూర్చి నుడివిన వాక్యములను గవి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈపద్యములనుబట్టి కవి తండ్రియుఁ దాతయుగూడా పిఠాపురసంస్థానమున గవులుగానున్నట్లు కనఁబడుచున్నది.

శా. శ్రీమచ్చంద్రకలాకిరీటపదరాజీవద్వయీభావనా
సామర్థ్యోదిత వాక్ప్రపంచఘటనాచాతుర్య విద్వజ్జన
స్తోమానందదశేముషీనిజనిలాసు న్వక్కలంకాన్వయుం
బ్రేమాత్యాస్పదు వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్

క. తాతల తరమునునుండియు
నీతని జనకుండు మనకు హితుఁడు కవీంద్రుం
డీతని చేతను గృతి వి
ఖ్యాతిగఁ గైకొందు ననుచు హర్షం బొదవన్

గీ. సవినయంబున సముచితాసనమునందు
నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞ యొసఁగి
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు
నతివయాస్ఫూర్తి నిట్లని యాన తిచ్చె

క. శ్రీ వెలయ నుభయభాషల
నీవలెఁ గృతి సేయఁగలరె నేఁటి కవీంద్రుల్
భూవిశ్రుతకవితావి
ర్భావయశస్సాంద్ర! వీరభద్రకవీంద్రా!

సీ. మీ తాత లోకవిఖ్యాతభాషాబల
శేషాహియౌ చంద్రశేఖరుండు
మీ తండ్రి చాటుగాథాతతచిత్రప్ర
బంధకల్పనశాలి భాస్కరుండు
మీ తల్లితండ్రి పురాతనసత్కవి
నాథులకెన విశ్వనాథసుకవి
మీ మేనమామ సుత్రామవైభవుఁడు స
ద్యఃకృతిమతి వేంకటాద్రిసుకవి

చదువకే శ్రీసతీశ ప్రసాదగరిమ
బాల్యమున నే సుమారసంభవముఁ దెనుగుఁ
జేసి కవులెంచఁ బ్రఖ్యాతిఁ జెంది తీవు
కలరె నీసము లాధునికులు కవీంద్ర.

నిరోష్ఠ్యహరిశ్చంద్రచరిత్రము, శేషధర్మములాదిగాగ్రంథముల నాంధ్రమునను, పారిజాతాపహరణము సంస్కృతమునను రచియించిన వెలుతురుబల్లి విశ్వనాథకవి మనవీరభద్రకవికి మాతామహుఁడు. ఈవిశ్వనాథకవికుమారుఁడైన వేంకటాద్రికూడకవియే. వారురచించిన గ్రంథముల పేరులను ఏలకో యీవీరభద్రకవి తనపొత్తమున బేర్కొని యుండలేదు ఈతఁడు చెప్పలేదుకదాయని యీతని తండ్రితాతలు కవులైనను గ్రంథములను రచింపలేదనితలంపరాదు. కొందఱుకవులు, తమపూర్వులు రచించిన గ్రంథములనామములను తమగ్రంథములలోఁ జెప్పికొను నాచారముకలదు. కొందఱు తమపూర్వుల గ్రంథములు తమకు లభింపకయో, తెలియకయో, లేక వారిగ్రంథముల పేరులును వారిపేరులునుజగద్విఖ్యాతములై యుండ తాము చెప్పనెందులకనియో పూర్వుల గ్రంథనామములను దమగ్రంథములయందుఁ జెప్పకుండ మూకీభావము వహించియుండిరి. విమర్శకులును, చరిత్రకారులును నట్టిమూకీభావమునకభావమేయర్థమని చెప్పుచుఁ దమవిమర్శనములను జరిత్రములను గొనసాగించుచున్నారు. అందువలనఁ గొన్నితావులలో సత్యమసత్యముగుటయు, నసత్యముసత్యముగుటయుఁదటస్థించుచుండును. ఈ వికమారసంభవము నింతకుఁబూర్వము రచియించిన ట్లీపై పద్యము వలనఁ దెలియుచున్నది. అదియింకను లభింపలేదు. అందుతమపూర్వులు రచించిన గ్రంథనామములనేమయినఁజెప్పియుండెనేమో !

ఈ వీరభద్రకవి తన గురువు నీక్రింది పద్యములో నుతిచేసి యున్నాఁడు.

సీ. అంభోధివలయితకుంభినీజననుత
దంభశాంభవకళాజృంభితములు
నంవాహపదారవిందవిశ్వాసమ
రందసంపాదనేందిందిరములు

స్వోత్కృష్టాదరణారాధ్యత్వ లక్ష్మీప్రదా
నక్షమసామ్రాజ్యదక్షిణములు
కూహాపరాత్మబోధాహతస్వాంతసం
దేహలీలాపశ్యతోహారములు
ధీరతాగుణమణిహారి దెందులూరి
లింగగురువర సత్కృపాపాంగవీక్ష
ణములు సతతంబుశుభనిదానంబు లగుచు
శిష్యజనముల దయను రక్షించుఁగాత !

ఈపద్యమునం జెప్పఁబడిన దెందులూరి లింగనారాధ్యుఁడే సుప్రసిద్ధకవిశేఖరుఁడైన కూచిమంచి తిమ్మకవికినిగురువు. ఈవీరభద్రకవియు, కూచిమంచి తిమ్మకవియు, ఈదులపల్లి భవానీశంకరకవియు, ఏనుఁగు లక్ష్మణకవియు సమకాలికులు. "ఎవ్వరేగతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా" యని చేమకూర వెంకటకవి చెప్పినట్లు కవులలో సామాన్యముగా సమకాలికులను మెచ్చుకొనుటయరుదు. కాని యీవీరభద్రకవివిషయమున నాసామాన్యసూత్రము వర్తింపలేదు. ఈతని కవిత్వమునం దుఁగల గౌరవాతిశయముచే

గీ. దిట్టకవివిశ్వనాథుఁ బ్రార్థింతుఁ గొలుతు
నతనినందనుఁ దగు వేంకటాద్రికవిని
వాక్యపూజలు గావించి వక్కలంక
వీరభద్రుని భావింతు గౌరవమున

అని యేనుఁగు లక్ష్మణకవియు,

మ. హరితుల్యుండగు రావు మాధవనృపాలాగ్రేసరుం గావ్యచా
తురి మెప్పించి తదీయసత్కృప సిరు ల్తోరంబుగాఁ బొంది బం
ధుర తేజుండగు వక్కలంక కుల పాథోరాశిరాకాసుధా
కిరణుం డై తగు వీరభద్రసుకవిన్ గీర్తింతు నా నెచ్చెలిన్.

అని యీమదలపల్లి భవానీశంకరకవియుఁ దమతమగ్రంథములలో నీకవినిఁ గొనియాడి యున్నారు.

ఈకవి కాలము హూణశకమున పదునెన్మిదవ శతాబ్దియందుఁ బూర్వార్ధమనుట నిశ్చయము. ఇతనిసమకాలికులచారిత్రములయందుఁ గాలనిర్ణయము నుగూర్చి వ్రాసినవాక్యములే యీకవికిని వర్తించును. పునరుక్తియని యావిషయములనిందు మఱలవ్రాయలేదు. ఈతఁడు రచించిన వాసవదత్తాపరిణయమును క్రీ॥ శ 1897వ సంవత్సరములోఁ, గవి వంశీయులగు వక్కలంక భీమశంకరము గారు ముద్రింపించి ప్రకటించుచుఁ బీఠికలోఁ దాను గవికైదవతరమువాఁడనని చెప్పియున్నారు. ఆయనను బట్టిచూచినను పైనచెప్పిన కాలము సరిపోవుచున్నది.

ఈకవినిగూర్చి ఈదులపల్లి భవానీశంకరకవి చారిత్రమునఁ గొంత వ్రాసియున్నాఁడను కావున నీకవినిగూర్చి చదువునప్పుడందలి విషయములనుగూడ చేర్చి చదువుకొనవలయును.

వాసవదత్తాపరిణయము సంస్కృతమున గద్యప్రబంధముగా విక్రమాదిత్యునియొద్ద గవిగానున్న సుబంధునిచే వ్రాయఁబడినదఁట. దానినాంధ్రమున బద్యకావ్యముగా రచింపుమని కృతిపతిచెప్పినట్లీక్రింది పద్యములలోఁ గవి వ్రాసియున్నాఁడు

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
దిత్యు సభాస్థలంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనధీమగ్రతన్
సత్యవతీతనూభవునిజాడఁ బ్రసిద్ధికి నెక్క నవ్యసా
హిత్యమునన్ సుబంధుసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁగన్న వాఁడిలన్.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు
ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
దారగతిఁ జెప్పె వాసవదత్త యనఁగ
నార్యు లాకథ కడుఁ జోద్య మనిరి సభను.

మ. స్తవనీయంబగు తత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర
న్నవమంజీరనినాద మేదుర నితాంతప్రౌఢవాగ్గుంభవ
ద్భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భీగతిం గూర్చుత
త్కవినవ్యోక్తులు గొన్ని నీకవితకున్ గైదండ గావింపఁగన్

క. వరమతివాసః దత్తా
పరిణయమనఁ జెప్పి యీప్రబంధము విద్వ
త్వరిగణ్యంబుగ మాకుం
దిరముగ నంకితము సేయు ధీరవిచారా !

కృతిపతివంశమును గవి యించుమించుగ నూఱు పద్యములలో వర్ణించియున్నాఁడు గ్రంథవిస్తరణభీతిచే నావిషయముల నిటమాని కృతిపతిని యాయన సతీమణిని వర్ణించిననాల్గుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

సీ. పరభీకరఁబైన వరదుర్గముఘటించె
మేటిగాఁ జామర్లకోట వద్ద
యవనప్రభుని చేత జవనాశ్వము
లగణియారంబు గజములఁ నందుకొనియె
బారుహామన్నె భూపాలోత్తములు నిజా
జ్ఞావశులైయుండ ఠీవి నలరె
వృత్తులు గల్పించి విశ్రుతంబుగ విప్ర
సమితికి నగ్రహారములఁ నొసఁగె

శ్రీరమాధవకరుణావిశేషలబ్ధ
వైభవంబున ధారుణీవలయు మేలి
రావుకులవార్ధిసోముఁడై ప్రతిభఁ గాంచెఁ
బ్రథితయశుఁ డెన్న మాధవప్రభువరుండు.

సీ. శ్రీరస్తు కరవాలభైరవఖడ్గనా
రాయణ కాకతిరాయరాజ్య
సంస్థాపనాచార్య జగనొబ్బగండగం
డరగండ రేచర్లవరకులీన
ప్రతిగండభైరవపంచపాండ్యవిభాళ
యరిరాయరాయవేశ్యాభుజంగ
మండలీకరగండగండగోవాళ
యాహవభీమచౌహత్తిమల్ల
గాయగోవాళకేళాదిరాయబిరుద
యనుచుఁ గైవారము లొనర్తు రనుదినంబు
నతులవాక్ప్రౌఢితోడ నర్థార్థు లెల్లఁ
బ్రమదమున రావుమాధవప్రభుని సభను.

క. జూపల్లి నారసింహ
క్ష్మాపతిసుత రమణమాంబికామణి నిజయ
శ్రీపూర్ణ మహిమ మాధవ
భూపతి వరియించె హర్షమున జను లెంచన్

పీఠికాపుర సంస్థాన ప్రభువుల వంశవృక్షమును గొంతవఱకు కూచిమంచి తిమ్మనకవి చారిత్రమున నిచ్చియున్నాఁడను కావున దాని నిచ్చుట పునరుక్తియగునని మానితిని. కాని, రావువారి మూలపురుషునిఁగూర్చి యొకచిత్రగాథనీతఁడు గ్రంథస్థము చేసియుండుట చేతను నందుఁ గొన్ని విమర్శనీయాంశములుండుటవలనను ముందుగ నందుకు సంబంధించిన పద్యములనిట వ్రాసి పిమ్మట నందలి విషయములను జర్చింతును.

ఉ. సారవిచారు లార్యజనసమ్మతు లాహవశూరు లర్థిమం
దారు లవార్యవిక్రము లుదారులు మానవతీమనోహరా
కారులు వర్ణనీయగుణగణ్యచరిత్రులు దుష్టశత్రుసం
హారులు రావుసత్కులమునం దుదయించిన వార లందఱున్.

వ. వారిలోన.

మ. నలకూరాకృతి కాకతీంద్రజయసంధానైకధౌరేయుఁ డు
జ్జ్వల తేజోబలభాసమానుఁడు జగత్ప్రఖ్యాతచర్యుం డనా
విల బేతాళకృపాత్త వైభవుఁడనై బేతాళరాణ్మేదినీ
వలయాధీశ్వరశేఖరుం డలరుఁ దద్వంశాగ్రగణ్యస్థితిన్.

క. అతని తనూభవుఁడై సం
తత దానకలాకలాపదక్షుఁ డగుచున్
నుతగుణుఁడగు పెదసింగ
క్షితిపతి వైభవము గాంచి చెలఁగుచునుండెన్.

సీ. అయ్యెడ సూర్యవంశాంభోధిచంద్రులై
విక్రమక్రమలీల వెలయు నుదయ
పురపురాణావారి వరకుటుంబంబులో
నుండి వెల్వడి మహోద్దండశక్తిఁ
బూసపాటి కులోద్భవుండైన మాధవ
వర్మయన్వసుమతీవల్లభుండు
విపులసైన్యముతోడ బెజవాడ చెంత న
ప్పెదసింగక్షమావిభువరేణ్యు
సురపురీవరసౌఖ్యభాసురుని జేసి
జైత్రయాత్రాభిలాషచే సరవి నాతఁ
డావిగొండ పురాదిగోత్రాధిపతులఁ
బటుతరభుజబలాసూన పటిమ గెలిచి.

క. అజచంద్రపయోరాశి
ద్విజరాజుల హరాణశకము వెలసెడు నెడఁ ద
ద్విజయస్తంభచయంబుల
నిజకీర్తు లెసంగ నచట నిలిపెం గడిమిన్.

క. మఱియు ననేక మహీశుల
దురమునఁ దునుమాడి విజయదుందుభు లెసఁగన్
వరరామేశ్వరనగరీ
పరిసరమున కేగి మరలి వచ్చెడు నంతన్.

చ. వరయశుఁడైన సింగవిభు పట్టపుభామిని యంతకంటె మున్
బరువడి చూలుదాల్చుటను బ్రాణవిభూత్తముతోడఁ బోక బం
ధురతరువారఘోరమృగదుర్గమకాననమండలంబులన్
సరగున నేగి యేగి యొక చారుతరంబగు నగ్రహారమున్.

గీ. భువనగిరిచెంతఁ గనుఁగొని భువనవిదిత
వేదవేదాంగవేదియౌ విజ్ఞమూర్తి
కులజుఁడైనట్టి పరిసన్నగురునివలన
బహుకృపాస్ఫూర్తిఁ గాపాడబడుచునుండె

క. ప్రకటపరాక్రమజితరిపు
నికరుండగు మాధవాఖ్యనృపమౌళి మహో
త్సుకవృత్తిం గర్ణాక
ర్ణికఁ దెలిసికొనెం దదీయవృత్తాంతంబున్

చ. తెలిసి తదగ్రహారమున నతిత్వరితంబుగఁ జేరి యాతఁడ
చ్చెలువ వధింపఁ బూనఁగ నృసింహబుధుండు మదీయపుత్రికా
తిలక మటంచు నిశ్చలమతిన్ శపథోక్తులు పల్కి నేమియున్
సలుపఁగ లేక వెండియును జయ్యన నేగె స్వకీయపద్ధతిన్.

క. అంత నొకనాఁడు రిపుదు
ర్దాంతబలుండైన పుత్రరత్నంబును ద
త్కాంతాజనతామణి య
త్యంతశుభాకరముహూర్తమందుం గనియెన్.

క. అతనికి ననపోతమహీ
పతియను నామంబు నుంచి భాసుర విద్యా
చతురునిఁ జేసె నృసింహ
క్షితిసురమణి గనికరంబు చెన్నువహింపన్.

సీ. సంగీతసాహిత్యసకలవిద్యాప్రౌఢి
నురుతరశస్త్రప్రయోగపటిమ
వాహనవారణారోహణైకనిరూఢిఁ
బటుబాహుబలశౌర్యపటిమ నలరి
వైరులసాధింపఁబగఁబూని యుత్సాహ
లీలనవ్వోడ మహమ్మ్యాలనంగఁ
జెలఁగు నచ్చిద్రకర్ణుల సహాయతనొంది
వెండియు నురుధాటి విజయవాటిఁ

గరము భీకరమైన సంగర మొనర్చి
యరిమహీపాలవరు స్వసైన్యముగఁ దునిమి
విశ్వవిశ్వంభరాధీశవినుతమైన
విజయమును గాంచె ననపోతవిభూవరుండు.

పిఠాపురసంస్థానాధిపతులైన రావువారికి బేతాళనాయకుఁడు మూలపురుషుఁడై నట్లుపైన వ్రాసిన "నలమూరాకృతి" అనుపద్యములో నున్నది. నెల్లూరు మండలమందలి వెంకటగిరి సంస్థానాధిపతులగు వెలుగోటివారును, విశాఖపట్టణమండల బొబ్బిలి సంస్థానాధిపతులగు రావువారును, కృష్ణా మండలమందలి మైలవరము, జటప్రోలు సంస్థానాధిపతులును గూడ తమతమ వంశములకీ భేతాళ నాయకుఁడే మూలపురుషుఁడని యంగీకరించుచున్నారు. ఈసంస్థానాధిపతులు తమ తమ సంస్థాన చారిత్రములను వేఱువేఱుగా ప్రకటించుకొనియున్నారు. వారివారి పూర్వుల చారిత్రములను దెలుపు కొన్ని సందర్భములలో

నాయాచారిత్రములు భిన్నాభిప్రాయములను దెలుపుచున్నవి వాటితో మన కిట ప్రసక్తి లేదు వీరభద్రకవి చెప్పిన వంశవృక్షమును, యిచ్చిన కాలమును, జారిత్రకదృష్టితోఁ జూచిన నందెంతవఱకు సత్యమున్నదని యోచింపవలసియున్నది

పైనచెప్పిన బేతాళనాయఁడే పిల్లల మఱ్ఱిబేతిరెడ్డియనియు, నీతని భార్యయే పిల్లల మఱ్ఱిశాసనమును వ్రాయించిన ఎఱ్ఱకసానియనియు, పిఠాపుర సంస్థాన చరిత్రకారులు వ్రాసియున్నారు ఈవిషయమింకను సంశయాస్పదముగానున్నది. పిఠాపురసంస్థాన చరిత్రము ఈబేతాళనాయనికి, దామానాయఁడు, ప్రసాదాదిత్యనాయఁడు, రుద్రనాయఁడు నను ముగ్వురు పుత్రులున్నారని చెప్పుచున్నది. వెలుగోటివారి వంశావళి యందుముగ్వురేకాక మల్లానాయఁడను మఱియొక పుత్రుఁడున్నాఁడని నుడువుచున్నది. తెలంగానాశాసనములను గ్రంథమున ప్రచురింపఁబడిన గార్ల శాసనమునందీ దిగువ శ్లోకములలో బేతభూపతికొడుకు బొప్పయయనియు, నాతని తనయుఁడు గణనాథుఁడనియు, నాతనితనయుఁడు బొప్పయయనియుఁ జెప్పఁబడియున్నది.

"నానాసేనాధిపాజాతాశ్చతుర్థకులవల్లభాః
తత్ర రేచర్లవంశోభూత్ ఖ్యాతిమాన్బేతభూపతిః
తస్యాసీత్తనయో బొప్పయాహ్వయః కులభూషణం
తత్పుత్రో గణనాథాఖ్యస్తస్యసూనుః పరంతపః
బొప్ప రాయ ఇతిఖ్యాతశ్రీమన్సామంత శేఖరః
విశ్వేశ పాదపంకేజ భ్రమరీభూత చేతసః

ఈబొప్పరాయఁడే దానశాసనకర్త, దానశాసనకాలము శా.శ ౧౨౦౯వ సంవత్సరము బేతిరెడ్డి శా.శ ౧౧౩౦కుపూర్వముండినవాఁడు. ఆతని భార్య ఎఱ్ఱకసాని వ్రాయించిన శాసనకాలము శా.శ ౧౧౩౦. బేతిరెడ్డియొక్క మునిమనుమఁడు శా.శ. ౧౨౦౯లో నున్నాడన్నచో

నందు విపరీతమేమియును లేదు. రావువారికిని వెలుగోటివారికిని మూల పురుషుఁడు బేతాళనాయఁడు కావచ్చును. కాని ఆతఁడెఱ్ఱక్కసాని భర్తయనిగాని, పిల్లలమఱ్ఱి శాసనమున వర్ణింపఁబడిన బేతిరెడ్డియనిగాని నిశ్చయించుటకుఁదగిన యాధారములు లేవు. రావువారిమూలపురుషుఁడైన బేతాళనాయకుఁడు బేతాళకృపాత్రవైభవుఁడు. ఎఱ్ఱక్కసాని భర్త బేతాళానుగ్రహమును బొందినట్లు శాసనమున లేదు. బేతిరెడ్డికిఁ గల బిరుదప్రశస్తిలో బేతాళ కృపాత్తవైభవసూచకమగు బిరుదు లేదు. కావున బేతిరెడ్డిని బేతాళనాయనిగా దలంపవీలు లేదు.

సుప్రసిద్ధచరిత్రకారులగు బ్ర. చిలుకూరి వీరభద్రరావుపంతులు గారు ఆంధ్రులచరిత్రములో బేతిరెడ్డికుమారుఁడు మల్లయనాయకుఁడని వ్రాయుచు నాసందర్భమున పైన వ్రాసిన బొప్పరాయనిగార్ల శాసనమునుబట్టి బేతిరెడ్డికి బొప్పయయనుకుమారుఁడున్నట్లు కనఁబడు చున్నదనియు నాతఁడు వేఱొక బేతిరెడ్డియైయుండుననియు, సంశయ మునుజూపిరి.

చరిత్రకారులలో భిన్నాభిప్రాయములుగలవిషయము కావున పాఠకులకన్యగ్రంథాపేక్ష లేకుండుటకై గ్రంథవిస్తరణభీతి మనమున నున్నను, పిల్లలమఱ్ఱి గార్లశాసనములు రెండింటిని నీక్రిందనిచ్చు చున్నాఁడను.

పిల్లలమఱ్ఱిశాసనము (తూర్పు).

శ్రీపాదబ్జద్వయంతస్యస్తు మహేశపార్వతీపతేః
ప్రభావాస్త్రీదశేంద్రాణాంయత్ప్రభావాబ్ధిబిందవః ॥

బ్రహ్మాబ్రహ్మాయ యస్యతనుతే శ్రీమజ్జటామండలే
చంద్రగిరావివాతుణరుచోతుంగేనగంగేద్యుతిం
కాలంకాలమజీగమత్సరభసంయశ్వేతఘాతోద్యతం
శంభుశ్శంభుముఖామరస్తుతపదశ్శ్రేయాంసిదిశ్యాత్సవః ॥

సమ్యగ్భక్త్యా సరసిజభువా విష్ణునాతిగ్మదామ్నా
గీర్వాణాంధ్రైర్దితిజపతిభిర్మానవేంద్రైర్మునీంద్రైః
ధన్యైరన్యైరపి సువిహితాసు ప్రతిష్ఠాః ప్రతిష్ఠా
యస్యైవాసీత్త్రిభువనవిభుర్భాతిభూతేశ ఏకః ॥

ఈశాదేశాత్సరసిజభువః కుర్వతస్సర్వసర్గం
నిత్యస్తుత్యాచ్చరణయుగలాద్దేవవిడ్భిర్మహద్భిః
కుర్వన్ వర్యం సమజని కులం తంత్రవిత్రాసితారి
ర్బ్రహ్మాఙ్ఘ్రోర్యభూద్రణవితరణప్రౌఢతారూఢకీర్తిః ॥

తద్వంశే సమజాయతాయతభుజాముచ్చశ్శ్రియస్సంశ్రయ
శ్శత్రుక్ష్మాధిపగంధసింధురఘటాసంహారకంఠీరవః
నానాదానవిశేషతోషితసురక్షోణీసురస్సద్గుణ
వ్రాతప్రీతవివేకలోకవిహితస్తోత్రైర్జగత్యూర్జితః ॥

గాంభీర్యయుక్తః పురుషోత్తమాద్రియః
ప్రఖ్యాతరత్నః సుమనోర్థితార్థదః
వాహిన్యధీశస్సదృశస్సరిత్పతేః
కాటాహ్వయస్తస్య సుతస్సుధీస్తతః ॥

కామాహ్వయస్తస్య సుతస్తత
శ్రీర్మితాబ్ధిసంవృద్ధివిధౌ సుధాంశుః
విద్వేషివర్గోద్భటశౌర్యదర్ప
ధ్వాంతౌఘ విధ్వంసవిధానభానుః ॥

యస్మిన్నోర్వ్యధరిధ్వధారిణిరణే సంజాయతే స్మార్యతాం
కాండోత్ఖండితచండశాత్రవచమూరుండావలీ తాండవం
తాలోత్తాలకరాలకాలనినదద్భేతాలజాలాతత
స్ఫాలాభీలవిశాలతాలవిలసత్కోలాహలోన్మీలితం ॥

సంపూజయద్దేవతతుష్టికారిణీ
దానైర్వ్రతైర్దీనజనార్తిహారిణీ
విశ్వంభరావిశ్రుతకీర్తిధారిణీ
కాచాహ్వయాతస్యసధర్మచారిణీ ॥

తస్మాత్తస్యాంసమజనిమహాదేవపాదాబ్జభక్తః
ఖ్యాతోబేతస్తతవితరణప్రీణితప్రాణివర్గః
ఆశాచక్రప్రసృతతతశరచ్చంద్రసాంద్రాంశురమ్యా
యస్యాత్యూర్ణంజనసుఖసముత్పాదినీఖ్యాతికీర్తిః ॥

శైలేంద్రాయితకుంజరంపరితతోలీలాయితాశ్వావలీం
తోయాఘాయితహస్తినంహతిముకూపారాయితాంద్విట్చమూః
యుద్ధేయఃప్రలయాయితేషుసహసాభాస్వత్ప్రతాపోన్నతి
ర్యస్తిత్తాలశిఖాయితేననయతిక్రోధేనసర్వాంశ్రియం ॥

ఆచారప్రభవోమనీషిభినుతఃప్రాప్తోత్తమేరాజయః
సుజ్ఞాతాగ్రణినాంప్రతీతసుకృతఃఖ్యాతద్విషద్బాష్పదః
నిత్యస్తుత్యబృహన్మహాబహువరైర్భవ్యైర్గుణైర్భాజితాయః
...వసుత్యాదదతేప్రీధృళంయస్మాద్విజాస్సాధవః॥వచనాశ్శైవః ॥

భార్యాస్యసర్వైస్సుగుణైస్సమేతా
బ్రాజిష్ణుతేజోనిధిరెఱ్ఱపాఖ్యా
యస్యాఃపృథివ్యాంప్రవిభాతివంశః
ప్రఖ్యాతసత్పూరుషరత్నవార్ధిః ॥

తస్మిన్నభూన్నిర్మలధర్మయుక్తో
భీమాహ్వయోనాయకదుర్జితాజిః
సర్వార్థితార్థస్యసదాప్రదాతా
యఃకల్పవృక్షప్రతిమఃప్రసిద్ధిః ॥

శితాశక్తి ప్రథితయశసాయస్సనానావిధే
స్త్రీదుర్వారాతేప్రపతతిజవాద్వైరిపృథ్వీశసైన్యం
తాదృగ్జాతారిపుబలచ్ఛేదనం ధర్మసేవ్యం
యాదృగ్వ్రజేనిపతతిశిరశ్ఛేదనం వస్త్రఖండం॥

అద్రీశ్వరోయోధైర్యేణ భోగేన త్రిదశేశ్వరః
యక్షేశ్వరస్సమృద్ధ్యాచసన్నంగూరుపురేశ్వరః॥
తస్మాన్మహిమ్నామహితాసమేతా
లోకస్తుతాదెజ్జమనాయకోభూత్.

యోదేవభూదేవగణాన్గుణాఢ్యః
ప్రీతాన్ప్రభూతైర్వ్యదధద్ధనాద్యైః॥

యుద్ధేధృతంశస్త్రవరమ్మహాసిం
దృష్ట్వాస్ఫురంతంయుధిభీతిభాజాం
శస్త్రాణిపేతుర్భువిశాత్రవాణాం
త్రాణాయనూనంనిజభర్తృమూర్ధ్నం॥

తనయోవినయోన్నతస్తదీయః కాటమనాయక ఇత్యుదారకీర్తిః
పురుషార్థపరేణయేనయత్నాత్పరితోషః సతతంసతామకారి॥

పదోల్లాసివిధాయినోఖిలజగత్సామ్రాజ్యస్ఫురత్తేజస
స్పందోహైః పరితస్థితైసుమనసాంసంస్థూయమానోన్నతేః
ధ్వస్తాశేషతమస్సతేజ్జ్వలతనోర్యస్యోదితస్యాగ్రతః
సూర్యస్యేవజహుర్మహాంస్యరిగణాఃఖద్యోతసంఘాఇవ॥

ముఖోద్గతామ్నాయతయామహోన్నతే
సరస్వతీశైస్సుమనోగణస్తుతః
మహీసురైస్స్వాభిమతైర్యుతాసభా
విరాజితాయస్యవిరించిసన్నిభః॥

భార్యాసుధీసన్నుతసద్గుణౌఘశ్రీరెడ్డిపాఖ్యా నృపవరస్య తస్య
నిత్యానుకూల్యేన ససంతు తోషధర్మార్థకామప్రకరేణ యస్యాః॥

ఉత్తరము :

తత్పౌత్రయోరుత్తమయోర్గుణౌఘ
స్తుత్యోర్జితశ్రీనిధిరెడ్డిపాఖ్యా
యస్యాశ్చరిత్రాణివరాణిసర్వా
లోకః పవిత్రః కిముతాన్వయస్య ॥

నేత్రోత్సవస్సర్వజగజ్జనానాం
రూపప్రకర్షః ప్రవిచారియస్యాః
దృష్టః పరంయాఽవిశేషదృష్టాం
రంభామపి ప్రేపయతేదృఢంయః ॥

అరుంధతీయద్యపిసుప్రసిద్ధా। పతివ్రతానాముపమానభూతం
తథాపిసంప్రత్యమానమత్ర। యాంమన్యతేమాన్యగుణైర్గుణౌఘః ॥
సర్వేషుధర్మేషుపతివ్రతాత్వా। ధర్మేధికప్రీతిసమన్వితాయాః
య్యైవాఖిలాశాః పరిపూరయంత్యాఃప్రీణాతిచిత్తంశివవల్లభాయాః॥
గౌరీపదాంభోరుహయుగ్మభూరి। భక్తిప్రభావార్జితభవ్యభాగ్యః।
యాం కల్పవల్లీసదృశీం శ్రితానాం। సంపత్సమృద్ధి స్సతతం జనానాం॥

కావున బేతాళనాయని తనూభవుఁడు పెదసింగభూపతియని వాసవదత్తాపరిణయమున వ్రాసిన వ్రాత పొరపాటు. పెదసింగభూపతి తండ్రి ఎఱ్ఱదాచానాయఁడు.

ఈ పెదసింగభూపతి మాధవవర్మచేఁ జంపఁబడియెననియు, నీతని కనపోతానాయఁడు జన్మించెననియు, నతఁడు వింజమూరి నరసన్న యను బ్రాహ్మణుని చేఁ బెంపబడియెననియు వాసవదత్తాపరిణయమున వ్రాసిన కథ సత్యమైనట్లు పిఠాపురసంస్థాన చరిత్రకారులంగీకరించుచున్నారు. కాని వెలుగోటివారివంశావళి వింజమూరి నరసన్నగారికథను తెలుపుట

లేదు. పెదసింగభూపతినాటి కాతని కనపోతనాయఁడు మాదానాయఁడు అను పుత్రులు తనయులుండి, యాతని శవదహనమునకు పూర్వమే శత్రు సంహారము చేసి, పగదీర్చుకొనిరని వ్రాసియున్నారు. ఈ పెదసింగభూపతి మరణకాలము, వాసవదత్తాపరిణయమున హూణశకము ౧౪౧౯ అని పైన వ్రాసిన "అజచంద్ర" యను పద్యములో నున్నది కాని ఈకాలము సరియైనదిగాఁగన్పడదు. పెదసింగభూపతి కాలమునకు హూణశకము ప్రచారములో లేదు. వక్కలంక వీరభద్రకవి కాలమునగూడ హూణశకమీప్రాంతములయందంతగా వాడుకలో లేదు వీరభద్రకవి పెదసింగభూపతి కాలమునకు సమానమైన హూణశక సంవత్సరములను లెక్కించి యాపద్యము వ్రాసెననుటకూడ సమంజసముగాఁగన్పట్టుట లేదు. అందుచే నాపద్యము ప్రక్షిప్తమేమోయని సందియముగానున్నది. పైన చెప్పిన కాలము శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగమ నేని దర్శించిన కాలముతో సరిపోవుచున్నది. ఈ పెదసింగభూపతియే సర్వజ్ఞసింగమనీఁడని యెంచితిమేని, ఆతనికనపోతునాయఁడను తనయుఁడుండవలదా? ఎట్లుచూచినను వాసవదత్తా పరిణయమునఁ జెప్పఁబడిన కాలము సత్యముకాదు.

అనపోతనాయనికి, మాదానాయఁడను తమ్ముఁడున్నట్లు వెలుగోటివారివంశావళిలో నున్నది పిఠాపురసంస్థానచరిత్రకారులును మాదానాయఁడున్నట్లు గీకరించుచు నీతఁడు ను అనపోతానాయఁడును కవలపిల్లలయి యుండవలయును లేదా మాదానాయఁడగ్రజుఁడై యుండవలయును అని వ్రాసియున్నారు. వాసవదత్తా పరిణయమీ మాదానాయని ప్రశంసయెత్తలేదు. వింజమూరి నరసన్నగారికథను నమ్మితిమేని, అనపోతానాయనికి తమ్ముఁడుండుట యసంభవము. ఈ యసాధ్యమును సాధ్యముగా జేయుటకై పిఠాపురసంస్థానచరిత్ర కారులు కవలపిల్లలకథ చెప్పిరి వెలుగోటివంశావళివారు వింజమూరి నరసన్న గారికథను దలపెట్టరైరి. వాసవదత్తా పరిణయకర్త యీమాదానాయ నిని తలపెట్టనే లేదు.

కవితాశైలి తెలియుటకై వాసవదత్తాపరిణయము నుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను.

మ. ఘనుఁడౌ రావు తెనుంగురాయనికి లోకస్తుత్య శ్యామాంబకు
న్దనయుల్గల్గిరి మాధవప్రభుఁడు సన్మాన్యుండు వెంకన్న స
జ్జనుఁడౌ చిన్నమరావు లోకనుతుఁడౌ చంద్రక్షమాభర్త జ
గ్గనృపశ్రేష్ఠుఁడు కృష్ణరాయఁడు కుజోకన్ రంగ
శాయిరాయాంధ్రుఁడున్ ౧౮

శా. భల్లూకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగ ప్రభో
ద్వల్లీలన్ ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీ వేల్లితవామలూరువుల క్రేవం గొంటుజంటీఁగ లం
దెల్లంగుయ్యెడఁ దేనియల్గొనెడు భూమీశా విచిత్రంబుగన్ ౨౮

ఉ. పొన్నలనీడఁ బోకనునుబోదియు చెంగట మావిచేరువన్
గ్రొన్ననకల్మిఁ జెన్నలరుగొజ్జఁగిపూఁబొదరిల్లు చేరి యా
కన్నులు కమ్మ దెమ్మెరలు ఘర్మకణంబులు గ్రోలుచుండ సం
పన్నలిసేతుణాత్మజుపరిభావము భావమునం దలంచుచున్ ౩౮

సీ. చండప్రతాప వేదండ శుండాదండ
ఖండిత శ్రీఖండ మండలంబు
వల్లీగృహాంత రోద్యల్లతాంగీ సహో
యోల్లసన్నవ భిల్లపల్లవంబు
రేవాతరంగిణీ సేవాగతానేక
దేవాంగనానీక దీపితంబు
చంచద్గజగ్రాహ కుంచితగ్రీవాగ్ర
పంచాననప్రభో దంచితంబు
చటులబలపటుతర సముద్భట కిటీంద్ర
కుటిల దంష్ట్రా విదారితక్షోణితలము

శిశిరు రుగాగ్ర లోహితసిక్తఘన వృ
కాననంబైన నవ్వింధ్య కాననంబు. ౪౮

గీ. జలుగుదువ్వల్వ కెంగేల నలువరించి
కదసి తడియొత్తె నొక్క పంకజదళాక్షి
వాత్రితచరగుల చెంగావివలువ గట్ట
నిచ్చె నొక బాలికామణి యిందుముఖికి. ౫౮

సీ. కపురంపుజవ్వాది కమ్మకస్తురి హరి
దద్రియ గూర్చి నలుగిడె రమణి యొకతె
గమ్మన నలచుచొక్కపు మంచిగంధంపు
టటకలి వెట్టె వామాక్షి యొకతె
సలిలకాలకు దెచ్చి కలువరాపలకపై
నిలిపె మక్కువతోడ లలన యొకతె
బంగారుబిందెల బన్నీరు దొరలించి
జలకమార్చె గడంక నెలత యొకతె.



## 434 ములుగు పాపయారాధ్యుఁడు



ఈకవికి వేమనారాధ్యులసంగమేశ్వరారాధ్యుఁడని నామాంతరము కలదు. ఈతని నిజనామము ములుగు సంగమేశ్వరశాస్త్రి. ఈతని చిన్నతనమున నీతని పితామహి యీతనిని పాపయయనిపిలుచుచుండెడిదఁట! అందుచే నీతనికిఁ బాపయారాధ్యుఁడని పేరువచ్చినది. ఈతని పూర్వులలో వేమనారాధ్యుఁడను నొకమహాపురుషుఁడు జన్మించియుండుటచే నీవంశమువారికి వేమనారాధ్యులవారను పేరు కలిగినది. ఇతఁడారాధ్య నియోగిబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుడు; అక్కమాంబా సర్వేశ్వరులకుఁ బౌత్రుఁడు; భ్రమరాంబా వీరేశ్వరులకుఁ బుత్రుడు. ఇతఁ డుభయభాషలయందును గొప్పపండితుఁడు. పాపయారాధ్యులకు గురువు శంభులింగము. ఉభయభాషలయందును గ్రంథములను రచియించినవాఁడు. ఇతనికి 'వజ్రరత్న' బిరుదమున్నట్లు ప్రసిద్ధి కలదు. ఇతఁడు కళ్యాణచంపువు, ఏకాదశీచంపువు, ఆర్యాశతీశివస్తోత్రము మొదలగు సంస్కృతగ్రంథములను; వేమనారాధ్యచరిత్రము, అహల్యాసంక్రందనము, సరసహృదయానురంజనము, శంతనుచరిత్రము ఇంద్రాత్మజాపరిణయము, ఘూర్జర చరిత్రము దేవీభాగవతము, సర్వమధురము మొదలగు ననేకాంధ్ర గ్రంథములను రచియించియుండెను. ఇతని గ్రంథములలో సర్వమధురము, సరసహృదయానురంజనము, దేవీభాగవతము ముద్రితములైనవి. అహల్యాసంక్రందన విలాసము ముద్రిత ప్రతి మదరాసు ప్రా. లి. పు. భాండాగారమునందున్నది తక్కినగ్రంథములనుజూచుభాగ్యము నాకుఁగలుగలేదు.

వేమనారాధ్యచరిత్రమున నీతఁడు చెప్పిన యీక్రింది పద్యము వలన నీతడు రచించిన గ్రంథనామములుకొన్ని తెలియుచున్నవి

సీ. పదపదార్థనిబంధబంధురంబుగ ధరా
తలమెల్ల నెఱుఁగు శంతనుచరిత్ర
సరసశృంగారానుషంగముల్ రవణి జూ
పఁగ నహల్యావధూపరిణయంబు
ధీమజ్జనస్తవ్యధీమజ్జనోన్మేషక
రముగా నలరు ఘూర్జరచరిత్ర
లసదలంకారలాలసవిశంకటముగాఁ
బరగుసింద్రాత్మజాపరిణయంబు

గీ. శతకపూజాస్తవంబు లసంఖ్యసంఖ్య
మీఱ నీవు పొసఁగించు మేలికావ్య
రచన మాకెల్ల సమ్మదార్ద్రితఁ బొనర్చె
సరసరుచిసాంద్ర సంగమేశ్వరకవీంద్ర.

సర్వతోముఖపాండిత్యముగల యీకవిచంద్రుఁడు గుంటూరు మండలమునందలి అమరావతీ సంస్థాన ప్రభువగు శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రినాయనివారి సంస్థానమున నాబాల్యమిత్రుఁడును, పండితుఁడును, గవియు, గురువునై కాలము గడిపియుండెను. వేంకటాద్రినాయని సంస్థానమున నవరత్నములుండిరనియు, అందు ప్రథముఁడీతఁడని చెప్పుదురు. ఆప్రభువుచే భూములు, నగ్రహారములు గొని పూజింపఁబడియుండెను. వేంకటాద్రిప్రభువు క్రీ.శ. ౧౭౮౩ ౧౮౧౬ సంవత్సరముల నడుమ నుండెనని కొందఱును ౧౭౬౧ - ౧౮౧౬ సంవత్సరములమధ్య నుండెనని కొందఱును జెప్పుచున్నారు. పాపయారాధ్యకవి యీకాలమువాఁడనుటకు సంశయము లేదు. వేంకటాద్రినాయనివారి యనంతరమున ముప్పది సంవత్సరములు జీవించి క్రీ. శ. ౧౮౪౪వ సంవత్సరమున ననఁగా నూటేండ్లకుఁబూర్వ మమరావతి యందే యీకవి కీర్తిశేషుఁడయ్యెనఁట. ఈయన మహిమలనుగూర్చి,

సరసహృదయానురంజన పీఠికాకారులు వ్రాసిన పంక్తులనే క్రింద నుదాహరించుచున్నాఁడను.

"మఱియుఁ దారావళియనియు, శశికళయనియు రెండు చిన్ని పొత్తములుగానఁబడుచున్నవి వీనింగూర్చి రెండు కథలు గలవు. పాపయారాధ్యులకు మంచి యోగాభ్యాసము కలదు. ప్రతిదినంబును శివాలయంబున కరిగిస్వామిని దర్శించినఁగాని భుజించునాచారము లేదు ఒకనాఁడు కృష్ణాతీరమున యోగాభ్యాసముఁ జేసికొని శివాలయమున కరుగునప్పటికి కుమతుల దుర్బోధచే నర్చకులు కవాటమును బంధించి యిండ్లకరిగిరి. అది గని మన కథానాయకుండును "మూక్తిద్వారము తల్పుదీయఁగదె! చాముఁడీ! జగజ్జీవనీ! యను మకుటముతో 27 పద్యములనుఁ జెప్పఁగాఁగవాటములు వీడిపోయి భగవద్దర్శన మయ్యెను ఈపద్యముల మొత్తమునకు 'దారావళి' యని పేరు. నిర్వాణకాలమున మోహాసనమునం దధివసించి, రాజరాజేశ్వరీ మంత్రముం జరించి షోడశప్రవాళమాలికం ద్రిప్పుచుఁ బ్రవాళమున కొక్కొక పద్యముచొప్పున "మహా ప్రస్థానావసరంబు డాసె దరి జేర్పవే నీవె సూర్యభామరీ' యను మకుటముతోఁ బదునాఱును నాయకమణి కొకటియు మొత్తము పదునేడు పద్యములు రచించెను. ఈమొత్తమునకు శశికల యనిపేరు..."

ఈమహాకవిరచించినగ్రంథములలో నేను జూచిన వానిని గూర్చి యీక్రిందవ్రాయుచున్నాఁడను.

**సర్వమధురము** — ఇదియొక యచ్చతెలుగుప్రబంధము. ఇది యీశ్వరునకంకితమీయఁబడినది. భాగవతాష్టమస్కంధమందలి థను గైకొని, శృంగారాది ప్రబంధవర్ణనలు వచ్చుటకై యితివృత్తము మార్చి యీగ్రంథమును రచించెను. అంబరీషుఁడను మహారాజు కుమార్తె స్వయంవరమునకు నారదాది మహర్షులరుదెంచి, యాకన్యను

దమలో నొకరిని వరింపుమని కోరుటయు, నంబరీషుఁడందులకియ్యకొనినను ఆకన్య మహర్షి నిబెండ్లియాడుట కంగీకరింపక శ్రీకృష్ణుని మెడలో దండ వైచుటయు నందుపై నామునులు కోపించి యంబరీషుని శపించుటయు, నంబరీషునెడ శ్రీమహావిష్ణు వనుగ్రహమును జూపి. యంబరీషుని సంరక్షించుటకై చక్రమును బంపుటయు మునులాచక్రజ్వాలలకు భయమంది యంబరీషుని శరణము ను వేడి యాబాధ నుపసంహరింపఁ జేసికొనుటయు నీగ్రంథమున వర్ణింపఁబడినది అచ్చతెలుఁగునఁ గావ్య రచన మొనర్చిన వారు మిక్కిలి తక్కువ. ఈతని సర్వమధురము పొన్నికంటి తెలగనార్యుని "యయాతి పరిణయము" కంటె నొక్కింత క్లిష్టముగా నున్నది అయినను ఈతని యచ్చతెలుఁగు కవిత్వము మొత్తముమీఁద మృదు పద మిళితమై మనోహరముగానున్నదని చెప్పవచ్చును.

ఈకవి యారాధ్యుఁడైనను వైష్ణవ మతద్వేషి గాక యుభయ మతములయందును సమాన ప్రతిపత్తి గలవాఁడని యీసర్వమధురము ను బట్టి మన మూహింపవచ్చును. సర్వమధుర శైలి తెలియుటకై మూఁడు విన్నపములనుండియు మూఁడు పద్యముల నీక్రింద నుదాహ రించుచున్నాఁడను

శా. ఆఱేఁడేలెడు నంతపట్టుగల యల్లారున్ సిరుల్ రెచ్చ నా
శేఱే చల్లెలిఱాలు మెట్టినదొరన్ రేలుంబవల్ గొల్చుచున్
దారుంగొమ్మలు బిడ్డలుం గొడుకులుం దాదాపువారున్ గొలల్
దీఱన్ జెందిరి యెన్నడుం జెడని కల్మిం బల్మి నబ్రమ్మగన్ ౪౧

ఉ ఆనవలా విరాళి మొలకై చిగురై ననయై తనంత బె
ట్రన్నయి గొండయై కడలి మట్టున నిల్వక నింగియై నిజం
బై నెఱయుంగ డెందమున నంతకు నంతకు నెక్కువై యొరుల్
దానని వేఱెఱుంగని వెతన్ జగ మొల్లక యోరసింపఁగాన్
౮౨

ఉ. అల్లుఁడ నైతి సందియము నందఁ బనేమిఁక నీదు సేఁత నా
యుల్లము జల్లనయ్యెఁ జెలి యొప్పులు మెప్పొనరుం జెవంటులై
బొల్లరి నోటవెల్వఁ దపసు ల్జడి రింతియ కాని నీవు మే
లెల్లెడఁ గొల్లగొంటి విఁక యెద్ది తలం పొనగూర్తుఁ బల్కుమీ. 93

సరసహృదయానురంజనము :- అయిదాశ్వాసముల ప్రబంధము. వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభునియొద్ద ప్రధానమంత్రిగానుండెడి పొత్తూరి కాళిదాసామాత్యుని ప్రియ సోదరుఁడగు కుశలవరామామాత్యున కంకితము చేసెను. ఈకృతిపతి యొక్కయు, వాసిరెడ్డివారి యొక్కయు వంశముల నించుమించు నూటయేబది పద్యములలో వర్ణించియున్నాఁడు. కృతిపతి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు. వేంకటాద్రినాయనగారు పొత్తూరు కాళిదాసును రావించి మంత్రిగా చేసిన సంగతిని గురించిన పద్యములు రెండు ఉదాహరించుచున్నాఁడను.

ఉ. మాకుఁ బ్రధానివై సకలమంత్రిగణంబునఁ బెద్దవై మద
స్తోక మహీతలంబునకుఁ దోడుత దక్షత నూని డెందమ
వ్యాకులతన్ బొసంగఁ బరిపాలన సేయఁగఁ గోరి నారమి
చ్చాకలిత ప్రవర్తనుఁడవై భరియింపుము రాజ్యభారమున్
ఏనే నీవయి యేలుకొమ్మనుచు భూమీశుండు వల్కంగ న
మానిగ్రామణి వీటినందుకొని తన్మంత్రిత్వముం బూని య
మ్లానప్రౌఢి మనంగ సప్తకము శుంభల్లీలఁ బాలించె సం
స్థానం బింద్రనివాస భోగముల మచ్చైచ్చ హెచ నుచ్చైర్గతిన్.

ఈతని కవిత తత్సమ ప్రచురమై ధారాళత కలిగి రస విషయమున కొతుకపడకయున్నది. కవితాశైలి తెలియుటకై కొన్నిపద్యములు :

శా. వీణా వేణు మృదంగవాదములు పృథ్వీవ్యోమమధ్యంబునన్
శ్రేణుల్ గట్టుగ, దేవయోని గణముల్ జేజే సమర్పించుచున్
మాణిక్యావరణాంత రాంతములన్ మంజుక్రమప్రౌఢిమన్
గాణిక్యమ్ము నటింపఁజేతు రెపుడున్ స్కందానుకంపార్హులై.

క. శుకములు గూసెన్ వనకిం
శుకములు పూసెన్ రసాల సుమహిత శాఖల్
పికములు రోసెన్ సుకలా
పికముల్ డాసెన్ మిళింద బృందాభ్రములన్

మ. నినునిందింపఁబనేమి పాల కడలిన్ నీ సృష్టిగావించుచో
ఘనభంగాకులతృప్తిఁ గూర్చెవిధియాగా 'యంపురస్కృత్యయో'
యను శాస్త్రీయ విరోధమేల తెలియఁడయ్యె నజ్జకన్నింద్యమా
పనిసేయం దలపోయుచోట నుచితవ్యాపార మెల్లా శశీ!

ఉ. ఏమయినాడవో యనుచు నించుక యత్తమఁ జొక్కి కామినీ
కామశరత్కటాక్ష కలికాముఖశక్తిని సల్కి చయ్యనన్
దామరసాక్షులార! దయఁదార్చి ననున్ దయసేలు కోరె యం
చామహనీయమూర్తి సరసంబుగ నిర్వరఁగౌఁగలింపుచున్

దేవీభాగవతాంధ్రీకర్తలలో నీతఁడు ప్రథముఁడు. రాజానురంజనమునకై తదంకితము గావింపక భగవదర్పితము గావించిన సదాశయుడు. ఆతరువాత త్రిపురాన తమ్మయదొరగారు, తిరుపతి వేంకటకవులు, దాసు శ్రీరామకవిగారును నాంధ్రీకరించిరి. పాపయారాధ్యుల దేవీ భాగవతము 1942లో బెజవాడ వాస్తవ్యులు దేవీభక్తు లిరువురు శ్రీ పుచ్చా కోటయ్య, బేతపూడి శరభయ్యగారును శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచే సరి చూపించి పీఠిక వ్రాయించి ప్రచురించినారు.

భక్తితన్మయత పోతనలో పది పాళ్లున్నచో, నీతనిలో పండ్రెండు పాళ్ళున్నదా యనిపించును. కాని అట్టి చోటులఁ గొంత నీరసముగాను, పునరుక్తి దూషితముగాను నున్నను నది పరిగణనీయము కాదు. ఆధోరణిలో రచించికొనిపోవునపుడేవో ఒకటి

రెండు చ్యుతసంస్కారములు దొరలినను 'గచ్ఛతస్ఖలనంనదోషాయ' అని మనము సమర్థించుకొనవలెను. కవి ప్రతిభావంతుడు ప్రథమ స్కంధమున నొకే ప్రాసతో నిరుపద్యములు 'హరి నిన్నిద్దుర మేలుకొల్ప జగదంబా! శ్రీజగజ్జీవనీ' అనుమకుటముతో యోగ నిద్రాస్తుతిలో రచించినాడు.

చూడు : (సర్వజిత్తు ఆంధ్రపత్రిక ఉగాది సంచిక
- మధునాపంతులవారి వ్యాసము )

కవితాశైలికై రెండు పద్యములు.

ఉ. పెండ్లికిఁ బిల్వఁబోయి యిలు వెళ్ళుమటన్నటు లయ్యెఁజూడ నీ
గొండ్లి; నృపాజ్ఞచే సరసగుంఫముగా వచియింప నాకు నూ
డేండ్లునునిండనైనను సమీహితమిందుఁబొసంగ దయ్యెఁ బూఁ
బోండ్లను గందు నెల్లెడ విభుత్వముచే నిటుగాన మెచ్చుటన్.

మ. ఒకకేలం బెనుకొండవోని గదచే నుద్దండయై యట్టులొం
డొకచేఁ జక్రముఁబూని విష్ణురథ పృష్ఠోల్లాస సంక్రీడనో
త్సుకతన్ దానవులం దెరల్చె భయకృచ్ఛండాహతిం దుండి కౌ
తుక మొప్పార ననఁటులం జిదుము గంతుల్ చూపుచున్
వేఁగుగన్

సంస్కృతరచన ఏకాదశీవ్రత చంపువునుండి యొకశ్లోకము.

శ్లో॥ కతినహి భువనాని బ్రహ్మణా నిర్మితాని
ప్రథిత సుగుణశోభా భాసమానాని సంతి
తదపి సకల సంపత్ సద్మ వేధోఽండ రాశే
ర్వినిహిత మణిపేటీ రాజతే మధ్యలోకః

ఆర్యాశతీశివస్తోత్రము నుండి యొకశ్లోకము

శ్లో॥ శాటీకృత చర్మాణం
ఘోటీకృత నిగమ మసమ కర్మాణమ్

కోటీరదమృత సూతిం
పాటీరదనంగభూతి మాటీకే.

ఆశుకవితగా చెప్పిన తారావళినుండి ఒక పద్యము ఉదాహరించెదను.

సక్తంబయ్యె మదీయ చిత్తము బృహత్సంసార పంకాబ్ధి న
వ్యక్తాతీత భవత్కటాక్షలహరీ వాక్పూర సంప్లుతిచే
సిక్తంబౌనటు లార్చి కింకరతచే శిక్షావిధింగూర్చి నీ
ముక్తిద్వారము తల్పుతీయఁగదె చాముండీ! జగజ్జీవనీ!

పాపయారాధ్యులు కడకాలము చెప్పిన 17 పద్యములలో నొక్కటి.

ఆస్థన్ జాఠరపూరణార్థినయి విద్యాగర్వ దుర్ వ్యాప్తి రా
జాస్థానంబుల మల్లడిం గొనుచు నీకాసింపలే కన్యథా
వస్థం జెందుచుఁ దాగి మొగ్గినటులై వర్తిల్లె నెట్లో; మహా
పస్థానావసరంబు డాసె దరిఁ జేర్పన్ నీవెసూభ్రామరీ!

పాపయారాధ్యులవారు పోతనవలె సహజ పాండితీమండితుడైన కవిసార్వభౌముడు. కాళీ సముపాసకుడగుటచే నీతనికి 'అభినవకాళిదాస' బిరుదముకూడా నున్నది. రాజావలంబనముండుటచే బొత్తిగ లేనివాడు కాడు. పోతనతో నీతనికి కవితయందు పోలికలున్నవి. ఒక్క ఉదాహరణము.

సీ. అఖిలాండజనని నిత్యార్చనలేనట్టి
కొంపగాదది కోళ్ళగంపగాని
త్రిపురసుందరి దృష్టిదీర్పని యన్నిచు
సిరులుగావవి కొండ చఱులుగాని
ఆదిశక్తినిగూర్చి యర్చ సల్పనివాని
కేలు గాదది బండి కీలుగాని

అంబిక నెప్పుడు నభినుతింపనివాని
నోరు గాదది కట్టెవేలుగాని
భగవతికొసంగ లేని దుర్భగుడు గూర్చు
ధనము గాదది నరకసాధనము గాని
ధారుణీశ్వరు( దెలియంగ లేరు జనులు
తల్లి! జగదంబ! నత కల్పవల్లి సుమ్ము.
(దేవీ భాగవతము తృ. స్కంధము)

—※o※—

## 435 ధేనువుకొండ కేశవకవి

ఇతఁడాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు; జోగనామాత్య పుత్రుఁడు

ఈకవి వైద్యచింతామణి యను నాల్గాశ్వాసముల పద్యకావ్యము నురచియించెను ఇది సంస్కృతభాషలో ఇంద్రకంటి వల్లభార్యుఁడు రచించిన వైద్యచింతామణికాంధ్రీకరణము.

ఈ గ్రంథమును భద్రాచలమందలి శ్రీరామచంద్రునకంకితము చేసినట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. రామునకు దుష్టదనుజ వి
రామునకాశ్రితమనోభిరామునకుఁ బరం
ధామునకు దివ్యతారక
నామోద్దామునకు భద్రనగధామునకున్.

దీనినిబట్టి కవి గోదావరి మండలము వాఁడేమోయని స్ఫురించుచున్నది.

ఇది ముద్రితముకాలేదు. మ. ప్రా. పుస్తక భాండాగారమున వ్రాఁత ప్రతులున్నవి.*

ధేనువుకొండ వారార్వేలనియోగులలో నెల్లూరు మండలమున నున్నారు భద్రగిరి రామునకుఁ గృతి యొసఁగినను శ్రీరామచంద్ర భక్తుఁడగు నెల్లూరు మండలవాసియేమో!

ఇంతకంటె నధికముగఁగవి చరిత్ర మేమియు నెఱుంగ రాలేదు.

మాజేటి సర్వేశలింగము తాయాసంవత్సరములోఁ బ్రతి వ్రాసి కొనుటచేఁ గవి యంతకుఁబూర్వుఁడు. కవి క్రీ. శ. 1750 ప్రాంతము నందుండునని తోఁచుచున్నది.



## 436 అన్నమరాజు వెంకటమంత్రి

—***—

ఈతఁడు ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హరితసగోత్రుఁడు; నరసయామాత్య యెల్లమాంబికల యగ్రపుత్రుఁడు; చెన్నమంత్రి పౌత్త్రుఁడు.

ఈకవికి తమ్మునికుమారుఁడయిన యన్నంరాజు రమణయ్యకవి, తాను రచించిన శంతను రాజచరిత్రలో, నీవెంకటమంత్రి వేణుగోపాల శతకమును, శ్రీకృష్ణకర్ణామృతమును తెలుఁగుచేసి ద్విపదకావ్యము గాను రచియించినట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు. ఆగ్రంథము లెచ్చటను బయటపడలేదు. ఈకవి కడపమండలనివాసుఁడు. ఈక్రింది పద్యమువలనతప్ప కవి యుండెనని ప్రపంచమునకుఁ దెలిసియుండదు.

---

* D. No. 2458 to 2462.

ఇతఁడు పదునెనిమిదవ శతాబ్దియందంత్యభాగమున నున్నాఁడని యూహింపఁదగియున్నది. ఈతనిని గూర్చి యింకనేమియుఁ దెలియరాలేదు ఇతనిపూర్వులతో సంబంధించిన చరిత్రముకొంత, రమణయ్యకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను.

సీ. వెలసిమిల్లెముపల్లి వేణుగోపాలాంకి
తంబుగ శతకద్వయంబుఁ జేసె
తియ్యనిమాటలఁ దెనిఁగించె ద్విపదగాఁ
గర్ణామృతశ్లోక గణములీల
జ్యౌతిషమున సూర్యచంద్రసిద్ధాంత సం
విత్ప్రకాశతఁ జెంది వినుతిగాంచె
బంధాశుమధురగర్భకవిత్వ
విరచనాకౌశలమునఁ బ్రాభవించె

తే. ఇందిరానాథ చరణారవిందయుగళ
భక్తిసంయుక్తిఁ బ్రహ్లాదబలివిభీష
ణాంబరీషులసాటియంచనఁగ మెఱసె
రుచిరగుణపాళి వెంకటసచివమౌళి



## 437 కటికినేని రామయకవి



ఇతఁడు పద్మనాయక కులజుఁడు; చెలుకునూళ్ళ గోత్రుఁడు; సూరయకును బుచ్చమకును పుత్త్రుడు; నరసరాయనికిని బుచ్చిపాపమకును పౌత్త్రుడు; గోపరాయనికి ప్రపౌత్త్రుఁడు. గోపరాయఁడు కృష్ణరాయఁడు, నరసరాయడు, పెదవెంకయ, చిన వెంకయ యను నైదుగురును నీకవికిఁ బినతండ్రులు. వేంకటరాయఁడీకవికిఁ దమ్ముఁడు.

ఈకవి సంస్కృతమందలి కువలయానందమను నలంకార గ్రంథము ననుసరించి కువలయానంద ప్రకాశమను పేర మూఁడుఘట్టములుకల యలంకారశాస్త్రమును రచియించెను. ఈతనిరచనలలో నెల్ల పెద్దగ్రంథమిదియే ఇదిగాక మఱి తొమ్మిది లఘుకృతుల నీతఁడు రచించినాఁడు. ఈతని కృతుపేర్లన్నియు బ్రహ్మానందచంద్రిక లోని క్రిందిపద్యమున పేర్కొనబడినవి.

సీ. కంజాక్షు దివ్యమంగళవిగ్రహస్తవం
బంచితోక్తుల రచియించినాఁడ,
క్షేమంకరంబైన శ్రీరమాసౌందర్య
మఁజాఁజేసితి రంజితముగ,
శంకరమహిమయు, శాంభవీలీలయు,
గణపతిస్తుతియుఁ, జక్రస్తవంబు,
శారదావినుతి, కృష్ణవిలాసమును, బ్రహ్మ
జీవబోధయుఁదగఁ జెప్పినాఁడఁ

తే. గువలయానంద మాంధ్రోక్తిఁగూర్చినాఁడ
నుఁడివితి దశావతారముల్ నూత్నఫణితి
నమర శ్రీహరి చరణాంబుజముల చెంతఁ
జేరి నాచిత్తమితరేచ్ఛఁ జేరదెపుడు

ఈతని రచనలలో కువలయానందప్రకాశము, బ్రహ్మానంద చంద్రికయను రెండును ముద్రితములు. తక్కినవి నామావశిష్టములు. ఇవి చిన్నగ్రంథములై యుండునని తోఁచుచున్నది. బ్రహ్మానంద చంద్రిక 70 పద్యములున్న కృతి. ఈశ్వరుఁడు కుమారస్వామికి జగన్మిథ్యాత్వముగూర్చి చెప్పిన యుదంత మిందున్నది.

కువలయానందప్రకాశమున అలంకారలక్ష్య లక్షణములను పద్యములలోఁ జెప్పి, వానిక్రింద నాయలంకారములకు సంబంధించిన వివరములన్నియు వచనములోఁ జెప్పఁబడినవి. ఈఅలంకార లక్ష్య లక్షణపద్యములలో గొన్నిట నీతిబోధక భావములను నిమిడ్చియున్నాఁడు. శాస్త్రగ్రంథరచనమునందలి క్లేశమ్ము దుపదశోభితమై సులభమయి, కదళీపాకమున మనోహరముగా నలరారుచున్నది.

ఈతని గ్రంథములలో కవియేకాలపువాఁడో తెలియుటకు దగినయాధారములు కానరాలేదు. ఇతఁడాంధ్రకవుల నీక్రింది పద్యమునఁ బేర్కొనియున్నాఁడు.

సీ. నన్నయభట్టును సన్నుతి గావించి
 తిక్కయజ్వను గణుతించి మదిని
శంభుదాసుని నాత్మ సంస్తుతి యొనరించి
 పోతనామాత్యుని బ్రీతిదలఁచి
శ్రీనాథకవినిఁ బ్రసిద్ధిగా గొనియాడి
 సూరకవీంద్రు సంస్తుతి యొనర్చి
భాస్కరాచార్యుల బహుభంగుల భజించి
 రామభద్రునిఁ గడు బ్రేమఁదలఁచి

గీ. మూర్తి కవిచంద్రు వాక్యవిస్ఫూర్తిఁబొగడి
తిమ్మసుకవీంద్రు వాగ్వృత్తి నెమ్మదిఁగని
యాంధ్రకవితా పితామహు నభినుతించి
ప్రీతి నితరాంధ్రకవుల విఖ్యాతి నెన్ని.

ఈ పద్యమున పదునాఱవ శతాబ్ది కవులను పేర్కొనుటచేత నీతఁడు పదునేడవ శతాబ్దియందుత్తరార్థమున నున్నవాఁడని తోఁచుచున్నది. ఆంధ్రకవులచరిత్రమందీతఁడప్పటికి నూటయేబది యేండ్లకుత్రితమువాడయినట్లు తోఁచుచున్నదని వీరేశలింగంపంతులు గారు వ్రాసియున్నారు. ఈకవికి కనకాద్రియను పండితుఁడాది గురువనియు, ప్రతివాది భయంకర వేదాంతాచార్యులను, అకలంకము రంగాచార్యులునుగూడ గురువులయి యుండినారనియు, ఈ రంగాచార్యులవారి సాహాయ్యమున కువలయానంద ప్రకాశమును దాను రచియించినట్లును క్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆదిగురుం భజింతు కనకాద్రిసమాఖ్యుని దర్కశబ్ద శా
స్త్రోదితసూక్తి దర్జిత రవోర్జిత సూరి మయూరవార్షి కా
భోద్రదయ తుల్య విస్ఫుట పదోత్కట సంఘటనా పటుప్రబం
ధాది ఘనప్రమోదిత దిగంతర సర్వ మహీ మహేంద్రునిన్

క. వేదవిద గ్రేసరుఁ బ్రతి
వాది భయంకర సమాఖ్య వంశోద్భవునిన్
శ్రీదాంతి శాంతి కలితుని
వేదాంతాచార్యుఁ గొలుతు వేడ్కఁ గులగురున్.

గీ॥ సరసుఁ డకలంక వంశాబ్ధి చంద్రుఁ డనఘుఁ
డైన రంగార్యవర్యు సాహాయ్యమునను
గువలయానంద మిలను దెల్గున రచింపఁ
గడఁగితిని దుష్కరంబైన కార్యమునకు.

బ్రహ్మానందచంద్రికను రచింపుమని ప్రోత్సహించినవాఁడు కనకాద్రియట! కువలయానందప్రకాశమును రచింపుమని ప్రోత్సహించువారు పానుగంటి వెంకయాఖ్యుఁడును, కాశికుల వెంకటనరసాహ్వయుఁడునట! కవి తనవంశావళిని పదునైదుపద్యములలో వర్ణించినాఁడు.

కవికాలనిర్ణయమున కనుకూలమైన చరిత్రాంశములం దేమియు లేవు. కువలయప్రకాశ ఘట్టాంతములయందు గద్యకుబదులుగా నీక్రింది పద్యమును వేసికొనియున్నాఁడు.

మ॥ ఇది నారాయణపాదపంకజయుగాభీష్టోజ్జ్వల ధ్యాన సం
పదుదారాత్మక రామనామకృత శుంభత్ సర్వలోకాభినం
ద్య ధురాధక విధాలసత్ కువలయానందప్రకాశంబునం
దొాదవెన్ ఘట్టము నాద్యమై విబుధలోకోత్కృష్టతాహృద్యమై.

కవి బ్రహ్మానందచంద్రికయందీవిధముగా గద్యరచించినాఁడు.

"ఇది శ్రీరమారమణ కరుణాకటాక్షవీక్షణసంపద్యమాన
బ్రహ్మవిద్యాద్యశేషానుభవానవద్య గద్యపద్యకవితాచమ
త్కారవిచిత్ర కటికినేన్యన్వయ పవిత్ర సూరయ సుధీవర
పుత్ర రామయాహ్వాయ ప్రణీతంబైన బ్రహ్మానందచంద్రిక..."

కవి నివాసము గుంటూరుమండలమని కర్ణాకర్ణికగా వినియున్నాఁడను.

ఈతని గ్రంథములనుండి నాలుగు పద్యములు నుదాహరించు చున్నాఁడను.

కువలయానంద ప్రకాశమునుండి :

చ॥ నలుని యశఃప్రతాపము లనారతమున్ వెలుఁగొందుచుండఁగా
నిల శశిభానులేటికని యీాసమయంబునఁదోఁచె నప్పుడా
నలువ శశాంకసూర్యుల ననాదర ముద్రణముద్రితాత్ముఁడై
వెలయఁగఁ గుండలించుఁ బరివేషమిషంబునఖస్థలంబునన్ ౧ఘ

ఈ పద్యము శ్రీహర్షుని నైషధకావ్యమందలి :

శ్లో॥ తదోజస స్తద్యశసస్థితావిమౌ । వృథేతిచిత్తేకురుతే యదాయదా
తనోతిభానోః పరివేషకైతవా తథావిధిః కుండలనాంవిధోరపి॥

అను శ్లోకమున కాంధ్రీకరము

మ. హరిసేవారతి మాని కుక్షిభరణైకాయత్తుఁడై వ్యర్థ సం
సరణేచ్ఛుండగు దుర్గముండు ధరమార్జాలాస్య పాత్రంబుకోఁ
జరమాంఘ్రిద్వయి శ్వా(న)వాలలఘు పాశవ్యాప్తి బంధించి వే
ఖరనారీషండంబుల దుగ్ధముల్ పిదుకఁగాఁ గాంక్షించువాఁడారయన్
౨ ఘ

ఉ. చాలునుగాక మాశ్రమ విశంకటవైఖరిఁ గూయ కారయన్
వ్రాలుము చూతవృక్షమున వర్ణనసేయుదుఁ గోయిలంచు నిన్
మేలగుఁ గొన్ని వస్తువులు మేదిని నాశ్రయవైభవాప్తి నే
పాల నృపాతికా పతితపంకము కస్తురిగాఁ దలంపరే. 3 ఘ

బ్రహ్మానంద చంద్రికనుండి :

బ్రహ్మమందున నీజగద్భ్రాంతి దగిలెఁ
బటుతరానాద్యవిద్యాప్రభావమునను
విద్యచే భ్రాంతియడఁగి యావిభుఁడు వెలయు
రజితబుద్ధి యడంగిన రంగపట్ల.

క. కావున మాయామయమగు
నీవిశ్వంబంత నేతినేతి యటంచున్
ధీవిధిఁబ్రతిషేధించిన
భాషితమై శేషమొక్క బ్రహ్మమె వెలయున్.



# 438 తరిగొండ వెంగమాంబ

ఈమె నందవరీక బ్రాహ్మణవంశమున జన్మించిన సాధ్వీమణి. ఈమె నివాసము చిత్తూరు మండలమునందలి వాయిల్పాడునకు నాలుగు మైళ్లదూరమునందున్న 'తరిగొండ' యగుటచే నీమెను తరిగొండ వెంగమాంబ యందురు. కాని నిజమైన గృహనామ మది కాదు. ఈమె చాలగ్రంథములను రచించిన కవయిత్రి. ఆంధ్రదేశమున గ్రంథములను రచియించినస్త్రీలు పదిపండ్రెండుగురుకంటె నెక్కువగ లేరు అంకటిలోఁ జాలపుస్తకములను రచించిన స్త్రీరత్నమీమెయే. తానురచించిన ద్విపదభాగవతమునఁ దననుగూర్చి చెప్పుకొనిన యీక్రింది ద్విపదలనుబట్టి యీమెతండ్రి కానాలి కృష్ణార్యుఁడనియు, తల్లిమంగమయనియు, కృష్ణుఁడు సోదరుఁడనియు, సుబ్రహ్మణ్య గురుఁడు వేదాంతముపదేశించిన గురువనియుఁ దెలియుచున్నది.

"ధరపై నివెలయునందవరాన్వయుండు
గురుతరసువసిష్ఠగోత్ర సంభవుఁడు
కానాలివంశసాగర సాగరహిమాంశుఁడు
నైన కృష్ణార్యునకతిభక్తితోడ
నంగనయగు మంగమాంబగర్భమున
సంగతికృష్ణుండు సైదోడుగాఁగ
వెంగమాంబిక ప్రభవించి లింగాంగ
భంగంబుకొఱకు సుబ్రహ్మణ్యగురుని
చరణాబ్జయుగళి హృజ్జలజమందుంచి
యరసిపూజించి తదనుమతివడసి..."

ఈమె రచించిన వేంకటాచలమాహాత్మ్య గద్యయందును తండ్రిపేరే యిట్లు చెప్పినది.

"ఇది శ్రీతరికొండ నృసింహకరుణాకటాక్షకలిత కవితావిచిత్ర
కృష్ణయామాత్యతనూభవ వెంకమాంబాప్రణీతంబు".

ఈమెభర్త పేరెచ్చటను జెప్పలేదు. కాని ద్విపదభాగవతమున నీక్రింది ద్విపదలలో శ్రీవత్సగోత్రుఁడును నుంజేటితిమ్మయాగ్రణిపుత్త్రుఁడా నగు వెంకటాచలపతిపాదపద్మములు మనసునందుంచుకొని యీగ్రంథమును రచించితినని చెప్పియుండుటచే నీతఁడన్యపురుషుఁడుగాక యీమె భర్తయేయని యూహింపఁదగియున్నది.

"వరుసగా నుంజేటి వంశభూషణుఁడు
గురుతర శ్రీవత్సగోత్ర సంభవుఁడు
ఘనుఁడైన తిమ్మయాగ్రణిపుత్రుఁడనఁగ
జను లెన్ను వేంకటాచలపతిపాద
వనజయుగ్మంబు భావంబునందుంచి"

పై యూహయే నిజమైనచో నీమెను నుంజేటి వెంగమాంగ యని పిలువవచ్చును. ఈమె రచించిన గ్రంథములను తనద్విపదభాగవతమున నీక్రింది ద్విపదలలోఁ బేర్కొనినది.

నా చిన్ననాఁటనో నామాలనైన
నాచార్యులెవరు నా కానతీ లేదు
ఇఁక నేమి చెప్పుదు నెట్టిలోవాణి
సకలంకుఁడై జిహ్వయందుం జెగురుఁడు
అటుగాన నారసింహాంకితశతక
మటమీఁద నారసింహవిలాసకథయు
నటశివనాటకంబదియును గాక
నట రాజయోగసారాఖ్యమౌ ద్విపద
నటకృష్ణనాటకంబదియును గాక
యట పారిజాతాపహరణ సత్కృతియు

నటరమాపరిణయంబను పెండ్లి పాట
యటచెంచునాటకంబను నొక్క కథయు
మఱియును శ్రీకృష్ణమంజరి, యవల
నిరుపమ శ్రీరుక్మిణీనాటకంబు
కర మొప్పునలగోపికానాటకంబు
విరచించిభక్తితో వేంకటశైల
వరమందుఁదరిగొండవాసుఁడై వన్న.

ఈద్విపదలలో చెప్పఁబడిన పదకొండుగ్రంథములుగాక ముక్తికాంతావిలాసము, వరాహపురాణము, భాగవతము, అను ద్విపదకావ్యములును, వేంకటాచలమాహాత్మ్యమను పద్యకావ్యమును నీమెరచించియున్నది మొత్తముమీఁద నీకవయిత్రి, పాటలు, యక్షగానములు, ద్విపదకావ్యములు, శతకములు, వచనకావ్యములు, పద్యకావ్యములు కూడ రచించి పేరుగాంచియుండెను నాచిన్నతనమున, నీమెరచించిన చెంచునాటకములు మొదలైనవి పల్లెటూళ్లలో భాగవతులవలనఁ బ్రదర్శింపఁబడుచుండెడివి

ఈమె బాలవితంతువు. నిర్మలచారిత్ర. శ్రీకృష్ణభగవానునియెడ నీమెకుగల భక్తిప్రేమములపారములు. ఈమె గానమాధుర్యమున కానందించి శ్రీకృష్ణుఁడీమెయెదుట నృత్యముసేయుచుండెడివాఁడఁట! అట్టిసమయములయందీమెశీలమునుశంకించి, లోపలనెవ్వరో పరపురుషులుండియుందురని తలంప యీమెబందుగులు హఠాత్తుగ నామె యుండెడి గదితలుపులుతీయించి చూడ నందెవ్వరు లేకుండిరఁట. శ్రీకృష్ణుఁడుతప్ప మఱెవ్వరునిటనుండరని యీమె శాంతముగఁ బ్రత్యుత్తరమిచ్చెడిదఁట!

భారతదేశమున నిట్టినారీమణులు చాలమందికలరు. మాతండ్రిగారికి మేనత్తకుమార్తె శేషమ్మయనునామె వేంకమాంబవలెనే బాలవితంతువును నిర్మలచారిత్రయునై యుండెడిది. వెంకమాంబ

యంతటి పండితురాలు కాకపోయినను వీణావంటికంఠముతో నామె యనేక గేయములను సర్వదా పాడుచుండెడిది. వీధినిబోవువా రామె పాటనువినుటకై యొక్కింతసేపునిలిచి వినిపోవుచుండెడివారు ఆమె తులసిపూజ సేయునప్పుడు శ్రీకృష్ణునిగీర్తించుచు నృత్యముసేయుచుండెడిది. ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణుడు తనయెదుటనున్నట్లే భావించి యాతనితో మాటలాడుచుండెడిది. నవ్వుచుండెడిది. తన్మయురాలై మధురకంఠముతో గానముసేయుచుండెడిది. ఆమెపవిత్రచారిత్రమును, భగవద్భక్తినిజూచి యీామెను వెంకమాంబతోఁ బోల్పవచ్చు ననుకొనెడివాఁడను. ఈమెనిత్యజీవితమును వ్రాసినచో నొకచిన్న గ్రంథమగును. ఈమెప్రతినిత్యమును రాత్రిపండుకొనఁబోవునప్పుడు ఎలుకలకాహారముగా బియ్యమును దనయింటిలోఁ జల్లుచుండెడిది. ఎలుకలు సంఘముగావచ్చి వానినితినిపోవుచుండెడివి. ఎప్పుడైన నట్లు బియ్యమునుజల్లుట మఱచిపరుండెనేని, యాయెలుకలు పెద్ద ధ్వని చేసెడివి. అప్పుడామెనవ్వుకొనుచు "ఓసివెఱ్ఱిముండలు! మీామాట మఱచితినా" యని లేచి బియ్యమునుజల్లి యవి తినినపిమ్మట పండుకొనెడిది.

వెంగమాంబ బాలవితంతువైనను శిరోజములనుతీయించుకొన లేదఁట. అందుపై నాయూరిబ్రాహ్మణులాకుటుంబమును వెలివైవఁ బ్రయత్నించిరి. ఒకనాఁడు శంకరపీఠస్థస్వాములవారాగ్రామమునకువచ్చి యామెశిరోజములనుదీయకున్నచో వెలివేయుదుమని శ్రీముఖమంపిరి. "మంగలి పరపురుషుఁడుకదా! ఆతఁడు నన్నంటవచ్చునా?" యని యామె స్వాములవారిని ప్రశ్నించెను. అందులకాయన, యాదోషము లేదనియు ధర్మశాస్త్రము విధవకుశిరోజవిసర్జనము విధించినదనియుఁ జెప్పి యామెశిరోజములను నదీతీరమునకుఁదీసికొనిపోయి క్షౌరము చేయించెను. వెంగమాంబ శ్రీకృష్ణునిఁ బ్రార్థించుచు నదీస్నానమొనర్చెననియు, నదినుండి యీవలకువచ్చునప్పటి కామెశిరోజము లెప్పటియట్లనుండెననియు నొక

కథ చెప్పినను ఇందలి సత్యాసత్యములెట్లున్నను. ఆమె నిష్కల్మష యనియుఁ బవిత్రురాలనియు దెల్పుటకీకథ తోడ్పడుచున్నది ఈమె రచించిన గ్రంథములయందు భక్తిరసము పొంగి పొరలుచుండును. వేదాంత గ్రంథములయందు వైరాగ్య వర్ణనము చక్కగాఁ జేయఁ బడినది అద్వైతమతబోధనములగు నాగ్రంథములలో నుపనిషన్మతము సులభముగాఁ దెలుపఁబడినది. శృంగారరసము చెప్పవలసిన తావులలో దాను స్త్రీ యగుటచే నట్టి వర్ణనము చేయుట యనుచితమని భావించి, శృంగార రసాధిదేవతయగు శ్రీకృష్ణుఁడే యాభాగమును రచించెనని యీక్రిందిపద్యములలోఁ జెప్పి స్త్రీ సహజమైన లజ్జను వ్యక్తీకరించినది.

శా. శృంగారాకృతితోడవచ్చి పదముల్ శృంగారసారంబుతోఁ గూ
డం గూఢంబుగఁ జెప్పనీవనిన, నచ్చోఁ జెప్పలేనన్న, నన్
ముంగోపంబున జూచి లేచి యటనే మొక్కంగ మన్నించి తత్
చ్ఛృంగారోక్తులు తా నెపల్కు కొనునా శ్రీకృష్ణు సేవించవన్.

భాగవతము ద్వాదశస్కంధములను తాను ద్విపదగా రచించి భగవదర్పితము చేసితినని యీక్రింది పద్యములలోఁ జెప్పుకొనినది

సీ. దారునిర్మితవీణ నారూఢిబల్కించు
గాయకపురుషుని కరణిగాను,
పురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నాజిహ్వ
యందుఁ దావసియించి యరుదుగాను,
బలికించుఁగావున భాగవతపురాణ
మమర నేద్విపదకావ్యంబుగాను,
ద్వాదశస్కంధముల్ దగఁ జెప్పి హరికి స
మర్పించి శ్రీవేంకటాద్రిమహిమ
మతని పై రమ్యపద్యకావ్యంబుఁ జేసి
శ్రీనివాసునకే సమర్పి పనుంటి

నీఁగతో యధిదాఁటఁబోయినవిధమున
నాస్వతంత్రతకిలబుధుల్ నవ్విపోరె.

ఈకవయిత్రి క్రీ.శ. 1840వ సంవత్సరమునందు జీవించియున్నట్లు బ్రౌనుపండితుఁడు తమనిఘంటువునందు వ్రాసియుండెను. ఆంధ్ర కవుల చరిత్రకారులును, శతకకవుల చరిత్రకారులును నాకాలము నంగీకరించియున్నారు కావున నీకవయిత్రి పదునెన్మిదవ శతాబ్ది నుత్తరార్థమున జన్మించి పందొమ్మిదవశతాబ్దిని ప్రథమార్థాంతమున స్వర్గము నలంకరించియుండునని తలంపవచ్చును.

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము :-

చ. గుఱుతుగఁ బాండునందనులు గొన్నిదినంబులు భక్తియుక్తులై
తఱమిడి నందు నిల్చినకతంబునఁ బాండవతీర్థ మంచు ని
త్తఱి నరులెన్నుచుండుదురు దానిమహాత్వము క్షేత్రపాలకుం
డెఱుఁగును గాని యెంచ మరియెవ్వరెఱుంగరుధారుణీస్థలిన్. ౧౮

ఉ. భాగవతాపచార మతిపాపము గావున నట్టిద్రోహమున్
లోఁగక చేయువాని యమలోకమునం బడఁద్రోతు వానినే
నేగతిఁ బ్రోతు నింక మఱియెన్ని యఘంబులఁ జేసివచ్చి నీ
వేగతియంచు నన్నిచట వేఁడిన దీనునిఁగాతు పద్మజా! ౨౮

మ. అనయంబుం భవతారకాఖ్యమగుయోగాభ్యాసముం జేయఁగా
మనము న్మారుత మంతరంగమున మర్మజ్ఞత్వముం బొందు నిం
దనుకూలం బగు నంతరాత్మ పరమానందమ్మునుం బొందు నిం
కొనరంగా నమస్క యోగవిధము న్నిత్సాహినై చెప్పెదన్. 3౮

శా. వైకుంఠంబును వీడి శేషగిరిపై వల్మీకగర్భంబులో
శ్రీకాంతుఁడు వసించి, చేసిన మహాచిత్రబుంల న్నింటి రిం
కాకంజాక్షుఁడు మర్త్యుఁడై నరులలో నాటాడె నాచందమున్
మీకుం గొంచె మెఱుంగఁ జేసెదను నెమ్మి న్వీనులం బట్టఁగన్. ౪౮

తే. వసుధ మిత్రుఁడు తమ్ముఁ గావ వచ్చినపుడు
శత్రుఁడగు చంద్రుఁ డల్క్రమైఁ జనుటఁ జూచి
నవ్వెను వనంగ సరసుల నళినచయము
తనర వికసించె నానందదాయకముగ. ౫ ఆ

క. వనజనిభాకారుండై
వననిధిలోఁ దేలు చున్నవటపత్రము పైఁ
దనుదానచూచి చొక్కుచు
నెనవుగ నానందయోగనిద్రం జెందున్ ౬ ఆ

## 439 వల్లూరి హనుమంతకవి

ఇతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; రామయామాత్యుని పుత్రుఁడు; సీమారామమంత్రి యాతనికగ్రజుఁడు; గురవరాజీతనికిఁ బెదతండ్రి

ఈకవి కపోతవాక్యమను ప్రబంధమును సీతావిజయము, త్రిపురారాతివిజయము అను ద్విపదకావ్యములను రచించి, తన ప్రభువులచే బహుమానములందిన ట్లీకవికుమారుఁడైన నరసింహకవి తానురచించిన నాగ్నజితీపరిణయమునం దీక్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

సీ. బుధులకు దక్షిణాపూర్వకంబుగ నేర్చి
యుభయతోముఖిదాన మొసఁగినాఁడు
పుత్రపౌత్రాదివిస్ఫూర్తిచేఁ దగిన క
న్యాదానపుంబున్నె మందినాఁడు
గంగోదకము మాధురింగాఁచు సంపూర్ణ
జలములౌ కూపము ల్నిలిపినాఁడు

లలితరసాలాది ఫలవృక్షముల తోఁపు
వెన్నెని ధాత్రి వేయించినాఁడు
మోదమున నను గపోత వాక్యాది పుణ్య
కథలుగల సత్ప్రబంధముల్ కవితఁ జెప్పి
శ్రీనృసింహుల కర్పణ చేసినాఁడు
సుకరమగు నేహనూమంతసుకవి వినుతి.

సీ. కలిదిండి రామభూకాంతుండు కవితాచ
మత్కారమునకుఁ దన్మధురగాన
మునకు నెమ్మది మెచ్చి తనకుఁ గల్గినమీరా
సీక్షేత్రములపై విశేషముగను
వల్లూరుఁ గరుగోరుపల్లెలో భీమలా
పురమున మాన్యము ల్కరుణ నొసఁగ
నామాట నారసింహప్పరాయఁడు విని
గుంపర్తిలో నికరంపుతుంగ

బాడువను మాన్య మొసఁగఁగ తత్ఫలముఁ జెంది
ప్రమదమున నిజహృదయ పద్మమున రామ
భద్రచరణయుగంబులఁ బాదుకొలిపి
వెలయు శ్రీహనుమంతు సేవింతు నెపుడు.

క. సీతావిజయము త్రిపురా
రాతి విజయ మని కతల రచియించె బుధ
ప్రీతిగను ద్విపదకల్పన
మాతరమా మెచ్చఁగ హనుమంతునికవితల్.

ఈకవి నివాసము గోదావరి మండలమునందలి యాచంటవద్ద
నున్న వల్లూరను గ్రామము. ఈతనికి భూముల నొసంగిన కలిదిండి

రామభూకాంతుఁడు క్షత్రియుఁడు. మొగల్తుర్రు సంస్థానాధిపతి. ఈ మొగల్తుర్రు గోదావరిమండలములోని నర్సాపురమున కాలుమైళ్లలో నున్నది. నరసింహాప్పారాయఁడు నూజవీడుసంస్థాన వెలమప్రభువు.

ఈతఁడు రచించిన కావ్యములలో నొక్కటియు నిప్పుడు గనఁబట్టుట లేదు. ఈతనిచరిత్ర వ్రాయుట కీతనితనయుఁడు నరసింహకవి రచించిన నాగ్నజిత్తీపరిణయములోనిపద్యము లే యాధారములయినవి. ఈకవితండ్రి యైనరామయామాత్యుఁడు, వల్లూరునందు గోప్పయారామప్రతిష్ఠ కావించినట్లు నాగ్నజిత్తీపరిణయమున నీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడినది.

శా. రామామాత్యుఁడు వల్లురీపురిని న్రామత్కోరుహారామము
ద్దామప్రేమముతో సదీర్ఘికముగా ధర్మార్థమై నిల్ప నం
దామోదించి శుచిద్విజాతిఫలహారాప్తి న్సుఖం బుండినాఁ
డామాలంబుగ దానికిచ్చె సహకారారామ నామంబిలన్

నరసింహకవి నూజేండ్లక్రిందటివాఁడని ఆంధ్రకవుల చరిత్రకారులు క్రీ శ. 1799 వ్రాసియున్నారు. దీనినిబట్టి యీహనుమంతకవి 1760 ప్రాంతము వాఁడని తేలుచున్నది.

(శ్రీ) వేంకటాచల మహాత్మ్యము —

చ. గుఱుతుగఁ బాండునందనులు గొన్నిదినంబులు భక్తియుక్తులై
తఱచుఁడి నందు నిల్చినకతంబునఁ బాండవతీర్థ మంచు ని
త్యతి నరు లెన్నుచుండుదురు దానిమహత్వము క్షేత్రపాలకుం
డెఱుఁగును గాని యెంచ మఱియెవ్వరెఱుంగరు ధారుణీస్థలిన్. ౧౮

ఉ. భాగవతాపచార మతిపాపము గావున నట్టిద్రోహమున్
లోఁగక చేయువాని యమలోకమునం బడఁద్రోతు వానినే
నేగతిఁ బ్రోతు నింక మఱియెన్నియఘంబులఁ జేసివచ్చి నీ
వే గతియంచు నన్నిచట వేఁడిన డీనునిఁగాతు పద్మజా! ౨౮

మ. అనయంబుం భవతారకాఖ్యమగు యోగాభ్యాసముం జేయఁగా
మనము న్మారుత మంతరంగమున మర్మజ్ఞత్వముం బొందు నిం
దనుకూలం బగు నంతరాత్మ పరమానందమ్మునుం బొందు నిం
కొనరంగా నమస్కయోగవిధము న్నుత్సాహియై చెప్పెఁగన్ ౩ఆ

శా. వైకుంఠంబును వీడి శేషగిరిపై వల్మీకగర్భంబులో
శ్రీకాంతుండు వసించి, చేసిన మహాచిత్రంబుల న్వేటి రిం
కాకఁ జాతుఁడు మర్త్యుఁడై నరులలో నాటాడె నాచందమున్
మీకుం గొంచె మెఱుంగఁ జేసెదను నెమ్మి న్వీనులం బట్టఁగన్ ౪ఆ

తే. వసుధ మిత్రుండు తముఁ గావ వచ్చినపుడు
శత్రుఁ డగుచంద్రుఁ డల్కమైఁ జనుటఁ జూచి
నవ్వెను నసఁగ సరసుల నళినచయము
తనర వికసించె నానందదాయకముగ. ౫ఆ

క. వనజ నిభాకరుండై
వననిధిలోఁ దేలుచున్న వటపత్రముపైఁ
దనుదానచూచిచొక్కుచు
ననవుగ నానందయోగనిద్రం జెందున్. ౬ఆ



ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; శ్రీవత్ససగోత్రుఁడు.

ఈకవి వ్యాసరచితమైన విష్ణుపురాణమును షడంశలుగల పద్యకావ్యమునుగా రచియించి, తిరుపతి శ్రీవేంకటేశ్వరునకంకితము చేసెను. సంస్కృత విష్ణుపురాణమునకద్వైతపరముగా నున్న వ్యాఖ్యానములు వైష్ణవతత్వమును బ్రదర్శింపకపోవుటచే శ్రీరామానుజాచార్యులవారు తనమతానుసారముగా నొకవ్యాఖ్య రచియించి యుండిరనియుఁ దదనుసారముగాఁ దానీపద్యకావ్యమును రచియించితిననియుఁ గవి యీక్రింది సీసపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రీభాగవతము మహాభారతంబును
  నద్వైతవేషు లైనట్టివారు
తెలిగించి రటగాన తేటపడదు హరి
  పారమ్య మావిష్ణుభక్తివిధము
శ్రీపరాశరముని శిష్టాగ్రగణ్యుండు
  విష్ణుపురాణంబు వెలయఁ జేసె
నదియుఁ గొందఱు యతు లద్వైతమని తమ
  భాష్యంబులోపల వ్రాసికొనిరి
అదియుఁ గాదని రామానుజార్యవర్యుఁ
డెట్లువ్యాఖ్యాన మొనరించె నట్లు నెగడ
రమణ చెలువొంద విష్ణుపురాణ మొకటి
తెలుఁగు గావించె నప్పయదీక్షితుండు.

క. విష్ణుపురాణము భావ మ
వైష్ణవుఁ డెఱుఁగం డనాదివాసన దుష్టిన్
ఉష్ణాంశుఁ గని యులూకము
తృష్ణ గదిరి దివమునందుఁ దిరుగఁగలదే

శా. అధ్యాయంబుల నూటయిర్వదిట నాద్యంతంబులం జల్పమై
తధ్యాంశంబుల నాఱిటం జెలఁగునే తద్విష్ణునామంబుచే
బోధ్యం బైనపురాణరత్నము మహాపూర్వార్థసంబాధ్యమై
ప్రఖ్యాతాఖిలవిష్ణుసద్గుణగణప్రాగ్భ్యంబు చింతింపఁగాన్.

ఈ గ్రంథము నెల్లూరుమండలమందలి వెంకటగిరిసంస్థానపరిపాలకు లగుకుమారయాచభూపేంద్రుని కాలమున రచియింపఁబడిన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. ఇది భూభూషణ భూత వేంకటమహీ పృథ్వీధర ప్రాంతపూ
ర్వదిశామధ్యధరాధిపాలన మహారాజాగ్రణీ సేవ్యభూ
రిదయాసాంద్ర కుమారయాచధరణీభృద్వర్య శ్రీవైష్ణవా
గ్ర్యదయాధ్యాప్యుయదీక్షితార్యకృతిలో రంజిల్లుషష్ఠాంశమై.

శ్రీకుమారయాచభూపాలుఁడు క్రీ॥ శ॥ 1795 మొదలు వఱకును వెంకటగిరి సంస్థానమును బరిపాలించియుండెను. కావునఁ గవియు నాకాలమువాఁడు నెల్లూరు మండలమువాఁడునై యుండెను.

×××××

## 441 కర్లపాలెపు సింగయామాత్యుఁడు

ఇతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; రామన్న బుచ్చమ్మలకుఁ గుమారుఁడు.

ఈకవి 'నరసింహా! భక్తసంరక్షకా!'' అను మకుటముతో ౧౦౬ పద్యములుగల యొకశతకమును అల్లూరునరసింహస్వామిపై రచియించెను.

ఈక్రింది పద్యములవలన నీకవిగృహనామము "భట్రాజు"వారై నట్లును పిదప కర్లపాలెమువారయినట్లును దెలియవచ్చుచున్నది

మ. స్థిరభట్రాజుకులాబ్ధిచంద్రుఁ డనఁగాఁ జెన్నొందుశ్రీరామ
నార్యరమాకాంతసమానబుచ్చమలకే నత్యుత్తముండౌ సుతుం
డ రహస్యార్థవిదుండు సింగకవిరాట్ ధారాళకావ్యుండ న
న్నరలే కేలి గ్రహింపు కావ్యము నృసింహా! భక్తసంరక్షకా!

మ. స్థిరమై యొప్పెడు కర్లపాలెపుకులశ్రేష్ఠుండు రామన్నకున్
వరబుచ్చాంబికయందుఁ గల్గితి భవత్పాదాంబుజాధీనుఁడన్
నరసింగాఖ్యకవీంద్రచంద్రుడను నీనామాంకితం బైన కా
వ్యరమాకాంతను గైకొనంగదె నృసింహా! భక్తసంరక్షకా!

మొదటిపద్యమందలి "భట్రాజుకులాబ్ధిచంద్రుఁడ" అనువాక్యమునుబట్టి యీతఁడు భట్రాజుకులజుఁ డేమోయని భ్రమకలుగును గాని యది సత్యము కాదు. ఈతనివంశీయులయొద్దనుండి తెలిసికొని శతకకవుల చరిత్రకారులు వ్రాసియుంచినయీకవిచారిత్రము నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను,

"ఈతఁడు గంటూరుమండలమునందలి, బాపట్లతాలూకా, కర్లపాలెము వాస్తవ్యుఁడు; ఆఱువేలనియోగి; అపస్తంబసూత్రుఁడు; హరితసగోత్రుఁడు" ఇతఁడు ౧౭౫౦ సంవత్సరములక్రితము అనగా ౧౭౬౦ క్రీ॥శ॥ ప్రాంతములఁ బుట్టెను. తరువాత నాగ్రామకరణముగా నుండెను. ఈతనితండ్రి సీతారామయ్య. తల్లి బుచ్చమ్మ. ఈతనిభార్య లక్ష్మిదేవమ్మ ఈతని వంశవృక్షమిది.

సీతారామయ్య = (తల్లి) బుచ్చమ్మ

- నారాయణయ్య (అవధూత తిరిగిజన్మము)
- సింగయ = లక్ష్మీదేవమ్మ (నరసింహశతకకర్త క్రీ॥శ॥ 1766)
  - లక్ష్మయ్య (1796) ఈశాఖవేఱు
  - రామయ్య 1810)
    - లక్ష్మీనృసింహము
      - లక్ష్మీ నరసమ్మ
      - సుందర రాయడు అ. కరణం కర్లపాలెము
      - రామ కృష్ణయ్య
      - పట్టాభి రామయ్య
    - వెంకట కృష్ణయ్య
    - కుటుంబ రాయుడు
    - కామయ్య (1850)
      - బు. ల. నరసింహము
      - కోదండ రామయ్య (1884) (ఈకవి వివరములను తెలిపినవారు)
      - కుటుంబ రావు
      - వెంకట సుబ్రహ్మణ్యం
    - బుచ్చయ్య (సనత్కుమార సంవాదకర్త)
      - లక్ష్మీనరసింహము

నర్సారావుపేట తాలూకా చిలకలూరుపేట సమీపస్థమగు పసుమర్తి గ్రామ మీకవి వంశీయుల గ్రామము. అప్పటికి వీరియింటి పేరు భట్రాజువారు. ఈకవి ముత్తాత కర్లపాలెమువచ్చి తన మేనత్త భర్త కరణీకమునంగీకరించి నాటినుండి కర్లపాలెమువారన్న యింటిపేరు నందెను. ఈతని గ్రంథరచనము క్రీ॥ శ॥ 1790 ప్రాంతమున నారంభమై యుండవచ్చును.

ఈకవికిఁ బినతండ్రియు, సోమయాజియునగు నారాయణసోమయాజినిగూర్చి యొకకథ చెప్పెదరు. ఆతఁడాశ్రమ స్వీకారముఁజేసి, కృష్ణామండలములోని గుడివాడ ప్రాంతమునఁగల "వడాలి" దేవస్థానము నిర్మించి తదతిష్ఠార్థము తన మహిమచే కృష్ణానదియందు మునిఁగి, నిజాముద్దౌలాసభామధ్యమునఁ బ్రత్యక్షమై, యానవాబును మెప్పించి, వడాలి గ్రామము ను సర్వదుంబాలాగ్రహారముగ *ధర్మనాగొన్న మహిమోన్నతుఁడు; శ్రీపరివ్రజకాచార్యవర్యపురుషోత్తమానందావధూతయని పేరొందెను. అవసానదశయందీయన కర్లపాలెమునకు రాఁగాఁదనయారసపుత్త్రుఁడు గ్రామాంతరమునసుంటచేఁ దనకు సమాధిచేయుట మొదలగు కర్మలనీకవి జనకునిఁజేయుమనియు, 'తిరిగి జన్మింపవలసియున్నది. వెంటనేనీకు కుమారునిగా బుట్టుదు"ననియుఁ జెప్పి, సిద్ధిఁ బొందెనఁట!

ఆప్రకారమే యీకవి కనుజుఁడుగఁ బుట్టి, యుపనయనానంతరమున మృతి నందెనఁట

---

* ఈధర్మానాసకలును, నవధూత మహిమలును, శివవెంకటకవులచే రచియింపబడి వడాలి దేవస్థానమువారిచే క్రీ॥ శ॥ 1915 సం॥న సేతు ముద్రాక్షరశాలయందు ముద్రించిప్రచురింపఁబడిన "జగన్నాథీయ" మను గ్రంథమునఁ జూడనగును.

ఈతని సంతతివారిప్పటికిని కృష్ణా, గుంటూరు మండలములందున్నారు. వీరిది పండితసాంప్రదాయము. ఈకవి విష్ణుభక్తుఁడు. నరసింహమంత్రోపాసకుఁడు. రేపల్లె తాలూకా నిజాము పట్టణసమీపమందున్న "అల్లూరి" గ్రామమున వేంచేసియున్న శ్రీలక్ష్మీనృసింహస్వామి యీకవి యిష్టదైవము. ఈకవి లోకసారిమతిచలింపనీశతకము తండ్రి చదువనప్పటినుండి యీ మతి కలిగెను. వీరికుటుంబముఁ బుట్టు ప్రథమ శిశువునకు దేవుని పేరఁబెట్టి కులదేవతగాఁ బూజించుచున్నారు. ఇతఁడు సంస్కృతాంధ్రములు వచ్చినవాఁడు. ఇతని మంత్రశాస్త్రజ్ఞానము 31, 32, 33 పద్యములలో ద్యోతకమగుచున్నది. ఇతఁడు భక్తిజ్ఞాన వైరాగ్యములుకలిగి సాంఖ్యయోగమునందుఁ బ్రవేశమున్న బ్రహ్మవేత్త యని శతకపీఠికలో వ్రాసిరి. "ఈయన సర్వవాక్యపరిపాలకుఁడు వాల్మీకి రామాయణ పారాయణ మొనర్చువాఁడు" నని కూడ వ్రాయుచున్నారు. ఇందు కేశవనామములకొక్కొక్క పద్యము వ్రాసెను. శైలిభక్తిరసముతోఁ గూడి శ్రావ్యముగనున్నది. కొన్ని పద్యములఁ జూపెదను.

మ. అల వంద్రవజమందు గోపికలు నీ వత్యంతచోరుండవం
చు లలిన్ జాగ్రత నుండ కన్మొఱఁగి నాచోద్యం బిదే చూడుమో
లలనారత్నములార! వెన్నదిని నిర్లక్ష్యంబుగా నేగెదన్
అల గన్ బోలదు పట్టఁడందువు నృసింహా! భక్తసంరక్షకా! 27

మ. ధరలో మర్కటవత్సభంగి నిను నేదాసుండు నీపాదపం
కరుహద్వంద్వము నెమ్మది న్నిలిపి యోకంజాక్ష! రక్షింపవే
శరణం బంచు నుతించునాతనిఁ గృపన్ సత్యంబుగాఁ బ్రోతువా
హరి! యల్లూరిపురీవిహార! నరసింహా! భక్తసంరక్షకా! 50

మ. ధరలో కేశవనామసంస్మరణచే దారిద్ర్యముల్ వాసి సు
స్థిరలక్ష్మీవిభవాఢ్యుఁడై జనులలో శ్రేష్ఠుండునై తత్త్వమా
గ్గరహస్యంబు లశేషముల్ దెలిసి నీకారుణ్యముం బొందునో
హరి! అల్లూరిపురీవిహార! నరసింహా! భక్తసంరక్షకా! 64

## 442 శివపల్లె సర్వోత్తమకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడ ; హారితస గోత్రుఁడు; అన్నయామాత్యపుత్త్రుఁడు అన్నయామాత్యున కార్గురు కుమారులు. పెద్దవాఁడుజగ్గమంత్రి ఈసర్వోత్తమకవి రెండవవాఁడు.

ఈకవి లక్ష్మీనారాయణపరిణయ మనునాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించిభద్రగిరియందుండు శ్రీరామచంద్రునకర్పితము చేసెను ఇతఁడు రాఘవవిజయ మనుమఱియొక ప్రబంధమును రచియించినట్లు కవి చెప్పుకొనియున్నాఁడు. కాని యది నాకు లభ్యము కాలేదు. ఈకవి యన్నయామాత్యునిపుత్రుఁడై నట్లీక్రిందగనుపరచినగద్యలో నున్నది.

గద్య :— ఇది శ్రీమద్భద్రగిరిరామలబ్ధకరుణాకటాక్షలబ్ధకవితావిచిత్ర యాపస్తంబసూత్ర హారితసగోత్రపవిత్ర శివపల్లిఅన్నయామాత్యపుత్త్ర సర్వోత్తమనామధేయప్రణీతం బైనలక్ష్మీనారాయణపరిణయం బను మహాప్రబంధంబు''

కృత్యాదిలో ''మఱియునస్మజ్జనకుఁ డగుమాధవ నుమాధవ గలయతనివర్ణించెద.

ఉ. మాధవనాము, దీనవనమాధవనాముఁడు సంతతాశ్రితా
బోధనబోధిసీకపరముండు పురాతనజన్మకాముఁ డా
రాధితవీరరాముఁ డరిరాజవిభాళికరాళిధాముఁడున్
గోధనపాలరాములకు కూరిమి భక్తుఁడు శక్తుఁ డక్తులన్.

క. ఆతని తనయుల మార్వుర
మాతతవిఖ్యాత కీర్తిమహిమలచేతన్
సీతారాముల భక్తుల
మేతద్విశ్వంబునందు నెనఁగితి మెఁమిన్.

అని తనతండ్రి మాధవనాముఁ డని వ్రాసికొనియున్నాఁడు. ఈనామభేదమునకుఁ గారణము తెలియదు. అన్నయామాత్యునకు మాధవుఁ డనినామాంతరము కలదేమో !

ఈతనికగ్రజుఁడు జగ్గమంత్రియైన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు. తక్కిన సోదరులనామములను నుడివియుండలేదు.

క. జ్యేష్ఠ శ్రేష్ఠుం డగుమా
యిష్టుఁడు సుగుణైకఘనుఁడు నిందునిభాస్యుం
డష్టైశ్వర్య కళాయుత
శిష్టుం డాజగ్గమంత్రి శేఖరుఁ డొరన్.

ఈక్రిందివచనమువలన నీతఁడు భద్రాద్రియందు వెలసిన శ్రీరామచంద్రుని భక్తుఁడైనట్లును, రాఘవవిజయ మనుగ్రంథమును రచించి, యాదేవున కర్పించినట్లును దెలియుచున్నది.

వ. "అనంతరజనితుండనగుచు శ్రీరామనామంబున విలసిల్లినయుల్లంబున మల్లడిగొను శ్రీరామచంద్రపాదారవింద భజనానంద కందళిత హృదయారవిందుండనై యుండి యాస్వామివర్ణనీయంబు లగు సముదయంబులెన్నెన్నియుఁ జెప్పి సమర్పించి యందు శ్రీరాఘవ విజయంబు రచియించిసమర్పించి మఱియు శ్రీలక్ష్మీనారాయణపరిణయంబును పూర్వంబు రచియించిన కరణినొనరించెద నిందుకథీశ్వరుండైనభద్రాద్రి శ్రీరామభద్రదేవునిమహిమ లుపన్యసించెద"

కృతిపతి వర్ణనముసేయుట కవిసంప్రదాయము. కావున నీకవియు రామాయణకథను సంక్షిప్తముగా నొకవచనములో వర్ణ్యంతములకుఁ బూర్వమున రచియించియున్నవాఁడు.

పై నుదాహరించిన వచనములో "శ్రీలక్ష్మీనారాయణపరిణయంబును పూర్వంబు రచియించినకరణి నొనరించెద" నని వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి లక్ష్మీనారాయణపరిణయమను గ్రంథమును

పూర్వులెవరో రచించియున్నట్లు తోఁచుచున్నది. దీనికిఁతోడుగ షష్ఠ్యంతానంతరమున "సమర్పితంబుగా నాయొనర్పఁబూనిన శ్రీలక్ష్మీ నారాయణపరిణయంబు విరచించిన కవిసార్వభౌముని సహోదరాదిజను లీప్రబంధంబు భద్రగిరి శ్రీరామభద్రుల కంకితంబు గావింపుమనిన తద్వాక్యంబున నే రచియింపఁబూనితి నమ్మహానుభావుండు దివ్యచిత్తంబునఁజేర్చి యవధరించుఁ గావున" అని కవి వ్రాసియు న్నాఁడు. ఈవచనము నుబట్టి యెవరోకవిసార్వభౌమబిరుదాంకితుఁడు లక్ష్మీనారాయణ పరిణయమును రచియించియున్నట్లును అతని సహోదరాదిజనము లీప్రబంధమును భద్రాదిరామునకంకితము చేయ వలసినదని కోరఁగా తానాప్రకారమును జేసినట్లును కనఁబడుచున్నది. ఆకవిసార్వభౌముఁడెవరో కృత్యాదియందుఁ పేర్కొనలేదు ఆకవి సార్వభౌముఁడు లక్ష్మీనారాయణ పరిణయమును సంస్కృతమున రచియింపఁగా సర్వోత్తమకవిదాని నాంధ్రీకరించెనా యని సంశయము కలుగుచున్నది. అట్లయినచో ఆసార్వభౌముని పేరు చెప్పఁడా! దాని కిది యాంధ్రీకరణ మని చెప్పఁడా! సహోదరాదిజనము లీప్రబంధమును రామున కర్పింపుమని చెప్పియుండిరనుటచే నాకవి సార్వభౌముఁ డెప్పటివాఁడో కాఁడు. ఇది యంతయుఁ జూడఁగా, సర్వోత్తమకవి, శ్రీలక్ష్మీనారాయణ పరిణయమును రచించి, కృత్యాది వ్రాయకుండ చనిపోయియుండుననియు, నాతనిసహోదరాదులు ఎవరినో యొకరిని కృత్యాదినివ్రాసి, భద్రాద్రిరామునకంకితము చేయుమని గోరియుండు రనియుఁ ఆయెవరో యొకరీవిధముగఁ గృత్యాదిని ఆశ్వాసాద్యంత పద్యములను వ్రాసియుందురనియుఁదోఁచుచున్నది. గద్యలోని అన్నమా మాత్యునకు మాధవనామము నామాంతరమేమో యని పైని వ్రాసితిని గాని యది నామాంతరముగాదనియు, అన్నామాత్యుఁడు సర్వోత్తమ కవితండ్రి యనియు మాధవనాయఁడు కృత్యాదికర్త యొక్క జనకుఁ డనియుఁ దోఁచుచున్నది.

ప్రథమాశ్వాసము లనందలి "అవధరింపుము" అనుట మొదలుగా గ్రంథమంతయు సర్వోత్తమకవియు, నంతకుఁ బూర్వపు కృత్యాదియు, ఆశ్వాసాద్యంత పద్యములును కృత్యాదికర్తయు రచించి యుండునని నేననుకొనుచున్నాఁడను. ఆశ్వాసాంతగద్యలో కతీరున లేవు. నేను పైని వ్రాసినగద్య గ్రంథాంతమందలిది. అందు 'శివపల్లి' యనిగృహనామ ముదాహరింపఁబడియున్నది ఈ గృహనామము తక్కిన మూఁడాశ్వాసాంతగద్యల యందును లేదు. అన్నయామాత్య పుత్ర అనువాక్యమునకుఁ బిమ్మట గ్రంథాంత గద్యయందు లేని "హృదయకమల కర్ణికాంతరాళస్థిత శ్రీ సీతారామచంద్ర" అను వాక్యము తక్కిన మూఁడాశ్వాసాంతగద్యల యందు నున్నది.

కృత్యాదిలోఁ గురువుల నీక్రింది పద్యములలో నుతించి యున్నాఁడు.

వ. అనివీరలం దలంచి, భావికవిశ్రేష్ఠులకుఁ బ్రణమిల్లి తదనంతరం బున నస్మత్స్వాములగు గురుస్వాముల నభివర్ణించెద.

క. శ్రీభట్టరార్యసంభవ
ప్రాభావితసూర్యనిభులఁ బండితశుభులన్
శోభాతిలకమణిభులన్
శ్రీభాసితమూర్తిసఖుల సింగరప్రభులన్.

సీ. తనకటాక్షమ్మున దాసులకెల్లను
యిష్టార్థసంపద లిచ్చు నెపుడు
తనపాదతీర్థంబు దినమును గలుగంగ
గంగాంబుస్నానంబుఁ గలుగఁజేయు
తనదాస్యకృత్యముల్ వినయంబుతో జేయ
భాగవతాధీనపరునిఁ జేయు

తనమంత్రపఠనచే దామోదరస్థాన
మబ్బునబ్బురముగా నిబ్బరముగ

సీ. నామహాత్ముల నాత్మయం దభినుతింతు
అడియడని తిరువడిఘళె నాశయింతు
గొండఁ డనియును, షటి కూను డొత్తుఁడనియు
హత్తుకొని యెంతు నాచార్య హర్షమునను.

కృత్యాదియందు రామానుజాచార్యునిఁగూడఁ నీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

క. రామానుజసిద్ధాంతుని
రామానుజుఁ గొలుతు యోగిరాజశుభకుల
క్షేమంకరచూడామణి
గామితచింతామణిని సుకారణఫణితిన్.

ఈవర్ణనములను ఇందుపయోగించిన ద్రావిడపదములనుబట్టి చూడఁగా నీకృత్యాదికర్త వైష్ణవబ్రాహ్మణుఁ డనితోఁచుచున్నది. కాని, యీతనికగ్రజుని, జగ్గమంత్రియని యనుటచే, వైష్ణవుఁడుగాక వైష్ణవాచారతత్పరుఁడైన నియోగిబ్రాహ్మణుఁడేమో యనిసంశయము కలుగుచున్నది. ఈజగ్గయకు మంత్రిశబ్దము పుట్టువునుబట్టి వచ్చినదికాని, మంత్రిత్వముచే వచ్చినట్లు కనఁబడదు. పైనినుదాహరించిన వచనములోని "అనంతర జనితుండనగుచు శ్రీరామ నామంబున విలసిల్లిన" అనువాక్యము కృత్యాదికర్త 'శ్రీరామ' నామధేయుఁడయినట్లు స్ఫురింపఁజేయుచున్నది.

కృత్యాదికర్త సుకవి, కుకవి, వర్తమానకవులను ఈక్రింది పద్యములలో సంస్మరించియున్నాఁడు.

క. ఆదికవీంద్రులఁ దలఁచెద
వేదవ్యాసాదిమునుల విద్యాఘనుల
త్యాదరసుకవీశ్వర స
మ్మోదావహ యాంధ్రకవుల మొదలఁ దలంతున్.

ఉ. కూళలునైన యట్టిదొరకూనల కంకిత మిచ్చి హెచ్చులా
వాళిని సత్కవిత్వపరులం బెనువమ్మయు సొమ్ము లెమ్మెయిం
జాలను బుచ్చుకున్నకవిచావడిపీన్గుల నోకిలించి నే
పాళిగ భద్రశైలపతి భక్తిఁ దలంచి రచించె నాలుకన్.

వ. అని యిష్టదేవతావందనంబును బురాతనకవీశ్వర వందనంబును గుకవినిందనంబును గావించి వర్తమానకవీశ్వరులం దలంచెద.

క. భావజ్ఞుఁ డనఁగ భూమిని
భావుక మైనట్టికవితఁ బ్రఖ్యాతముగా
భావజజనకుని పేరిట
భావనకవిదంచి వెలయ భావన జేతున్.

వ. తదనంతరంబ

సీ. కమలాక్షుఁ బూజించుఁ గమలపుష్పమ్ముల
గమలభవాండభాండములయందుఁ
గమలనాభుని పాదకమలమ్ము లెప్పుడు
మానసంబున నెంచు ధ్యానముంచి
కమలనాభుఁ దలంచి కమలాకరమ్ముల
స్నానముల్ సేయు సుస్నాతుఁడగుచుఁ
గమలబాంధవవంశకలశపయోరాశి
సోముఁ డారాముని బ్రేమఁ దలఁచు

గీ. కమలనాథుని పేరు కృత్యాద్యమలమందు
నుంచఁ జేకూరెఁ గవితా ప్రపంచ మిపుడు
భోజదర్శను కవిరాజభోజుఁ దలఁతు
గామపల్లెను వెలయు నాకమలనాథు.

వ మఱియును.

క. మజ్జనకసమానుం డగు
సజ్జనసహవాసయుతుఁడు సర్వోత్తముఁడున్
ముజ్జగము లందు వెలసిన
యజ్జగదీశ్వరుని పూజ నలరం జేసెన్.

క. శివపల్లి సర్వధీమణిఁ
బ్రవిమలకావ్యాదిఫణిని భాసురద్యుమణిన్
నవరత్నకాంచనాఘృణిఁ
బవిసన్నిభమంత్రిమణిని బరమకృపాణిన్.

ఇందుఁ గడపటి రెండుపద్యములలోను వర్ణించినకవియే, శ్రీలక్ష్మీనారాయణపరిణయగ్రంథకర్త యగు శివపల్లెసర్వోత్తమకవి యని స్పష్టమయినది. దీనినిబట్టి గ్రంథకర్త వేఱనియుఁ, కృత్యాదికర్త వేఱనియు నిర్దిష్ట మగుచున్నది. పై పద్యములలోఁ జెప్పఁబడిన కమలనాథకవియు, భావనకవియు నెవ్వరో వా రేమేమిగ్రంథములను రచించిరో తెలియరాలేదు, కృత్యాదియందుఁ జెప్పబడిన రాఘవవిజయమునురచించినకవి, కృత్యాదికర్త యగు శ్రీరామకవియే కాని, సర్వోత్తమకవి కాడని నిశ్చయింపవలసియున్నది.

పైనచెప్పిన కమలనాథకవి నివాసము కామపల్లె అని సీసపద్యములో నున్నది. కామునూరి అప్పకవి నివాసము కామేపల్లె. కాని యీకామపల్లెలు కృష్ణామండలములో నొకటియు, గుంటూరుమండలమునం దొకటియు, నెల్లూరు మండలమునం దొకటియు నున్నవి.

కమలనాభునినివాసమిం దేనియో! కృత్యాదికర్తయు, గ్రంథకర్తయు నాకామపల్లెనివాసుగో, తత్ప్రాంతగ్రామనివాసుగో యయియుందురు. గోదావరిమండలములోని భద్రాచల రామస్వామికిఁ గృతియిచ్చుటచే నీతఁడు తత్ప్రాంతనివాసుడేమో యని శ్రీలక్ష్మీనారాయణ పరిణయ ముద్రితప్రతిపీఠికాకారులు వ్రాసియున్నారు. కాశీవిశ్వేశ్వరుఁడు, శ్రీశైలమల్లికార్జునుఁడు, ద్రాక్షారామ భీమేశ్వరుఁడు, భద్రాచల రాముఁడు ఇట్టివారలు కృతిపతులైనప్పుడు, కవులు తత్ప్రాంత నివాసులని నిర్ణయించుటలో ప్రమాదము కలఁగవచ్చును. కావున నీవిషయమింకను విచారణీయము కృత్యాదికర్తకవిత్వము, సర్వవిధ ముల గ్రంథకర్తకవిత్వమునకుఁదీసి పోవునదిగానున్నది ఇందలి కథ యందు సముద్రుఁడు సంతానార్థియై శ్రీమహాలక్ష్మి తన గర్భవాసమున జనించుటకును, శ్రీనారాయణమూర్తి యామెను వరించి తన సన్నిధి యందు నివాసమొనర్చునట్లు వరంబుగోరి తపం బొనర్చుట, సురాసు రులు పాల సముద్రము మథించుట, అందుఁ జంద్రకల్పవృక్షులక్ష్మ్యా దులు జనించుట, చంద్రాదులాకాశాది స్థలంబులనొందుట, శ్రీమహా లక్ష్మి శ్రీ నారాయణుని వరించుట యనునవి కలవు.

అచ్చటచ్చట స్వల్పముగా నపప్రయోగములున్నను, నీతని కవిత్వము ద్రాక్షాపాకములో మధురపదయుక్తమై మనోహరముగా నున్నది ఈకవి కాలమును నిర్ణయించుట కాధారములేమియు లభింపలేదు. 150 సం॥లకుఁబూర్వపువాఁడై యుండునని పీఠికాకారులు తలంచియున్నారు. ఇతరములైన యాధారములు లభించువఱకు నాకాలము సత్యమనియే యంగీకరింతుము

మచ్చుపద్యములు:

శా. శ్రీరామాధవభక్తియుక్తుఁడు పరీక్షిద్భూపుఁ డుద్యత్తమ
ప్రారంభంబున జాహ్నవీతటమునన్ బ్రాయోపవేశక్రియా

చారుండై శుకయోగిచంద్రుఁగని యంచద్భక్తిఁబూజించి యిం
పారన్ భాగవతార్థసారమతఁడుద్యత్ప్రీతిలోఁ దెల్పఁగన్. ౧౮

ఉ. కమలదళాయతేక్షణ వికాసజితాత్మభవాస్త్రలాస! మీ
బొమలను వింట్లు గృహ్యశిఖముల్ గలుగన్ వలరాయఁడీ త్రిలో
కములను గెల్చెఁగాక! యివిగావనినన్ దృణమాత్రమైన చా
పముఁగొని గెల్చునే! మిగులఁబట్టిన గండశిలీముఖంబులన్. ౨౮

మ. కలముల్ నిత్యములే! విలాసగతులాకల్పంబులే! శౌర్య దో
ర్బలపాండిత్యములున్ జిరస్థితులె? సామ్రాజ్యోన్నతుల్ శాశ్వతం
బులె? కాంతాసుతమిత్రసంగతుల పెంపుల్ స్థైర్య భావంబులే!
తలఁపన్ దేహములైన నమ్మఁదగునే' తథ్యంబుగా భార్గవా! ౩౮

చ. నెలఁతల నమ్మరాదగసి నీతులు పల్కుదురాన చెప్పఁగాఁ
దెలియక మాయలాఁడి కను తేటలు గుబ్బలచిత్తరంబులున్
బలుకులముద్దులున్ నగవుబాగులు గన్గొని చొక్కి మాయఁగా
దలఁపక మోసపోయితిమి, తామరసాక్షుల నమ్మవచ్చునే! ౪౮

## 443 కూచిమంచి వేంకటరాయకవి

ఇతఁడారువేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; కూచిమంచి తిమ్మయమంత్రికిని సుబ్బమాంబకును దనయుఁడు; జగ్గనమంత్రికి పౌత్రుఁడు; సుప్రసిద్ధ కవిశేఖరుఁడైన కూచిమంచి జగ్గకవికి వెంకటరాయకవి మునిమనుమడు; ఇతఁడు వంకాయలపాటి వెంకటకవికి మేనల్లుఁడు; శిష్టు కృష్ణమూర్తికవికిహితుఁడు దేవులపల్లి సీతారామశాస్త్రిగారికిఁ బ్రియశిష్యుఁడు

ఈకవికి "సర్వలక్షణసామ్రాజ్యచక్రవర్తి" యనిబిరుదుకలదఁట. ఇతఁడు "సకలలక్షణసారసంగ్రహము" అను లక్షణ గ్రంథమును,

"మదనగోపాలగోపికాహృదయలోల" అను మకుటముతో మదన గోపాలశతకమును రచియించినట్లు తెలియుచున్నది. లక్షణగ్రంథము నాకులభింపలేదు. శతకము మ ప్రా. పుస్తకభాండాగారమునందున్నది. ఈతని నివాసము గోదావరిమండలమందలి పిఠాపుర సమీపగ్రామము కవి తననుగూర్చి శతకమున వ్రాసికొనిన రెండుపద్యము లీక్రింద నుదాహరింపబడుచున్నవి.

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుఁడఁగూచిమం
చ్వన్వయాంబోధిశశాంకుఁడైన
తిమ్మయనామ మంత్రివరునకఁగనా
మణియగుసుబ్బమాంబకునుసుతుఁడ
ప్రథిత దేవులపల్లివంశసంభూత సీ
తారామశాస్త్రివతంసమణికి
ప్రియశిష్యవరుఁడ, సంస్కృతమున శుద్ధాంధ్ర
మునవాంధ్రము నమజిమూఁడుగతుల
గద్యపద్యాళిచేతను, గవితగూర్చ
నేర్పుగలవాడ, విశ్రమనిర్ణయవిదుఁ
డఁగవిజనశిరోమణిహితుఁడనుర మేశ!
మదనగోపాల! గోపికాహృదయలోల!

సీ. సకలలక్షణసార సంగ్రహాభిప్రాయ
విజ్ఞాననైపుణి వెలసినాఁడ
శ్రీకుక్కుటేశ కృపాకపితేక్షణా
లబ్ధకవిత్వకళాధురంధ
రుండఁగు కవిరాజకుండాలమత్తమ్మ
గేశ్వరుఁడశిష్టుకృష్ణమూర్తి
కవిరాజహితుఁడ వంకాయలపాటి వేం
కటరాయశాస్త్రి శిఖామణికిని

భాగినేయుఁడ, నీపాదపద్మములను
నమ్మినాఁడ, వేంకటరాయనామధేయుఁ
డను శతకము రచించెదఁగొనుము దీని
మదనగోపాల! గోపికాహృదయలోల!

ఈకవి శా. శ. ౧౭౭౦ వ సంవత్సరమున నీశతకమును రచించినట్లు క్రిందిపద్యములోఁ జెప్పుకొనియుండుటచే నితఁడిప్పటికి నూటేండ్లక్రిందటనున్నవాఁడు. (అనగా క్రీ శ. 1848 ప్రాంతము)

సీ. అవనిపై శాలివాహనశకాబ్దంబులు
విష్ణుపదర్షి పృథ్వీధరావ
దాతాంశు సంజ్ఞాన్వితంబులై తనరంగ
నలరారు కీలకహాయనమున
వైశాఖమాసాంత్యపక్షంబున శశాంక
వాసరసంయుక్త వాసుదేవ
తిథివఁ బ్రకటితభక్తి తేజరిల్లఁగ నీదు
శతకము రచియించి సకలవిభుధ

గీ. చక్రవర్తి శుకునకు నీకొసంగితిఁగొను
మతులవనమాల లలితబాహాంతరాళ
చిత్రకాంచితఫాల! రక్షితకుచేల!
మదనగోపాల! గోపికాహృదయలోల!

ఈకవితండ్రియైన తిమ్మయామాత్యుఁడు సంస్కృతమున "సరస హృత్కుముదచంద్రిక" యను కావ్యమును రచియించెనఁట. ఈకవి కుమారుఁడైన శ్రీరామమూర్తి "రామలింగేశ్వర శతకము"ను రచియించెనఁట. ఈకవి మేనమామయైన వంకాయలపాటి వెంకటకవి మదనగోపాలశతకమును రచియించియుండెను. ఆతని చరిత్రము నీగ్రంథమున వేఱొకచో లిఖింపఁబడినది. ఈకవి ప్రపౌత్రుఁడైన

శ్రీరామమూర్తి యొక గ్రంథమాలను స్థాపించి మాతృభాషా సేవ సేయుచు నిప్పుడున్నాఁడు. ఈ వెంకటరాయకవి కవిత్వము సలక్షణమై మనోహరముగానున్నది.

## 444 పిండిప్రోలి లక్ష్మణకవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; గోపాలమంత్రికిని రాజమకును బుత్త్రుఁడు; రామకృష్ణమంత్రికిని శంకరమకును బౌత్త్రుఁడు; కీర్తి సీతారామామాత్యునకును లక్ష్మమ్మకును దౌహిత్రుఁడు; ఇతనినివాసము గోదావరిమండలమందలి కుయ్యేరను గ్రామము. శ్రీ భీమేశ్వర నిలయమగు ద్రాక్షారామక్షేత్రమును రెండుమైళ్ళదూరములోనున్నది.

ఈకుయ్యేరు పిఠాపురసంస్థానములోనిది. ఆర్యవటమను గ్రామమునఁ గాపురముండెడు రావుధర్మరాయఁడను వెలమకులజుఁడు సంవత్సరమునకు గొంతద్రవ్యము నొసంగుపద్ధతిని గుత్తకుదీసికొనెనఁట. ఆగ్రామమున నీకవికుటుంబమునకుండిన మూఁడుపుట్లపండు భూమి నపహరించి జిరాయితీ భూములలోఁ గలిపివైచి వ్యవహరించుకొనుచు నెన్ని విధముల బ్రతిమాలినను విడిచి పెట్టనందునఁ గోపించి, యాతనిని రావణాసురునితోఁ బోల్చి దూషించుచు, రెండర్థములువచ్చునట్లొక కావ్యమును రచించెను. కవియే శ్రీరాముఁడు. కవి భూమికి లంకపొలమనిపేరు. ఆభూమియే సీత. ధర్మారాయఁడు రావణుఁడు. పర్యవసానము లంకావిజయము. కనుక యీకావ్యమునకు లంకావిజయమని పేరు. దీనికి రావణ దమ్మీయమని నామాంతరము కలదు. మొట్టమొదట నీగ్రంథమునకుఁ గవి "రావణదమ్మీయ"మనియే పేరుంచెననియు నీతనితో సమకాలికుఁడు నీతనికిఁ గవిత్వవిషయమునఁ బ్రతిస్పర్థియునగు కృష్ణమూర్తి శాస్త్రికవి "అల్పాచ్ తరంపూర్వం" అను సూత్రమును

బట్టి అల్పాచ్చులుగల పదము పూర్వమందుండవలసివచ్చుటచే దమ్మ రావణీయమనియుండవలయునుగాని, రావణదమ్మీయమనియుండ రాద నియు నాక్షేపింపఁగా గ్రంథనామమును లంకావిజయమనిమార్చెననియు నొక ప్రతీతికలదు. ఇందెంత సత్యముకలదో నిర్ణయింపజాలము.

కవి శ్రీరాముఁడని పైన చెప్పఁబడియున్నను, గ్రంథమున కొన్ని పద్యములలో సీతనిని, లక్ష్మణుఁడుగాను, లంకాపతిగాను, నింకను మఱికొన్ని పేరులతో నాయాసందర్భమునుబట్టి వర్ణించినట్లీక్రింది పద్యములో సూచించియున్నాఁడు.

గీ. లక్ష్మణుండు, లంకాపతి, లక్ష్మణాగ్ర
జుఁడు కవనచారి గోపాలసూనుఁడజను
వంశజాతుఁడు, రాజాంబవత్స, పిండి
ప్రోలి కవివరుఁడను పేళ్ళఁబొదలమీవు.

కవితండ్రి స్వప్నమునఁగనుపడి యీగ్రంథమును రచియించి కుయ్యేరు నందున్న గోపాలస్వామికంకితము చేయుమని చెప్పినట్లు యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. పాత్రభారద్వాజ గోత్రుఁడాపస్తంబ
మునిసూత్రుఁడగు పిండిప్రోలి రామ
కృష్ణమంత్రికి శాంకరీసాధ్వికిని బెద్ద
పట్టి శ్రీతిమ్మయ పద్మనాభ
వేంకటాచలరామవిభులకగ్రభ్రాత
కీర్తి సీతారామాకృతికి లక్ష్మి
యనుసతికిఁదనూజయగు రాజమకుఁపతి
ప్రథితుఁడౌ తిరుపన్న రామకృష్ణ

గీ. నామలక్ష్మణాఖ్యుని వను రాముఁగన్న
తండ్రిగోపాలమంత్రిసమ్మతివిశేష

దేవతామంత్రిద్యుతిభాసిత్రిదివవాసి
కరుణనొకనాఁడు నాకలఁగాననయ్యె.

సీ. ఆరెవట్టంబన్నయూరనుండెడు రావు
బుచ్చయ్య నరసమాపుత్రకుండు
దమ్మన్నరావన ధర్మరాయండన
నిరుపేళ్ళతో నెసఁగు వెలమ
యరయభద్రయ్య జగ్గయ్య తమ్మయ్య భా
వయ్యలన్నలుగురికగ్రజుండు
పుత్రాదిసంపత్తి పొసఁగునతఁడు మన
కుర్వేరు ప్రీతితో గుత్త చేసి

గీ. సీదులంకమాన్యము బల్మి హరించె
గానఁదత్ప్రాప్తికై రామకథయును మన
కథయు జతగాఁగ నర్థంబు ఘటనపఱచి
కృతిరచించి గోపాలునకిమ్ము తనయ!

క. అతనిఁగృతిపతిఁ జేసిన
ఖ్యాతియగుం గార్యసిద్ధియగుఁ గైవల్యం
బేతుదినబ్బును మనకుల
జాతులకందఱకు నిది నిజము లక్ష్మణుఁడా!

ఉ. కొందఱుశబ్దసౌష్టవముఁ గొందఱు భావముఁ గొందఱర్థముం
గొందఱు సంధిసంఘటనఁ గొందఱలంకృతివృత్తి గొందఱుం
గొందఱు తెన్గుసంస్కృతముఁ గొందఱు ఛందము గొందఱన్నియున్
గొందఱు చూతురెల్లకవికోటిభళీయనఁ జేయు మీకృతిన్.

ఈకవికిఁ బ్రపితామహుఁడైన కృష్ణమంత్రియనేకధర్మకార్యము లను గావించినట్లీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. కుయ్యేటికి శాన్యమయ్యున్న తోరాల
కోటి చెంత రచించెదోఁటయొకటి
గ్రామస్థపాంథ తర్పణ మధురోదక
ప్రపనిజావాసాబిరమునఁగట్టె
నలఘుపుణ్యక్షేత్రముల దననిక్షేప
మమరఁ జేసెను రమేశార్పణముగ
నుర్వీసురులకు గృహోపకరణ ధన
క్షేత్రాదిదానముల్ సేసెమిగుల

గీ. భూరిదివ్యాలయ తటాకములుఘటించెఁ
గృతిముఖంబున నత్యంతకీర్తి వడసె
మంత్రిమాత్రుఁడె లోకైకమాన్య పింది
ప్రోలి శ్రీకృష్ణవిభుఁడు పర్బుధనిభుండు.

ఈకృష్ణమంత్రికగ్రజుఁడైన సింగమంత్రి గణపతిరాజువారివద్ద "దివాన్గిరీ" చేసినట్లీక్రిందిపద్యములో వర్ణింపఁబడియున్నాఁడు.

సీ. ప్రకటమా గణపతిరాజువారిజమీ ది
వాన్గిరీచేసె నేవరవిభవుఁడు
బహుదేశభూప సభాపూజ్యుఁడగుచు నం
దలమెక్కితిరిగె నేతరణితేజుఁ
డన్నపానీయవస్త్రాదులనర్థులఁ
దృప్తులఁ జేసె నేదీప్తయశుఁడు
సంగీత సాహిత్యసరసవిద్యలకు నా
శ్రయుఁడనఁదనరె నేచతురబుద్ధి

గీ. యతఁడు హరిభక్తుఁడర్హధర్మానురక్తుఁ
డార్యజనహితుఁడతులగాంభీర్యయుతుఁడు
చారురూపస్మరుఁడు సదాచారపరుఁడు
రుచిరగుణపాళి! సింగనసచివమౌళి!

కవి తనజన్మస్థానమైన కుయ్యేరు నీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

మ. పురమధ్యస్థిత శిష్టదర్పణము నాఁ బూర్వాశ నాత్రేయి భా
స్కరిదూతంబుఁ జేరనీని కరణిం గాలాశమల్లేశుఁ డ
ప్పురలక్ష్మీసఖులోకొన్నాఁ బడమరం బోడ్లమ్మ తాళ్ళమ్మలు
త్తరదిగ్భూమిఁదొరాలకోడుదధిచందంబుబాఁ గుయ్యేటికిన్

శా. భవ్యక్రోశయుగాతిదూరయుతదిగ్భాగస్థమాసంగ తా
చ్ఛవ్యాకీర్ణ తరంగ శీకరసమంచద్గౌతమీనామ స
ద్దివ్యద్వీపవతీ భవాదిమ దిశాత్రేయీ సు సంగోల్లస
ద్గవ్యూతిద్వయదూరసంస్థిత మహాకల్లోలి కుయ్యేరిలన్.

శా. దక్షారామ పురీనిర్మిత గుహాంతస్థాయి భీమేశ సం
జ్ఞక్షోణీధర కార్ముకాంతి కవిరాజ త్సప్త గోదావరా
శుక్షేమంకరనిర్ఝరాను గతసంశుద్ధోత్తరాశీకకు
ల్యాక్షీణోదక సంయుతాది మదిశాస్థాత్రేయి కుయ్యేరిలన్

కవికాలనిర్ణయమునకై శ్రమపడనక్కరలేకుండ గ్రంథరచనాకాలమును కవియే యిట్లుచెప్పియున్నాఁడు. "కల్యబ్దములు ౪౮౯౮ శాలివాహనశకాబ్దంబులు ౧౭౧౯ ఇంగ్లీషుసంవత్సరములు ౧౭౯౭ ఫసలీ ౧౨౦౭ నగు పింగళసంవత్సర శ్రావణమాసములో రచియిప నుద్యోగించియున్న సమయంబున"-

ఇంచుమించుగ నూటయేఁబదియేండ్లక్రిందట నీగ్రంథము రచియింపఁబడినది. ఈకవికిఁ బూర్వము తిట్టుకావ్యములను రచించినవారిలో మొదటివాఁడు కూచిమంచి జగ్గకవి. ఆతఁడీతనివలె ప్రత్యర్థినిర్దేశముగాగాక ప్రత్యక్షముగానే దూషించియుండెను. ఈతఁడట్లుచేయక శ్రీరాముఁడు వృక్షమునుమాటుచేసుకొని వాలిని వధించినట్లు రామకథను మాటుచేసుకొని, శత్రువుపై వాగ్బాణములను ప్రయోగించి

యుండెను. ఈతని వాగ్బాణము శత్రుసంహారమునం దెంతవఱకు బని చేసెనో చెప్పజాలము కాని, లంకభూమిమాత్రమీతనిపరమయ్యెనని తెలియుచున్నది. కవి తన లంకభూమితో సంబంధించిన గాథతో కలిపిచెప్పుటకెంతవఱకు తోడ్పడునో అంతవఱకుమాత్రమే రామాయణమునందలి ముఖ్యకథను గ్రహించెను. ఈతని పద్యములయందు సామాన్యముగా లంకపొలముగాథయే ముందుగా స్ఫురించుచుండును. రామాయణార్థమును గ్రహించుటకుఁ గొంతవఱకు శ్రమపడవలసి వచ్చును. ఈకవి ధారాశుద్ధికలవాఁడును సరసమైన కవిత్వమును జెప్పఁగలవాఁడునై యున్నాఁడు. కాని యీతఁడు చేపట్టినది శ్లేష కావ్యమగుటచే నీతనిసామర్థ్యమిందుఁ బూర్తిగా వ్యక్తమగుట లేదు అయినను

గీ. ఏడుపందుములల్లోకఁ బులెయుఁగలంక
నేలకొలపరక్షేత్రాప్తి మేలుగాదు
పేర్మినాభూమిజాత సంప్రీతితోడ
వీడుమదియె సౌఖ్యములిచ్చువేయునేల.

గీ. జ్యేష్ఠుఁడా! లక్ష్మణాగ్రజక్షేత్రమీవు
వదలకుండిన మోసంబు వచ్చునింకఁ
జండనిర్భీకవనచారి పిండిప్రోలి
కవికు వరునితో రిపుత ముఖ్యముగవలదు.

క. లేదమ్మా కష్టము నీ
కేదమ్మా నేఁగిభీకిఘృణనీవొందవన్
రాదమ్మా యిఁక మిన్నక
పోదమ్మా మదుక్తినిజము పాలుపుగదమ్మా!

ఇత్యాదిపద్యములయందు రెండర్థములును సుగమములై యుండునట్లు రచించియున్నాఁడు. ఇతఁడిట్టి శ్లేషకావ్యమునుగాక, చక్కని ప్రబంధ మునేదైన రచియించియుండునేని యింతకంటె మిక్కిలి మనోహర

ముగా రచియింపఁగలిగియుండుననని చెప్పుటకు సంశయింపఁబని లేదు. ఈతఁడీలంకావిజయముతప్ప వేఱొక గ్రంథమేదియు రచియించినట్లు కన్పట్టదు. ఈతని కాలమున శిష్టు కృష్ణమూర్తియను నొక పండిత కవియుండెను. సర్వకామదాపరిణయాది బహుగ్రంథ నిర్మాతయగు నాతఁడు గొప్పపండితుఁడును ఉభయభాషాకవిత్వ విశారదుఁడునునై యుండెడివాఁడు. ఆకవిచారిత్రమును వేఱుగా వ్రాసియున్నాఁడను. ఈకవులిరువురును ప్రతిస్పర్థులుగా నుండెడివారు. లక్ష్మణకవికంటె కృష్ణమూర్తికవి పండితుఁడనుటలో సంశయము లేదు. లక్ష్మణకవికంటె నాతఁ డనేకగ్రంథములను రచియించి, యనేక రాజాశ్రయములను సంపాదించియుండెను. ఆతఁడు సాధుస్వభావముకలవాఁడు. లక్ష్మణ కవి యుక్తిపరుఁడును సమయోచితజ్ఞానముకలవాఁడును వాగ్యుద్ధమున గుశలుఁడునగుటచేఁ గృష్ణమూర్తికవికంటె లక్ష్మణకవి సమర్థుఁడని లోకముతలంచినను, పండితులట్లుతలంపరు. ఈయిరువురికవులనుగూర్చి కథలనేకములుకలవు కాని యందు వీరేశలింగముపంతులుగారు గ్రంథస్థముచేసిన యొకకథనుమాత్ర మాయన వాక్యములతో క్రింద వ్రాయుచున్నాఁడను. తక్కినకథలవలన భాషకుఁగాని చారిత్రమునకు గాని యుపయోగపడునంశములంతగా లేనందునను, గ్రంథవిస్తరభీ చేతను వానినిందుఁ జేర్పలేదు.

"ఇట్లుండఁగా గృష్ణమూర్తికవి తానురచియించిన సర్వకామదా పరిణయమను ప్రబంధమును రామచంద్రపుర సంస్థానాధిపతియైన కాకర్లపూడి రామచంద్రరాజుగారి తమ్ముఁడైన జగన్నాథరాజున కంకితముచేయుటకయి కాజులూరుగ్రామమునకుఁబోవుట తటస్థించెను. ఆపుస్తకమును జదివించి విద్వత్కవిసమ్ముఖమ్మున వినుటకు నిర్ణయింప బడినదినమునందు లక్ష్మణకవియు నాహూతుఁడయ్యును సభకుఁబోయి కృష్ణమూర్తికవిని బదుగురిలోఁ బరాభవింపవలయు నన్నదృఢనిశ్చయ ముతోఁగూరుచుండియుండెను. సర్వకామదాపరిణయములోని

చ. తరణిశశాంకులాభరణదంభమునన్వదనాక్షికైతవం
బురుడసితోత్పలాగ్రమనమద్దియ కుంతలదేశమాక్రమిం
చిరొకఫలంబుగాననగు జివ్వనుచుంబరరూపయుక్తి ని
బ్బరముగ నంతసాంతముగ బ్రహ్మయొనర్చిన సీమపొల్పగున్.

అనుపద్యమును జదివినప్పుడు లక్ష్మణకవి విని తలయూచి నవ్వి యిందలినాయిక యేకాక్షియయిన యవలక్షణరాశియనియు, కన్నులు నల్లకలువలని చెప్పినవానిపైని సూర్యచంద్రులున్నట్టు చెప్పుటచేత నొక కన్ను సూర్యకాంతిచే ముకుళించుకలువయై గుడ్డిదికావలెననియు, ఆభరణదంభమునవచ్చి సూర్యచంద్రులు కుంతలదేశమాక్రమింపఁగా ఇరువురకును దగవురాకుండ బ్రహ్మసరిహద్దునేర్పరచెనని భావము.



# 445 నిమిషకవి వేంకటేశకవి

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. నిమిషకవి వారా శాఖలో నిప్పటికిని నున్నారు ఈకవి 'జ్ఞానభోగి గోడే జగన్నాథయోగి' యనుమకుటములో 102 సీసపద్యములుకల వేదాంత ప్రబోధకమగు శతకమును రచించెను. ఈకవి జగన్నాథయోగి శిష్యుఁడనని శతకాంతమున ఈక్రింది పద్యములో తెలుపుకొన్నాఁడు.

నే నిమిషకవికుల వేంకటేశ కవిని
గురుకటాక్షమునను నేర్చుకొన్న కరణి
సీస శతకంబు సంపూర్తి చేసినాఁడ
జ్ఞానభోగి! గోడే జగన్నాథయోగి ...102వ పద్యం

ఈయోగి చెన్నమల్లయగోత్రమందు జన్మించిన గోడే వేంకటరావునకు చెల్లమాంబయందు జన్మించినాఁడు. ఈయన తొలుత జగన్నాథరావని వ్యవహరింపబడుచు యోగియై జగన్నాథయోగి యయ్యెనని యీక్రిందిపద్యము తెల్పుచున్నది.

సీ. మహిని సచ్ఛత్రచామర చెన్నమల్లయ
గోత్రోద్భవుండు, సద్గుణుఁడు, తాత
యాఖ్యుండు, తత్సాధ్వి యగు వేంకయాంబ గ
ర్భోదధియం డర్కభుఁడుదిత పురుష
కంఠీరవుండు వేంకటరావు, తత్కాంత
చెల్లయాంబాత్మజ శేఖరుఁడవు
నయముగా నిను జగన్నాథరావంచును
జేరిసి పేరిమిఁ బిలుచుచుండ

గీ॥ వర పరబ్రహ్మమనియెడి పరమగురుఁడు
వరుస తత్త్వోపదేశంబు కరుణఁజేసి
రాగ మలర జగన్నాథ యోగియనియె
జ్ఞానభోగి! గోదే జగన్నాథ యోగి

ఈ శతకము క్రీ శ. 1870వ సంవత్సరములో విశాఖపట్టణమున ముద్రింపబడినది. కవికూడా ఆ కాలమువాఁడేయని చెప్పవచ్చును. కవియు ఆమండలమువాఁడే. శైలికై యొక్క పద్యముదాహరించెదను.

సీ॥ సద్వాసనాయుక్త సత్సంగమంబున
సంతోషమబ్బును, సంతసమున
సద్విచారంబును, సద్విచారంబున
శాంతంబు గలుగును, శాంత గరిమ
నరయ నింద్రియ నిగ్రహంబైన, దమమును
శమదమములను గామము జనించుఁ
గామరు శమ దమాది గుణసమేతంబైన
కామమే పరమమౌ కామ మంద్రు
తలఁప దుర్వాసనా సమేతంబుగాఁగ
భోగ కామమెయౌ, నందు మోహలోభ
మత్సరక్రోధ మదములు మసలుచుండు
జ్ఞానభోగి! గోదే జగన్నాథ యోగి. ...84వ పద్యం

—: ✻ :-: ✻ :—

**Proceedings of The Director of Public Libraries**
**Andhra State.**

MADRAS

Dis. 3331/54 Dated 21-9-54

Sub.– Books and Publications Book entitled 'ANDHRA KAVITARANGINI' Commendation for use in Public Libraries and in Libraries of schools and colleges

Ref:– Letter dated 17th June 1954 from Sri Chaganty Seshayya, Kapileswarapuram; East Godavary.

The Book entitled 'ANDHRA KAVITARANGINI' written by Sri Chaganty Seshayya is recommended for use in all public libraries and in libraries of schools and colleges The undermentioned Officers are therefore, requested to bring this publication to the notice of all the concerned authorities.

2 — Copies may be had from Hindu Dharma Sastra Grandha Nilayam, Kapileswarapuram, East Godavari District

(Sd.) K Raghava Reddy,
For Director of Public Libraries

(True copy Forwarded By Order)

L. Subbarao
Superintendent.

To

All the District Educational Officers, Inspectresses of Girls Schools. Copy to The Principals of all colleges Arts and Professional Copy to the Divisional Inspector of Schools Copy to Sri Chaganty Seshayya, Author Andhra Kavi Tarangini, Kapileswarapuram, East Godavari District.

( True Copy )

Books can be had from :-

CHAGANTY SATYANARAYANA MURTY
103 – A, Marakam Marvad Apartments
Adikmet - HYDERABAD - 500 [illegible]4.